అపరాధ పరిశోధన అనుబంధం—32

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## హంతకులు-ఆగంతకులు

రచన : విజయలక్ష్మి

## 10 సంవత్సరాల ప్రతీకారం

రచన : ఏ. వీ. మోహన్రావ్

## ప్రాణాలు దక్కితే చాలు!

రచన : అజీజ్

## వందకు పదివేలు!!

రచన : వసుంధర

5

"క్రైమ్‌లో తమాషాలు"

అపరాధ పరిశోధన సప్లిమెంట్—32
ఆగస్టు, 1976
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
శాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

# హంతకులు - ఆగంతకులు

## కురుమద్దాలి విజయలక్ష్మి

"ఈ పెళ్ళి నే చేసుకోను," చెప్పింది అరుణ.

"ఏం, ఏమొచ్చింది? కాలేజీలో ఎవడినన్నా ప్రేమించావా?" కోపంగా అన్నాడు చంద్రశేఖరం.

"అలా ఎవడినో ప్రేమించి ఉంటే, నా పెళ్ళి విషయంలో నిన్నింతగా బ్రతిమిలాడ పనిలేదు. పెళ్ళంటూ చేస్తే నాకుకాదు నా శవానికి చెయ్యాల్సివస్తుంది. నీకేకాదు పంతం వస్తే, నీకన్నా మొండిదాన్ని అని గుర్తుంచుకో అన్నయ్యా!"

చంద్రశేఖరం తాపీగా సిగరెట్ అంటించి, ఘాటుగా రెండు దమ్ములు లాగాడు.

"అయితే, ఆరునూరైనా ఈ పెళ్ళి చేసుకోనంటావ్? అంతేనా?"

"అంతే" స్థిరంగా చెప్పింది అరుణ ముఖం పక్కకు తిప్పుకుని.

చంద్రశేఖరం కుర్చీలోంచి లేచి నుంచున్నాడు. కాలితో విసురుగా కుర్చీని అవతలికి తోశాడు.

"అరుణా! శ్రీపతివద్ద నేను ఐదువేలు తీసుకున్నాను. పెళ్ళయింతరువాత మరో ఇరవై వేలు ఇస్తానన్నాడు. శ్రీపతికి మాటిచ్చాను. ఈ పెళ్ళి జరిగి తీరాల్సిందే."

మరోమాట కాస్కారం లేకుండా చంద్రశేఖరం విసురుగా బైటకెళ్ళిపోయాడు.

అరుణ మంచాని కడ్డంగా పడి కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

అరుణ, చంద్రశేఖరం ఒక తండ్రి పిల్లలుగాని ఒక తల్లి పిల్లలు కారు. అరుణకు, చంద్రశేఖరానికి పదేళ్ళ తేడా ఉంది.

పదేళ్ళక్రితం అరుణ తల్లి, తండ్రి ఆరు నెలలు తేడాతో మరణించారు. చంద్రశేఖరం ఇంటికి సర్వాధికారి అయాడు. పెళ్ళాం సుగుణ నోట్లో నాలుక లేనిది. ఖర్మకాలి నోరు తెరిస్తే తన్నులు తప్పవు.

చంద్రశేఖరానికి లేని వ్యసనం లేదు. ఓ పార్టీలో లక్షాధికారి శ్రీపతితో పరిచయం అయింది. పీకదాకా తాగినా నిషా ఎక్కదు శ్రీపతికి. పీపాడు తాగినా అర చుక్క తడుపుకున్నట్లే ఉంటాడు చంద్రశేఖరం. తాగే విషయంలో ఒకరికొకరు తోడయ్యారు. ఆ తర్వాత ప్రాణ మిత్రులయారు. ఒకరింటికి ఒకరు రాకపోకల కూడా మొదలయ్యాయి.

అరుణను చూసిన శ్రీపతికి పెళ్ళిచేసుకుందాం అని బుద్ధి పుట్టింది. అరుణకి పందొమ్మిదేళ్ళు, శ్రీపతికి నలభై దాటాయి. డబ్బుమదించి బలిసిన దున్నపోతులా నల్లగా

ఉంటాడు, అరుణ తెల్లగా ఉంటుంది.

వయసు దేముంది తాను మగాడు బలంగా ఉన్నాడు. డబ్బు మూలుగుతూంది. అరుణ పెళ్ళికి ఒప్పుకుంటుంది అనుకున్నాడు. ఓరోజు చంద్రశేఖరం ఎదురుగుండానే పెళ్ళి విషయం ఎత్తాడు.

"అన్నయ్యకు మీకు స్నేహం కలిసింది. తాగే ఆడ దాన్ని చూచుకుని తాళి కట్టండి, ఇద్దరికీ నోరు తడుపు తుంటుంది," అని అరుణ తొక్కతొక్కిన తాచులా ఛర్రున లేచింది.

'అరుణని పెళ్ళాడి, బలవంతానా నాలుగు సీసాలు ఒకేసారి త్రాగించి, అనుభవించకపోతే నాపేరు శ్రీపతే కాదు,' అనుకున్నాడు శ్రీపతి.

'పెద్దవాడిని నేనుండగా పెద్దమనిషిని పట్టుకుని అంత మాటంటుందా తన చెల్లెలు! అరుణని, శ్రీపతికి కట్టబెట్టి తానూ లక్షాధికారి అయిపోవచ్చు,' అనుకున్నాడు చంద్రశేఖరం.

అరుణ ఇష్టాఇష్టాలతో నిమిత్తం లేకుండా పెళ్ళికి ముహూర్తం పెట్టేశాడు చంద్రశేఖరం.

పోట్లాడింది. ఏడ్చింది. ప్రాధేయపడింది. చివరికి మొండి కత్తి ఎదురు తిరిగింది అరుణ.

"అరుణా!"

సుగుణ పిలుపుతో కళ్ళు తుడుచుకుని, వదినవైపు చూసింది అరుణ.

"ఏమిటొదినా?"

"ఏడుస్తున్నావా?"

"ఏంచేయను? అలాంటిదే చేస్తున్నాను. ముందు ముందు పనికొస్తుందని."

సుగుణ, అరుణ భుజంమీద చెయ్యివేసి ఆప్యాయంగా నిమిరి పక్కనే కూర్చుంది.

"ఏడిస్తే పనులుకావు అరుణా! ఏంచేయాలో ఆలోచిస్తే పనులవుతాయి."

"బాగా ఆలోచించాను. చక్కని ఉపాయం కూడా తోచింది."

"ఏమిటది?" ఆత్రుతగా అడిగింది సుగుణ.

"మన పెరట్లో నుయ్యి ఉంది. వర్షాకాలం నీళ్ళుకూడా నిండుగా ఉన్నాయి. ఈ శరీరం నాది కాదనుకుంటే పెళ్ళైపోతుంది. ఆ శ్రీపతి, అన్నయ్య మెళ్ళోనే తాళి కట్టేస్తాడు."

"అరుణా! చదువుకున్నావ్, ఆత్మహత్య చేసుకుంటానని అనటానికి సిగ్గులేదూ? మీ అన్నయ్య నిన్నెందుకు చదివిస్తున్నారు? ఉద్యోగంచేసి డబ్బు సంపాదిస్తావనే ముందాలోచనతో. శ్రీపతి అడగకపోతే నీ పెళ్ళి మీ అన్నయ్య ఎప్పటికీ చేసేవారు కాదు. ఇప్పుడిహ ఈ పెళ్ళి భగవంతుడు కూడా ఆపలేడు. నేను ఎంతో ఆలోచించాను. ఎప్పటినుంచో నే పోగుచేసిన చిల్లర డబ్బులు నావద్ద మూడొందలున్నాయి. అదిస్తాను. తీసుకుని మీ అన్నయ్యకు కనిపించనంతదూరం వెళ్ళి నీ చదువుకు తగ్గ ఉద్యోగం సంపాదించుకుని బ్రతుకు. అంతకన్నా గత్యంతరం లేదు.

శ్రీపతి నీచాతి నీచుడు. ఓసారి మీ అన్నయ్యకోసం వచ్చాడు. నీవూ మీ అన్నయ్యా లేరు. నా వంటిమీద చేయి వేయబోయాడు. మండుతున్న కట్టెను పొయ్యి

లోంచి తీశాను. తోక ముడిచాడు. భగవంతుడంటూ ఉంటే నిన్ను చల్లగా కాపాడుతాడు.”

సుగుణ చెప్పింది విని నిర్ఘాంతపోయింది అరుణ. అయిదో తరగతి కూడా పూర్తిచేయని వదిన ధైర్యంగా ఎంత ఆలోచించింది? చదువుకున్న తను పిరికిగా చావా లనుకుంది.

“నాకో దారి చూపించావు, వదినా! నీవు దేవతవు” అంది అరుణ ఆనందబాష్పాలు రాలుస్తూ.

## 2

మూడు వందలు, రెండు చీరలు, జాకెట్లు, ఓ టవలు, ఇంకా కావలసిన రెండు మూడు సామానులు సంచీలో పెట్టుకుని, ఓ అర్ధరాత్రి ఇంట్లోంచి బైటపడింది అరుణ. రైల్వేస్టేషనుకొచ్చి రైలు ఎక్కేసింది.

ఫ్రెండ్‌ని రైలెక్కించటానికి వచ్చిన శ్రీపతి రైలు కదిలినప్పుడు అరుణని చూచాడు. ఎల్లుండే తమ పెళ్ళి. అరుణ ఎక్కడికి వెళుతున్నది? ఇంట్లోంచి పారిపోవటం లేదు కదా? ఆ ఆలోచన రాగానే తనూ పరుగెత్తుతూ వచ్చి పక్క కంపార్ట్‌మెంట్‌లో ఎక్కాడు శ్రీపతి.

శ్రీపతి తన్ని చూడటం పరుగెత్తుతూవచ్చి రైలెక్కటమూ అరుణ చూచింది. ఒక్కక్షణం నిలువెల్ల వణికి పోయింది.

‘భయపడితే పనులు కావు. ఉపాయంతో యెదుర నిలవాలి,’ అనుకుంది. ఎక్కడిలేని ధైర్యం వచ్చింది.

మరో అరగంటకి పక్కస్టేషను వస్తుందని అక్కడ అయిదునిమిషాలకన్నా బండి ఆగదని పక్కకూర్చున్న ముసలామెద్వారా తెలుసుకుంది.

అరగంట తర్వాత పక్క స్టేషనులో రైలు ఆగింది. పాసింజర్లు దిగేవైపు ప్లాట్ ఫామ్ ఎత్తుగా ఉంది. లైటు వెలుతురు బాగా ఉంది. రైలు ఆగిన రెండవవైపు కటిక చీకటిగా ఉంది. గూడ్సుబండి పక్క పట్టాలమీద నిలిచి ఉంది. రైలుకి అటుపక్క నుండి దిగాలంటే ప్లాట్ ఫామ్ లేనందున నేల చాలా కిందుగా ఉంది.

రైలు ఆగుతూనే అరుణ తను ఎటు దిగితే రక్షణో గ్రహించుకుంది. ప్లాట్ ఫామ్ వైపుగాక రెండవవైపు ఏ మాత్రం ఆలస్యం చేయకుండా దిగింది.

"అటు దోవలేదమ్మాయ్! ఇటు...దిగాల్సింది." రైల్లో కూర్చున్న ముసలమ్మ కేక వేసింది, అరుణ దిగటం చూసి.

"నాకు తెలుసు" అంది అరుణ రైలు దిగుతూ.

అరుణ రైలు దిగంగానే ఏమాత్రం ఆలోచించలేదు. అటువైపు చాలా చీకటిగా ఉంది. గూడ్సుబండి పెట్టెలు మాత్రం కనిపిస్తున్నాయి. ఓ గూడ్సు పెట్టెకింద దూరి, అటువైపుకి మెల్లిగా చేరి లేచి నిలబడింది.

అరుణ ఎక్కివచ్చిన రైలు కూతవేసి బైలుదేరి వెళ్ళి పోయింది.

శ్రీపతి రైలు ఆగంగానే తన పెట్టెలోకి ఎక్కాడా? తను కంపార్ట్ మెంటులో లేకపోవటం చూసి, తనూ స్టేషనులో దిగిపోలేదు కదా? అలా అయితే తన్ని తప్పక వెంబడిస్తాడు.

శ్రీపతి చేతిలో పడితే ఇహ భగవంతుడుకూడా రక్షించలేడు. పారిపోవాలి.

అరుణ ఆపై ఆలోచించలేదు, పరుగుతీసింది ముందుకు. స్టేషను దాటుతుండగా కాలికి ఎదురురాళ్ళ దెబ్బలు

తగిలాయి. ఓసారి విరిగిపోయిన రైలుబద్దీ అడ్డంగా ఉంటే తూలి ముందుకు పడింది. మళ్ళీ లేచి పరుగుతీసింది.

ఆ సమయంలో శ్రీపతి వెనుకనుంచి తన్ని తరుముతున్నట్లు తాను కాయశక్తులా పరుగుతీసినా శ్రీపతి కబంధ హస్తాలకు చిక్కినట్లు ఒకే ఆలోచన తప్ప, వేరు ఆలోచన రాలేదు అరుణకి.

“ఆగు.”

చీకట్లో వెనుకనుండి భీకరంగా గర్జన వినపడింది అరుణకి.

అరుణ పైప్రాణాలు పైనే పోయాయి. ఐనా పరుగు తీయటం మానలేదు.

రెండు బలమైన హస్తాలు అరుణని గట్టిగా పట్టుకున్నాయి.

“ఎక్కడికి ఇటువైపు పారిపోతున్నావు? ఇటయితే పట్టుపడనని ఉద్దేశ్యమా?”

గుటకలు మింగింది అరుణ.

“ప్రతివాళ్ళకు ఇదో పెద్ద తెగులు. టిక్కట్టు కొనకుండా ప్రయాణం చేయడం అడ్డదారమ్మటి పారిపోవటం. మీ లాంటి వాళ్ళను పట్టుకోటానికే మమ్మల్ని నియమించారు. టిక్కట్టు ఉందా? ఉంటే... కొంటే ఇటెందుకు జారుకుంటావ్? గేటులోంచే పోయేదానివి.” వ్యంగంగా అంటూ ఓ చేత్తో అరుణ జెబ్బ గట్టిగా పుచ్చుకొని, మరో చేత్తో కోటు జేబులోంచి టార్చిలైట్ తీసి, అరుణ ముఖాన ఫోకస్ వేశాడు, టికట్ కలెక్టర్.

‘అమ్మయ్య! ఇతగాడు టికెట్ ఎగ్జామినర్, శ్రీపతి కాడు’ అనుకుంది అరుణ.

"టి... టికట్ ఉందండి!" అంది అరుణ.

"టి.. టి.. టికట్ ఉంటే ఇదేం కర్మ?"

అందంగా, టీనేజ్ వయసులో ఉన్న అరుణని చూసి ఆశ్చర్యపోయాడు టి. సి.

"ఇదిగో టిక్కెట్టు." అరుణ సంచిలోంచి టిక్కెట్ తీసి చూపించింది.

టికట్ కలెక్టర్ చూచాడు. టిక్కెట్ మద్రాసు దాకా ప్రయాణం చేయటానికి ఉంది.

"ఇదేమిటి? పక్క స్టేషనులో కొని ఈ స్టేషనులో దిగావు?"

"ఖర్మ పట్టి." ఇందాక టికట్ కలెక్టర్ ఖర్మ అన్న మాట గుర్తుపెట్టుకుని "ఖర్మ" అన్న మాట నొక్కి పలుకుతూ అంది అరుణ.

"ఓ" బుజాలెగరేసాడు టికట్ కలెక్టర్ సంతకం పెట్టేశాడు టిక్కెట్ మీద.

అరుణ వెళ్ళబోయింది."అమ్మాయ్!" అనటంతో ఆగింది. ఇదేం గోల అనుకుంటూ.

"చూడమ్మా! ఇటు పక్క చాటుగా టిక్కెట్ లేని ఆడవాళ్ళు కొందరు పారిపోతుంటారు. నీవూ ఆ బాపతే అనుకున్నాను. మద్రాసుదాకా టిక్కెట్ కొని ఇటు పరుగున వెళుతున్నావు. మరేమనుకోకు ఇంట్లోంచి పారిపోయి వస్తున్నావా?"

"స్టేషను గేటులోంచి అయితే ఊళ్ళోకి చుట్టు తిరిగి పోవాలి. మా అమ్మమ్మకు సీరియస్ గా ఉందని టెలిగ్రాం వచ్చింది..."

"ఈ ఊళ్ళో దిగేట్లయితే మద్రాసుదాకా టిక్కెట్ ఎందుకు కొన్నావ్?"

పిడుగులాంటి ప్రశ్నతో అరుణ నోరు తక్కున మూత పడింది.

"వస్తా సార్! ఇది నా స్వవిషయం," మరోమాటకు ఆస్కారం ఇవ్వకుండా అరుణ చకచక ముందుకు సాగింది.

మిట్టపల్లాలు, పట్టాలు, గులకరాళ్ళు దాటి అరుణ తిన్నగా ఉన్న తారురోడ్డుమీద కాలుపెట్టింది. రోడ్డు వారగా నుంచుంది ఒక్క క్షణం ఆయాసం తీర్చుకుంటూ.

అరుణ ఆలోచనలు పరిపరివిధాల పోతున్నాయి.

'తన వూరికి దూరంగ మద్రాసులాంటి పట్టణం వెళ్ళి తిండి బట్టకు లోటులేని చిన్న ఉద్యోగం సంపాదించుకుని బ్రతుకుదామనుకుంది. మద్రాసులో తన స్నేహితురాలుంది. తన వూరినుంచి పెళ్ళయి వెళ్ళింది. మద్రాసులో తన ఇంటి అడ్రస్ ఇచ్చింది, ఎప్పుడయినా మద్రాస్ వస్తే రమ్మని... సమయానికి గుర్తువచ్చి ఆ అడ్రస్ తీసుకుని ముందుగా తను మద్రాస్‌కే టిక్కట్ కొంది. స్నేహితు రాలు నీల చాల మంచిది. తనకొచ్చిన ఆపద సహృదయంతో అర్థం చేసుకుంటుంది. అవసరానికి తోడు ఉంటుంది. ఎవరిమీద పడి ఉండక్కరలేదు.'

## 3

"ఏయ్ పిల్లా! ఎవరూ రాలేదా, చూస్తున్నావు, ఎంత?"

అరుణ ఆలోచనలు చెదిరిపొయ్యాయి. ఉలిక్కిపడి చూచింది. ఇద్దరు మొగవాళ్ళు ఎదురుగా నిల్చి ఉన్నారు. వాళ్ళకి తనతో పనేమిటో అర్థంకాలేదు.

"ఎవరు మీరు? ఏం కావాలి?" ధైర్యం తెచ్చుకుని అడిగింది.

"యహా. మేమేం మారువేషంలో ఉన్న ఎర్రటోపీలం కాదులేవే, రేటెంత?" అందులో ఒకడడిగాడు.

"ఏంటి మీరనేది?" అయోమయంగా అడిగింది అరుణ.

"ఏంటే, అర్థంకానట్లు ఫోజిసురుతున్నావ్, ఓ గంట కెంత? రాత్రంతా అయితే ఎంత?"

అరుణకి అర్థమయింది.

"నోరుమూసుకు పొండి. నేనెవరనుకుంటున్నారు?"

"ఒసేయ్! నువ్వు నోర్ మూసుకో. ఈ మూల కాపలా కాసే గుంటలు పాంసింజర్లకోసం కాపోతే దేముడి గుడి కెళ్ళటానికి నుంచుంటారటే! నీ బెట్టుసరికేంగాని, నీ రేటెంతో చెప్పు!"

"నేను మీరనుకుంటున్నటువంటి దాన్నికాదు. స్టేషను నుంచి నడిచొస్తూ ఆయాసంగా ఉంటే నుంచున్నాను."

అరుణ మాటలు వింటూనే ఇద్దరూ పెద్దపెట్టున నవ్వారు.

"ఒరేయ్, ఇది కొత్త పిట్టరోయ్! డబ్బు ఖర్చు కాకుండా పనయిపోద్దిరోయ్!"

"అవునురోయ్! పైగా పతివ్రత."

"అవునవును. ఏయ్ పిల్లా! నువ్వు సతీసావిత్రివా? సీతొమ్మవారివా? ఏదో ఒకటిగాని, ఆ సందులోకి పోదాం పా! ఇంద్రభవనంలాంటి గుడిసె కూడా వుంది."

వాళ్ళు రౌడీలు, పైగా బాగా తాగి ఉన్నారు. ఒకరు గాదు, ఇద్దరు మొగాళ్ళు. ఈ ఏరియా మంచిది కానట్లుంది, వీళ్ళకో, మరి వీళ్ళలాంటివారికో తను చిక్కితే! తన బ్రతుకు కుక్కలు చింపిన విస్తరవుతుంది.

తిరిగి చూడకుండా అరుణ ముందుకు పరుగుతీసింది.

ఇద్దరు రౌడీలు అరుణ వెంటబడ్డారు.

రోడ్డు కొత్తగా వేసిందేమో, రాళ్ళు గతుకులు లేవు. దూరదూరంగా విసిరేసినట్లు ట్యూబ్ లైట్స్ వెలుగుతున్నాయి. రోడ్డుమీద తారు బాగా ఆరలేదు. అరుణ స్లిప్పర్స్ వేసుకున్నా ఆ విషయం తెలుస్తూనే ఉంది.

అరుణ స్కూలులో, కాలేజీలో చాలా ఆటల పోటీల్లో పాల్గొనేది. స్కూలులో రెండుసార్లు, కాలేజీలో ఓసారి పరుగుపందాలలో గెలిచింది. రన్నింగ్ ఛాంపియన్.

రౌడీ లిద్దరూ బాగా తాగి ఉన్నారు. పరుగెత్తుతున్న అరుణని అందుకోలేకపోతున్నారు.

"దాన్ని పట్టకపోతే మనం మొగాళ్ళమే కాదురా!" పరుగెత్తుతూనే అన్నాడు ఒకడు.

"ఒరేయ్! నేను మొగాడినేరా! నాకు మీసాలు కూడా ఉన్నాయి. దాన్ని నే పట్టకపోతే... పట్టకపోతే... అహా... అహా..." రొప్పుతూ అన్నాడు రెండోవాడు.

ఊరు కొత్త. పక్కదారివెంట పరుగెత్తుదామన్నా అదే ప్రమాదానికి దారి తీస్తుందో అని... పైగా రోడ్డు మీద గనక అయితే ఎవరయినా సహాయానికి రావచ్చునని, అరుణ రోడ్డుమీదనే సంధించి వదలిన బాణంలా ముందుకు దూసుకుపోతున్నది. ట్యూబ్ లైట్ దాటి ముందుకు వెళ్ళింది.

రౌడీలు చాలా దగ్గరకు వచ్చేశారు.

"తనని భగవంతుడే రక్షించాలి" అనుకుంది అరుణ వెనక్కి తిరిగిచూడకుండ పరుగుపెడుతూనే.

తారుడబ్బాలో అడుగున మిగిలిన తారు రోడ్డుమీదనే కాస్త పల్లంగా ఉందని పోసి పోయినట్లున్నారు. దాని

మీద కాలేసి జర్రునజారి అంతదూరాన పడ్డాడు ఒకడు. మరొకడు తారుమీద కాళ్ళేసి ఆ కాలు పైకెత్తితే ఈ కాలు తీసుకుంటే ఆ కాలు అతుక్కుపోతూ, తారులో నాట్యం చేస్తున్నాడు.

క్వార్టర్స్‌లాంటి ఇళ్ళు వరసగా కనపడటం చూసి, అరుణ అటువైపు పరుగుతీసింది. పిట్టగోడ తక్కువగా ఉన్న ఓ గోడను దూకి ఓ క్వార్టర్‌లోకి వెళ్ళింది అరుణ. గుబురుగా ఉన్న పూలచెట్లమధ్య దాగొని, రౌడీలు కూడా గోడదూకి వస్తారేమోనని భయంతో, బిగుసుకుపోయి ముడుచుకుని కూర్చుంది.

రౌడీలు రాలేదు, పావుగంటయినా.

పరుగెత్తటంవల్ల వచ్చిన ఆయాసం, భయము తగ్గాయి అరుణకి. పూలపొదల మధ్యనుండి లేచినుంచుంది.

# 4

ఆ ఏరియాలో ఉన్న క్వార్టర్స్ అన్ని ఇంచుమించు ఒకే టైప్‌వి. స్థలానికి ముందు డబ్బు కడితే వాయిదాల పద్ధతిపై ఇళ్ళు కట్టించి, డబ్బు ప్రతినెలా పుచ్చుకుంటారు. అలాటివి.

ఆ ఇంటివాళ్ళ తలుపుతట్టి ఆ రాత్రికి ఆశ్రయం అడిగి ఉదయం రైలెక్కొచ్చు అనుకుంది అరుణ.

ఇంటిలోపల చిన్న లైట్ వెలుగుతూంది. కిటికీ తలుపులు కిందవి వేసివున్నాయి. పైనవి తీసివున్నాయి. తలుపుకి తాళంకప్ప వేలాడుతూంది.

అరుణ ఒక్కనిముషం ఏంచేయాలి, అన్నట్లు అక్కడే నుంచుండిపోయింది.

శరీరం అలసిపోయింది. నిద్ర ముంచుకువస్తున్నది. వీధి మెట్లవేపు కాకుండా ఇంటికి పక్కగా ఉన్న కాస్త

వెడల్పుగల మెట్లమీద చేతిలో సంచీ తలకింద పెట్టుకుని పడుకుంది. పడుకున్న రెండు నిమిషాలకే గేటుతీస్తున్న శబ్దం అయింది.

'రెండో ఆట సినిమాకో, మరి ఎక్కడికైనా వెళ్ళి వచ్చారో ఇంటివాళ్ళు వచ్చి ఉంటారు' అనుకుంది అరుణ.

లేచి వెళ్ళి తనెవరో, తనకొచ్చిన ఆపదేమిటో, ఈ రాత్రికి ఆశ్రయం ఇస్తే ఉదయమే వెళ్ళిపోతానని అరుణ చెప్పాలనుకుంది. కాని వచ్చింది మగవాళ్ళో, ఆడవాళ్ళో ఓ పక్కగా పడుకున్న అరుణకి కనపడలేదు. కోరి మళ్ళీ గోల తెచ్చుకోవటం అవుతుందేమో, అని ఆలోచిస్తుండగానే ఇంటి తలుపులు తాళంతీసిన చప్పుడు, తలుపుతీసి లోపలికి వెళ్ళటం వినపడింది.

అరుణ పడుకున్న చోటునుండి కదలలేదు.

ఐదునిమిషాలు గడిచాయి.

"ధబ్. ధబ్" ఎవరో గోడదూకిన చప్పుడు.

అరుణ తల ఎత్తి చూచింది. గబుక్కున లేచికూర్చుని. ఇంటి వెనకవైపుగా గోడదూకి ఇరువురు వ్యక్తులు నుంచుని ఉండడం అరుణ కంటబడింది.

బాబోయ్! ఆ రౌడీలు మళ్ళీ వచ్చారు. నే ఉన్నచోట చీకటిగా ఉన్నందువల్ల వారికి నే కనపడి ఉండను. అయినా ఇటువచ్చి వెతుకుతే కంటబడక మానను. అనుకుని కూర్చునే జరుగుతూ వాకిలివైపు వచ్చింది. ఏమాత్రం ఆలస్యం చేయకుండా తలుపువద్దకెళ్ళి తలుపుపై కొట్టబోయింది. తలుపులు ఓరగా తెరిచి ఉన్నాయి. గబుక్కున లోపలకి దూరి తలుపులువేసి, అటూ ఇటూ గదంతా చూచింది అరుణ.

గదిలో ఎవరూ లేరు. పక్కగదిలోంచి కూనిరాగం వినపడుతున్నది. నీళ్ళు పడుతున్న శబ్దంకూడా వస్తున్నది. అంటే, లోపల ఉన్న మొగగాని, ఆడగాని స్నానం చేయటమో, మొహం కడుక్కోటమో చేస్తూ ఉండవచ్చు. అది బాత్‌రూం అయి ఉంటుంది.

బాత్‌రూమ్‌లోంచి వచ్చేవారికోసం ఎదురుచూస్తూ అరుణ నుంచుండిపోయింది. అక్కడినుంచే బైటప్రదేశం పక్క కిటికీలోంచి కనపడుతున్నది.

కిటికీలోంచి బైటకు చూచిన అరుణ ఉలిక్కిపడింది.

నీడల్లా కదులుతూ ఇరువురు మనుషులు చెట్లచాటునుంచి ఇంటి ముందువైపు వస్తున్నారు.

తనిప్పుడు బాత్‌రూమ్ తలుపు తట్టి రౌడీలు తనవెంట పడ్డారని లోపలివారితో చెప్పితే 'ఏమిటీ పెథవన్యూసెన్స్. గెటవుట్' అంటే తన పని రెండు విధాల చెడుతుంది.

ఆ రౌడీలుకూడా ఇదే సందని "ఈ పిల్ల మా మనిషి. దీని మొగుడ్ని నేను, దీని అన్నను నేను, అని చెరొకడు బొంకి తనని లాక్కెళితే ఎవరేమీ చేయలేరు. అబద్ధాన్ని తొందరగా నమ్ముతారు. కాసేపు ఈ గదిలోనే దాక్కుంటే, తర్వాత సంగతి ఆలోచిద్దాం' అనుకుంది అరుణ.

గదంతా చూచింది. దాక్కోడానికి బుక్ షల్ఫు చాటునయితే బాగుంది. సరిగ్గా మనిషి పట్టేటంత చోటే ఉంది.

అరుణ ఏమాత్రం ఆలస్యం చేయకుండ బుక్ షల్ఫు చాటుకి వెళ్ళి నుంచుంది.

వరుసక్రమంగా అందంగా ఏటవాలుగా పెట్టిన షల్ఫు

లోని బుక్స్ మధ్య ఖాళీ ఉంది, దానిలోంచి చూస్తుంటే గదంతా కనపడుతున్నది.

"అమ్మయ్య" అనుకుంది అరుణ.

బాత్ రూంలో నీళ్ళచప్పుడు ఆగిపోయింది.

బాత్ రూమ్ తలుపు తెరుచుకోవటం, మూసుకోటం వినపడింది అరుణకి.

వక్షోజాలను కప్పుతూ బ్రాసరీ, టర్కీ టవల్ పెద్ద పెద్ద పూలది నడుంకి చుట్టుకుని, బాబ్డ్ హెయిర్ గల పాతికేళ్ళ సుందరి. ఇంకా కూనిరాగం తీస్తూనే గదిలోకి వచ్చి, ఫుల్ స్పీడ్ లో ఫాన్ పెట్టుకుంది. పౌడర్ అద్దుకుంటూ మంచంమీద కూర్చుంది.

"అమ్మయ్య, ఈ గదిలో ఉంది ఆడదే, ఆ రౌడీలు వెళ్ళిపోతే ఇక భయంలేదు," అనుకుంది అరుణ పుస్తకాల చాటునుండి ఆమెని చూస్తూ.

"టక్ టక్" అతి నెమ్మదిగా తలుపుపై చప్పుడయింది.

అటు అరుణ, ఇటు ఆమె ఉలిక్కిపడ్డారు.

ఆమె తలుపువైపు చూస్తూ ఉండిపోయింది.

"మేడమ్!" బైటనుండి ఎవరో తగ్గు స్వరంలో పిలిచాడు.

"ఎవరు?" అంది ఆమె మంచంమీదనుండి లేచి నుంచుని.

"జాన్ ని. హోటల్ రంగ్ మహల్ ప్రొప్రయిటర్ పంపారు."

"ఓ. వన్ మినిట్. వస్తున్నా" ఆమె ఉత్సాహంగా అని, చకచక టవల్ విసిరి మంచంమీద పారేసి, నైట్ గౌన్ తొడుక్కుంది.

ట్యూబ్ లైట్ స్విచ్ నొక్కింది. గదంతా వెలుగు పరుచుకుంది. వెళ్ళి తలుపు తీసింది.

బైటనున్న ఇరువురు వ్యక్తులు ఆమెని తోసుకుంటూ లోపలికి వచ్చారు.

ఒకడు లోపలికి రాగానే తలుపు గడియవేశాడు.

మరొకడి చేతిలో పిస్టల్ ఉంది. అది సూటిగా ఆమె వైపు గురిపెట్టబడి ఉంది.

రౌడీలు తైలసంస్కారం లేని జుట్టుతో లుంగీలు కట్టుకుని ఉన్నారు. ఈ వచ్చినవారు సూటూ బూటూ, చేతులకు గ్లవుస్‌తో హుందాగా సినిమా విలన్స్‌లా ఉన్నారు. ఈ వచ్చినవాళ్ళు నా వెంటపడ్డ రౌడీలుకాదు, అనుకుంది అరుణ పుస్తకాల చాటునుండి వారిని చూచి.

"ఏమిటీ దౌర్జన్యం?" అంది ఆమె కోపంగా.

"అవసరం అలాటిది. పిచ్చిపిచ్చి వేషాలు వేయక చేతు లెత్తి నుంచో" కఠినంగా అన్నాడు ఓ ఎర్రగళ్ళ బుష్‌కోటు వాలా.

"ఎవరు మీరు, ఎందుకొచ్చారు? నా ఇంట్లో మీ అధికారం ఏమిటి?"

"రాజాకుమార్, జగదీష్‌చంద్ర, దిన్‌కర్ బాబు, వీళ్ళ రహస్యాలు తెలుసుకుని అమాయకురాలిలాగా క్లబ్ డాన్సర్‌లాగా నటిస్తున్నావు కదూ? నువ్వెవ్వరివో, నీవు చేసే పనేమిటో తెలిసిపోయింది. ఇది నీ ఇల్లుకాదు, నీ స్థావరం. ఇంకా చెప్పమంటావా?"

ఆమె వాళ్ళమాటలు వింటూనే నిర్ఘాంతపోయింది.

"మే మెవరమని అడిగావు కదూ? వీడు గంగరాజు' నా పేరు మంగపతి. మే మొచ్చినపనా? పైవాళ్ళ ఆజ్ఞ అమలు జరపటానికి. అదేమిటంటే...?"

మంగపతి ఆమె ఛాతీకి గురిచూచి రెండుసార్లు పిస్టల్ పేల్చాడు. వెంటనే "ఇదీ మే మెచ్చిన పని" అన్నాడు తిరిగి.

సైలెన్సర్ అమర్చిన పిస్టల్ కావటంవల్ల శబ్దం రాలేదు.

ఆమె 'ధబ్'మంటూ నేలమీద పడిపోయింది, కీచుమని అరుస్తూ.

గంగరాజు, మంగరాజు గర్వంగా నవ్వుతూ గదిలో నుండి బైటకు వెళ్ళారు.

ధన్ మని తలుపులు వేయటం, తర్వాత తాళం వేసిన శబ్దం, "తాళంలాగి చూడరా," అనటం వినపడింది అరుణకి.

## 5

అరుణ గజగజ వణికిపోతూ అక్కడే నిలబడిపోయింది.

తను కళ్ళార ఏమి చూచింది? హత్య!

తనేపరిస్థితులలో చిక్కుకుంది? హత్యచేయబడిన గదిలో బందీ అయి, అరుణకి బ్రెయిన్ పనిచేయటం లేదు. కొయ్యబొమ్మలా చాలాసేపు అలానే ఉండిపోయింది.

"ఊ...ఊ... అబ్బ... ఊ...ఊ..."

మూలుగు వింటూనే అరుణలో చైతన్యం కలిగింది.

ఒక్కంగలో పుస్తకాల షెల్ఫు చాటునుండి బైటకు వచ్చింది. గోడవారగా నడుస్తూ వెళ్ళి స్విచ్ నొక్కింది.

ట్యూబ్ లైట్ దేదీప్యమానంగా వెలిగింది.

అరుణ, ఆమెని చూచింది.

ఆమె తల తిప్పి, అరుణని చూచింది.

ఆమె ఛాతీకి చెయ్యి నొక్కిపట్టి లేవటానికి విశ్వ ప్రయత్నంచేస్తూ బాధగా మూలుగుతున్నది కాస్త అరుణని చూచి నిర్ఘాంతపోయింది. ఆ స్థితిలో కూడా తీవ్ర ఆలో

చనతో ఆమె నొసలు ముడిపడ్డాయి.

జాలిగా, భయంగా ఆమెవైపు చూస్తూ తనేమీ నేరస్థురాలిని కాదన్నట్లు తల అడ్డంగా తిప్పింది అరుణ.

"దగ్గరకు రా" అన్నట్లు ఆమె తల ఊపింది.

అరుణ, ఆమె పక్కకెళ్ళి కూర్చుంది.

"నా పేరు అరుణ. మా అన్నయ్య నా కిష్టంలేని పెళ్ళి కుదిర్చితే ఇంట్లోంచి పారిపోయి వచ్చాను. రైలు దిగంగానే నా వెనుక తాగుపోతు రౌడీలు పడ్డారు. వారిని తప్పించుకొని మీ ఇంటి పెరట్లో దాక్కున్నాను. మీరు తలుపేయటం మరచిపోయి బాత్ రూమ్ కెళ్ళారు. నేను గదిలోకి వచ్చాను. కిటికీలోంచి పెరట్లో మనుషులు కనపడ్డారు. ఆ రౌడీలు మళ్ళీ వచ్చారనుకుని, బాత్ రూమ్‌లో ఉన్నవారు ఏదో ఒకటి చెప్పి పంపుతారని పుస్తకాల రాక్ చాటున దాక్కున్నాను. ఆ వచ్చింది నన్నెంటాడిన రౌడీలు కాదు. ఎవరో నాకు తెలియదు. మిమ్మల్ని కాలుస్తారనుకోలేదు. భగవంతుడి సాక్షిగా నిజం చెప్పాను. నన్ను నమ్మండి. మీకేం హెల్ప్ చేయమంటారో చెప్పండి," గబగబ అంది అరుణ.

గదిలో చిన్న నగిషీలు చెక్కిన రోజ్ ఉడ్ రౌండ్ బల్లమీద ఫోన్ ఉంది. ఆమె ఫోన్ వైపు చెయ్యిచాచి "అదిలా అందించు," అంది అతి నెమ్మదిగా.

అరుణ ఫోన్ తీసుకొచ్చి ఆమెముందు ఉంచింది.

ఆమె అరమూతల కళ్ళతో లేని ఓపిక తెచ్చుకుని డయల్ చేసింది. వెంటనే గ్రహించుకుంది, ఫోన్‌కి బైట కనక్షన్ తీసేయబడినట్లు నిరాశగా ఒక్కసారి కళ్ళు మూసుకుంది. గుండెకి చెయ్యి నొక్కిపట్టుకుంది ఇంకా గట్టిగా.

"నీ పేరేమిటి?" అంది ఆమె కళ్ళు తెరిచి.

"అరుణ."

"అరుణా! నా పేరు జూలిమా, పోలీసు శాఖ అంటే అతి నిగూఢమైన ఇంటలిజంస్ శాఖలో సి. ఐ. డీని కొన్ని హత్యా కేసులు పట్టుకోటానికి నన్ను నియమించారు. హంతకు లంతా పేరుపొందిన పెద్దలు. వారి ఆచూకీ తెలుసుకుని ఆ రికార్డ్ అంతా మినీ టేప్ రికార్డర్ అండ్ కమేరాలో పదిలపరిచాను. దానిని నీవు భద్రంగా నే చెప్పినవారికి అందచేయాలి."

"అలాగే తప్పకుండా చేస్తాను. భగవంతుడిమీద ఆన. ఏ పోలీసు ఇన్‌స్పెక్టర్‌కి అందించను," అరుణ, జూలిమా చెయ్యి పుచ్చుకుని అంది.

జూలిమా గుండెకి గుండు తగిలినట్లయితే వెంటనే మరణించేది. గుండెకి కాస్త కిందుగా దెబ్బ తగలటంవల్ల చావుబతుకుల స్థితిలో ఉంది. వెంటనే డాక్టర్ సహాయం ఉన్నట్లయితే బ్రతికేదేమో? గాయంనుండి రక్తస్రావం అంతకంతకు అధికం కావటంతో ఓ పక్క ప్రాణాలు పిండేస్తున్న బాధ, మరో ప్రక్క కర్తవ్యం, కక్ష జూలిమాకి కొనఊపిరి ఉండేటట్లు చేశాయి.

అరుణ పరీక్షగా జూలిమానే చూస్తూ, "చెప్పండి. నన్నేం చేయమంటారో?" అంది.

"అరుణా! నా బాధ ఏమిటో తెలుసా? పోలీసు ఇన్‌స్పెక్టరుకే హత్యానేరాలతో సంబంధం ఉంది. నువ్వు సమాచారం చేర్చవల్సిన చోటు పోలీసుస్టేషన్‌కి కాదు. మా హెడ్ ఆఫీస్‌కి, హైదరాబాద్ వెళ్ళు ఇదీ అడ్రస్" అంటూ జూలిమా వివరంగా అడ్రస్ చెప్పింది. ఏం

చేయాలో కూడా చెప్పి, ఎంత జాగ్రత్తగా మెలగ వలసింది వివరించింది.

ఓ పక్క చెయ్యి నొక్కిపట్టినా గాయంనుండి రక్తం కారిపోతుంటే, కళ్ళు మూతలుపడుతుంటే బలవంతానా తెరుస్తూ, అతినెమ్మదిగా ఆగి ఆగి చెప్పింది జూలిమా.

"నన్నెవరూ పసికట్టలేదనే నా అశ్రద్ధే నా చావుకి కారణం అయింది. అరుణా! నే నింకెంతసేపో బ్రతకను. నా కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. నే చెప్పింది ఒక్కటీ మర్చిపోకు. కాస్త దాహంగా ఉంది. మంచినీళ్ళందుకో."

అరుణ బాత్‌రూమ్‌లోకి వెళ్ళి, గ్లాసునిండా మంచినీళ్లు పట్టుకొచ్చింది.

"మంచినీళ్ళు తెచ్చాను. తాగుతారా? కాస్త తల ఎత్తండి," అంది అరుణ.

జూలిమా తల ఎత్తలేదు.

"నే తాగించుతాను, తాగండి" అంటూ అరుణ, జూలిమా తల ఎత్తింది ఓ చేత్తో. వెంటనే తల వదిలేసింది. మరో చేతిలో ఉన్న గ్లాసు కిందపడిపోయింది.

జూలిమా అంతిమ కోర్కె దాహం తీర్చుకోకుండానే పైలోకానికి వెళ్ళిపోయింది.

దుఃఖం వచ్చింది అరుణకి. మోకాళ్ళలో తలదూర్చి ఏడుస్తూ కూర్చుంది కాసేపు. తర్వాత లేచి కళ్ళు తుడుచుకుంది.

అరుణ, జూలిమాని చూడలేకపోయింది.

లేచివెళ్ళి అంతకుక్రితం జూలిమా కట్టుకుని పక్కపై విసిరేసిన టర్కీటవల్‌ని తెచ్చి, జూలిమామీద కప్పింది. తదుపరి కార్యక్రమానికి పూనుకుంది.

జూలిమా చనిపోతూ చెప్పిన ప్రకారం బుక్ షెల్ఫ్‌లో ఉన్న "యాద్" హిందీ నవల తీసుకుంది. పైకి ఆ నవల లావుపాటి పుస్తకంగా ఉంది. కాని పుస్తకం తెరిస్తే పుస్తకరూపంలో నాలుగువైపులా కాగితం ఉండి, కాగితాలమధ్య అరలా ఖాళీ ఉంది. ఆ ఖాళీలో సిగరెట్ పెట్టె సైజు కెమేరా, ఓ టేప్ రికార్డర్ భద్రపరచి వున్నాయి. దానిని చూచి ఆశ్చర్యపోయింది.

అరుణ దానిని చేతిలోకి తీసుకుంది. నిండు అగ్గిపెట్టె బరువుమాత్రమే ఉంది అది.

సంచీలో పెడితే సంచీ పోవచ్చు, కాబట్టి ఎక్కడ దాయాలి?

అరుణ బట్టల స్టాండ్ వైపు నడిచింది. జూలిమా చీరలు, రకరకాల డ్రస్‌లు స్టాండ్ మీద ఉన్నాయి. పల్చని చీరలో నాలుగు మూరల పీలిక చింపింది. అమూల్యమైన ఆ చిన్న కెమేరా, అండ్ టేప్ రికార్డ్‌ని మూటలా కట్టింది. దానిని నడుంకిందగా, పొత్తికడుపుకి మొల తాడుగా కట్టుకుంది. ఆతర్వాత లంగా, చీర యధావిధిగా కట్టుకుంటే పొత్తికడుపేం ఎత్తుగా లేదు. మామూలుగానే ఉంది. అమ్మయ్య అనుకుంది.

"జూలిమా! నువ్వు చెప్పినట్లు చేస్తాను. ఆపై దైవమే భారం," అంటూ వాకిలివైపు నడిచింది, తన సంచీతో.

జూలిమా హత్యచేసి వెళ్ళినవాళ్ళు వాకిలి తలుపు బైట తాళం వేశారు. ఆ మాట గుర్తురాంగానే శరీరమంతా ముచ్చెమటలుపోశాయి అరుణకి.

హత్యచేయబడిన ప్రదేశంలో, హంతురాలివద్ద తానుంది. ఈ ఇంటికెవరూ రాకపోతే అరిచి గీపెట్టినా లాభంలేదు. శవంప్రక్క తను వంటరిగా ఉండి త్వరలో తానూ ఓ

శవంగా మారిపోతుంది. కాక ఎవరయినా తన్ని చూస్తే ఈ హత్యానేరం తన నెత్తిమీదనే పడుతుంది. ఏం చేయాలి?

అరుణ బాత్‌రూమ్‌లోకెళ్ళి చూచింది. బైటకు దారి లేదు. ఎటాచ్‌డ్ లెట్రిన్ మటుకు ఉంది. అటునుండి దారి లేదు చిన్న వెంటిలేటర్ తప్ప. మళ్ళీ ముందు గదిలోకి వచ్చింది. బుక్‌షెల్ఫ పక్కనే ఇంకో గది తలుపు కనిపించింది.

తలుపుకి అడ్డంగా ఉన్న కర్టెన్ తొలగించి, ఆ గది లోపలికి వెళ్ళింది. అది కిచెన్, అని గ్రహించింది అరుణ.

కిచన్‌లో చిన్న స్టవ్, కప్పుసాసర్లు, నెస్ కేవ్ సీసా, పాలపిండి డబ్బా, టీ కెటిల్ తప్ప ఏమీ లేవు. కిచెన్ పక్కగది తలుపులు తెరిచింది. అది స్టోర్‌రూమ్. ఆ రూమ్ నుంచి పెరట్లోకి వెళ్ళటానికి తలుపు ఉంది. అది లోపల గడియవేసి ఉంది.

నాలుగంగల్లో వెళ్ళి గడియతీసింది అరుణ.

స్టోర్‌రూమ్ తలుపులు బార్లా తెరుచుకున్నాయి.

అరుణ గదిలోంచి బైటకువచ్చి తలుపులు వేసి బైటివేపు గొళ్ళెం బిగించింది.

అప్పుడు తెల్లవారుతూ ఉంది. గంట నాలుగున్నర.

ఏ అడ్డంకూ లేకుండా అరుణ రోడ్డెక్కింది.

# 6

"ఆ... ఇక్కడే ఆపు" అంది అరుణ.

రిక్షా అబ్బి రిక్షా ఆపాడు.

అరుణ రిక్షా దిగి, రిక్షాకి డబ్బులిచ్చింది.

రిక్షా అబ్బి వెళ్ళిపోయాడు. రోడ్డువారగా రిక్షాదిగిన

అరుణ ఎదురుగా ఉన్న పెద్ద రెండంతస్తుల డాబాని పరీక్షగా చూస్తూ నుంచుంది.

గోప్పీ కలర్‌తో ఉన్న మేడయొక్క తలుపులు, కిటికీలు, అందంగా అమర్చిన డిజైన్‌గల ఇనపమెష్, అవన్నీ వివిధ కలర్స్‌తో ఉండి చూడగానే ఆకర్షిస్తూ ఉంది.

మేడచుట్టూ ఆకర్షణీయంగా పూలతోట ఉంది.

వాకిట్లో గూర్ఖా కాపలా ఉన్నాడు.

కారు సరాసరి లోపలి కెళ్ళటానికి పెద్దగేటు, ఎర్ర మట్టితో రాస్తా మేడదాకా ఉంది.

ఇదే, ఇదే, జూలిమా చెప్పిన గుర్తులు సరిగా సరి పోయ్యాయి అనుకుని, అరుణ మేడదగ్గర వచ్చింది.

"ఎవరు కావాలి?" గూర్ఖా అడిగాడు, అరుణని ఎగాదిగా చూస్తూ.

"జూలిమా పంపించింది. నాథ్‌గారిని కలుసుకోవాలి. ముఖ్యమైన పని ఉంది."

"జూలిమా ఎవరు? నాథ్‌గారిని కలుసుకోటం ఏమిటి? ముఖ్యమైన పనేమిటి?" గూర్ఖా అడిగాడు.

జూలిమా చెప్పింది మరణించేముందు. వాకిట్లో గూర్ఖా అడ్డం తగులుతాడు యక్షప్రశ్నలు వేస్తాడు. అది వాడి డ్యూటీ. నువ్వు మొండిగా అక్కడినుంచి కదలకు. పని అవుతుంది.

జూలిమా చెప్పినట్లే గూర్ఖా అరుణని యక్ష ప్రశ్నలు వేస్తున్నాడు. అన్నింటికి తగినట్లుగా జవాబు చెపుతున్నది అరుణ ఏమాత్రం విసుక్కోకుండా.

"నీ సంగతి మా అయ్యగారితో చెప్పొస్తాను. ఇక్కడే ఉండు," అని గూర్ఖా లోపలికి వెళ్ళాడు.

గూర్ఖా లోపలికెళ్ళి వచ్చిందాకా అరుణ అలా నిలబడే ఉంది.

"అయ్యగారు రమ్మంటున్నారు వెళ్ళండి," లోపలికి వెళ్ళొచ్చిన గూర్ఖా వినయంగా అన్నాడు.

అరుణ తనలోతాను నవ్వుకుని, చేతిలో సంచీ ఊగించుకుంటూ ఉషారుగా గేటుదాటి లోపలికి నడిచింది.

పోలీస్ డిపార్ట్‌మెంట్‌కి తానెంతో అనుకోకుండా సహాయం చేస్తున్నది. వాళ్ళ దయ ఉంటే తప్పక తనకో ఉద్యోగం ఇప్పించగలరు. లేనిపోని చిక్కుల్లో ఇరుక్కుంటానేమో అని పిరికి దద్దమ్మలా తను పారిపోటం దేశద్రోహం అవుతుంది. తన కళ్ళముందు హత్య జరిగింది. ఆమె ఇంటల్‌జంస్ శాఖలో వ్యక్తి. తను తప్పకుండా జరిగింది తు. చ. తప్పక వారికి చెప్పాలి. వారే చూసుకుంటారు తదుపరి కార్యక్రమం, అనుకుంటూ అరుణ మేడ వద్ద కొచ్చి, మొదటి మెట్టుమీద కాలు పెట్టింది.

లావుగా పొట్టిగా ఉన్నతను అరుణకి ఎదురొచ్చాడు.

"అయ్యగారు పైనున్నారు వెళ్ళండమ్మా?" అన్నాడు లిఫ్ట్‌వైపు చేయిచాచి చూపించి.

అరుణ లిఫ్ట్ ఎక్కింది.

"ఒక్కంతస్తుకే లిఫ్ట్ దేనికో!" అనుకుంది.

లిఫ్ట్ ఆగంగానే తలుపు తెరిచిన తను చెప్పాడు. "ఈ నడవాలో బారుగా వెళ్ళండి. అయిదో నెంబర్ రూమ్‌లో అయ్యగారు ఉంటారు. కలుసుకుని మాట్లాడండి."

అతను చెప్పినట్లుగానే అరుణ అయిదవ నెంబరు రూమ్ తలుపు నెట్టి లోపలికి నడిచింది.

అది ఎయిర్‌కండిషన్డ్ రూమ్.

అరుణని చూస్తూనే కుర్చీలో కూర్చున్నతను కుర్చీలోంచి చటుక్కున లేచి నుంచున్నాడు.

అతని చేతిలో రివాల్వర్ ఉంది.

అతన్ని చూసిన అరుణ నిర్ఘాంతపోయింది.

"శ్రీపతీ!"

"అవును నేను శ్రీపతినే, కాదు కాదు నీ పతిని రా... రా..." అన్నాడతను కుటిలంగా నవ్వుతూ.

"అరుణా! తిరిగి తిరిగి నా గూటికే వచ్చావు. గుడ్. మంచిపిల్ల ఎప్పుడూ దారితప్పదు. అన్నట్లు ఎలావచ్చావ్, జూలిమా పేరు నీకెలా తెలిసింది?" అన్నాడు శ్రీపతి కొద్దిగా ఆశ్చర్యంతో.

అరుణ మాట్లాడలేదు. శ్రీపతివైపు కళ్ళార్పకుండ చూస్తూ నుంచుంది.

'ఇంటలిజంన్స శాఖ ... పోలీస్ డిపార్ట్మెంట్ ... శ్రీపతి... జూలిమా... దీనిలో ఎక్కడో మోసం వుంది. శ్రీపతి ఎలాంటివాడో, తనెందుకొచ్చిందో చెప్పకూడదు. తనవద్ద వస్తువు బైటపెట్టకూడదు. పులినోట్లో కొచ్చి పడింది తను. ప్రస్తుతానికి ధైర్యము, తెలివి తనకి శ్రీరామ రక్ష. వాటినే ఉపయోగించాలి,' అరుణ ఆలోచిస్తున్నది.

"ఏం మాట్లాడవేం?" శ్రీపతి గద్దించాడు యీసారి.

అరుణ పెదవి విప్పలేదు.

"అరుణా! ఇప్పుడు నువ్వు నా ఆధీనంలో ఉన్నావు. నా ఆజ్ఞ లేనిదే ఒక్క అంగుళం కూడా ఇక్కడనుంచి కదలలేవు. కాబోయే భార్యవు. మర్యాదగా అడుగుతున్నాను. జూలిమా ఎలా తెలుసు? ఇక్కడికెలా వచ్చావ్? నిజం చెప్పావా, నా వద్ద సర్వసౌఖ్యాలూ అనుభవిస్తావు. కాదన్నా, నిజం చెప్పకపోయినా, నేను

గాకి కబురుచేసి నిజం గ్రహించగలను,'' అన్నాడు

గా భార్యవు. ఎంత గొప్పగా చెపుతున్నావ్, నీ
కావటంలో నా ఇష్టాఅయిష్టాల ప్రసక్తి లేదా?''
కోపం నిగ్రహించుకుంటూ అంది.
అన్న నావద్ద అయిదువేలు ముందుగా డబ్బు
న్నాడు, ఆనాడే నువ్వు నా భార్యవి అయావు.
ఉంచు. ముందు నే అడిగిన ప్రశ్నలకు జవాబు
నా వద్ద ఎలాటి వారున్నారో తెలుసా? ఎడం
మనిషిని పట్టుకుపిండితే శరీరంలో చుక్క రక్తం
డా మొత్తం బైటకు నవరంధ్రాలనుండీ రప్పించ
వారికి నిన్నప్పగించను. ఎందుకో తెలుసా? నా
బోయే భార్యవి కనక.''
హుఁ!... భార్య... నన్ను మించిన అందగత్తెలు
వరూ నీ కగ్గినిపించలేదా?''
'ఊర్వశిని చూచాను. రంభను చూచాను. వాళ్ళ
మ్మల్లాంటివారిని చూచాను. ఒక్కొక్కరి రూపు
క్కరిని ఆకర్షిస్తుంది. అదే ప్రేమ. నీవు నాకు
చ్చవ్, ప్రేమించాను. ఇంత డబ్బు సంపాదించాను.
కోసం? నాకు భార్యబిడ్డలు ఉంటే ఎంత బాగుంటుంది?
కే ఇన్నాల్టికి పెళ్ళాడాలని ఓ నిర్ణయానికి వచ్చాను.''
'అఘోరించావ్,' అనుకుంది అరుణ.
''ఎలావచ్చావ్ అరుణా ఇక్కడికి?'' శ్రీపతి మాట
ర్చేసి లాలనగా అడిగాడు. అరుణ క్షణం ఆలోచించి
ర్ణయానికొచ్చింది.
''ఆ రోజు నిన్ను తప్పించుకోవాలని పక్కస్టేషనులో
గాయాను. గూడ్సుపెట్టెలకింద దూరి అటువైపు పరుగు

తీశాను. అంతా చీకటి. దారి తెలియదు. ఇద్దరు తాగి ఉన్న రౌడీలు నా వెంటపడ్డారు. పరుగెత్తి, పరుగెత్తి జూలిమా ఇంటి కాంపౌండ్‌లో దాక్కున్నాను,'' అని అరుణ జరిగింది వివరంగా చెప్పింది. జూలిమా తనకిచ్చిన వస్తువుల విషయం మాత్రం చెప్పలేదు.

''హైదరాబాద్‌లో మా అన్నయ్య నాథ్ ఉన్నాడు. ఎడ్రస్ ఇస్తాను వెళ్ళు నా పేరు చెప్పు. నీకేదయినా ఉద్యోగం ఇప్పిస్తాడు. సాయంచేస్తాడని చెప్పింది. నా పెళ్ళి శ్రీపతితో జరగనుంది అందుకే పారిపోయి వచ్చాను ఇంట్లోంచి... అని ఎప్పుడయితే చెప్పానో జూలిమా ఆలోచించి, మీ పేరు నాథ్‌గా, తన అన్నగా చెప్పి, నన్నిక్కడికి పంపింది. పిచ్చిదాన్ని నమ్మి మోసపోయాను,'' అంది అరుణ కళ్ళవు నీళ్ళు తెచ్చుకుంటూ.

అరుణ చెప్పింది విని ''జూలిమా ఎలా అయినా అమోఘమయిన తెలివితేటలు గలది. చక్కని పథకంవేసి నిన్ను నా వద్దకు పంపింది,'' శ్రీపతి, జూలిమాని మెచ్చుకున్నాడు.

టక, టక టేబుల్ మీద ఉన్న నాలుగు బెల్లులు నొక్కాడు. మరో నిమిషంలో పహిల్వాన్‌లాంటి వాళ్ళు నలుగురు రూమ్‌లో ప్రవేశించారు.

''జూలిమాని ప్రత్యర్థులు చంపేశారు. తొందరగా బైలుదేరి వెళ్ళండి. తను చాలా విషయాలు సేకరించినట్లు, వాళ్ళ జుట్టు మన గుప్పెటలో ఉందని, కాని మన విషయం కూడా బైటపడిందేమో అని అనుమానంగా ఉందని, వచ్చి మాట్లాడుతానని కబురుచేసింది. ఇంతలో అంతా అయిపోయింది. ఈ రాత్రికే వెళ్ళి జూలిమా శవాన్ని మాయంచేయండి. మన గురించి ఒక్క అక్షరం కూడా బైట

రాదు. వీలయితే ఇంట్లో అన్ని వస్తువులమీద పెట్రోలు
సి, అగ్గిపుల్ల గీసి రండి. ఎవరికీ అనుమానం రారాదు
పె. జాగ్రత్త!’’ శ్రీపతి అన్నాడు.
‘‘అలాగే సార్:’’ అన్నారు వాళ్ళు, బయటికి వెళుతూ.

‘‘నిన్న నీవు చెప్పిందంతా నిజమేనా?’’ అన్నాడు
తి, గది తాళంతీసి లోపలికొస్తూ.
గదిలో కాలుపెడుతూనే ఈ ప్రశ్నెందుకడిగాడో
ంకాలేదు అరుణకి.
‘శ్రీపతికి అంతా తెలిసిపోయిందేమో? తన పాత్తి
ంపువద్ద భద్రపరచిన వస్తువు గురించి తెలిసిందా? ఓ వేళ
మన్నా తీశావా? అని అడిగితే నాకేం తెలుసు ఆ
త్యచేసినవాళ్ళే తీసికెళ్ళి ఉంటారు అని బుకాయిస్తే
’
‘‘నా ముఖానేమయినా కోతులాడుతున్నాయా? అడిగిం
నికి జవాబివ్వకుండా అలా చూస్తావ్!’’ శ్రీపతి కోపం
గ్రహించుకుంటూ అన్నాడు.
‘‘ఏమిటీ మీరనేది? నా కర్థంకావటం లేదు.’’
‘‘నిన్న నీవు చెప్పింది నిజమేనా అంటున్నాను.’’
‘‘అంతా నిజమే చెప్పాను.’’
శ్రీపతి ఏమీ మాట్లాడలేదు. ఆలోచిస్తూ అటూ ఇటూ
లు కట్టుకుని పచార్లు చేసూ, మధ్యమధ్య పరీక్షగా
ణని చూస్తున్నాడు.
‘‘అంతానే నిజం చెప్పలేదేమో అనే అనుమానం
కెందుకొచ్చింది,’’ అరుణ ఆగలేక అడిగేసింది.
శ్రీపతి పచార్లు ఆపుచేసి, అరుణవైపు తీవ్రంగా

"ఎవరో పోలీసులకి ఫోన్ చేసి చెప్పారు, జూలిమాని ఫలాని ఇంట్లో హత్యచేశారు. వెళ్ళి చూడండి శవం దొరుకుతుంది, అని. మావాళ్ళు వెళ్ళేటప్పటికి అంతా అయిపోయింది. వేలిముద్రల నిపుణులు, పోలీసు డాక్టరు, వారి పరిశోధన పూర్తయి, జూలిమా శవాన్ని ఆ చోటు నుండి తరలించి, పోలీసుకాపలా పెట్టారు ఆ ఇంటికి. ఇప్పుడేం చేయాలో అర్థంకావటం లేదు."

"నేనేమీ పోలీసులకు ఫోన్ చేయలేదు. అలా చేసే దాన్నే అయితే ఇక్కడికి వచ్చేదాన్నే కాదు. మళ్ళీ మీ చేతికి చిక్కేదాన్ని కాదు."

"మరి పోలీసులకి ఎవరీ విషయం ఫోన్ చేశారు? ఎందుకు చేశారు?"

"ఆ... నాకొకటి తోస్తున్నది. జూలిమాని హత్య చేసినవాళ్ళే పోలీసులకి ఫోన్ చేశారేమో. పోలీసులకు తెలిస్తే మీకేం నష్టం?"

"చాలా ఉంది. కాని వాళ్ళకేమీ తెలియలేదు."

"ఆ విషయం మీరెలా చెప్పగలరు?"

"సింపుల్. ఓ బుల్లి కానిస్టేబుల్ ఆరునెలల క్రితం నాకు స్నేహమయాడు. వాడు డబ్బుకి గడ్డితింటాడు. నే నేదయినా అడిగితే వాడి చలవవల్ల వెంటనే వివరం చెప్పటం, జాగ్రత్తపడటం జరుగుతున్నది. ఆ వెంకటరాజుకి కాస్త గడ్డిపెట్టాను. అంతా చెప్పాడు."

'కానిస్టేబుల్ పేరు వెంకటరాజు' గుర్తు పెట్టుకుంది అరుణ.

"ఏం చెప్పావేమిటి? అయినా వాడు చెప్పింది నిజమని రుజూ ఏమిటి?"

2

"నాకు తెలియదు అరుణా! తాగినవాడు, గడ్డితిన్న
ాడు నిజం చెపుతారు. జూలిమా నాకోసం కొన్ని
ుఖ్యవిషయాలు ఫోటోలు సేకరించింది. అవి పోలీసులకు
ిక్కలేదు. చిక్కితే నాపని ఎప్పుడో అవుట్ అయేది.
వి నా ప్రత్యర్థుల చేతిలోకి వెళ్ళాయి. అనగా జూలిమాని
ాత్యచేసిన వాళ్ళచేతుల్లో పడ్డాయి. వాళ్ళు పోలీసులకు
ాన్ని అందజేయరు. ఎందుకంటే నాతోబాటు వాళ్ళు
రుక్కుంటారు కాబట్టి... అదీగాక నా అసలు ఊరుపేరు
ాళ్ళు తెలుసుకోటం అసాధ్యం. నా గురించికన్నా నీ
ించే ఇప్పుడు నాకు దిగులెక్కువయింది."

"ఎందుకు?"

"పోలీసుల ఎంక్వయిరీలో బైటపడ్డ విషయాలు. జూలి
ాని హత్యచేసిన గదిలో వేలిముద్రలు దొరికాయి. కాలి
ాదం గుర్తులు దొరికాయి. గాజు గ్లాసుమీద, పంపుమీద
ేలిముద్రలు దొరికాయి. జూలిమాగాక మరో ఆడది
దిలో ఉందని నిర్ధారణకి వచ్చారు. వీధితలుపు తాళంవేసి
ండటం, దానిమీద ఏ వేలిముద్ర దొరక్కపోవటం.
వరో వీధిలోంచిగాక దొడ్డిదోవన వెళ్ళారని... ఇలా
న్నో విషయాలు బైటకి వచ్చాయిట. కాని పోలీసులకి
లా తోక అర్థంకాక తలలు బద్దలు కొట్టుకుంటున్నారుట.
అరుణా! జూలిమా హత్యజరిగినచోట అప్పుడు నీ
క్కడే ఉన్నావని పోలీసులకి చెపితే ముందు నిన్ను
ట్టుకుపోయి హత్యానేరం నీమీద మోపి కేసుపెడతారు.
ాని, నేనలాంటి పనిచేయను. ఎందుకో తెలుసా నీమీద
ాకున్న ప్రేమ."

శ్రీపతి బాగా తాగి వచ్చినట్లున్నాడు. ఆగకుండా
ాట్లాడేస్తున్నాడు.

"మిమ్మల్ని చూస్తుంటే జాలేస్తున్నది."

"ఎందుకు?"

"పోలీసులకు నా గురించి చెపితే, నాపై హత్యానేరం మోపి జైల్లో పడేస్తారని పాపం మీకు మాపై జాలి. చ్చొ... చ్చొ... ప్రేమించారు. పెళ్ళాడాలనుకుంటున్నారు. నేను మిమ్మల్ని ప్రేమించలేదు. పెళ్ళాడాలని ఉవ్విళ్ళూరటం లేదు. నన్ను పోలీసులకి పట్టివ్వండి. మనిద్దరినీ వేరుచేయటం వాళ్ళకీ ఇష్టంలేకపోతే నాతో పాటు మిమ్మల్ని చక్కగా జైల్లో పెడతారు. ఇంచక్కా కూర్చుని ఇద్దరం అచ్చం గిల్లాయిలాడుకుందాం. సరదాగా ఉంటుంది," అరుణ వ్యంగ్యంగా అంది.

"స్టుపిడ్. నిన్నందలం ఎక్కిద్దామనుకుంటే అగాధంలో దూకుతానని కూర్చుంటావా? పైగా నీకు తోడు నేను రావాలా? ఇహ మాటలతో ప్రయోజనం లేదు. శ్రీపతి అంటే ఏమిటో చేతలతో చూపిస్తాను. నీ ఇష్టాఅయిష్టాలతో నాకు పని లేదు. మూడురోజుల్లో నీ మెడలో మూడుముళ్ళు బిగించి నా భార్యని చేసుకుని, ఓ స్వీట్ నైట్ నీతో గడపకపోతే నా పేరు శ్రీపతే కాదు" అని శ్రీపతి చరచర గదిలోంచి బైటకు వెళ్ళిపోయాడు. గది తలుపులు మూసి, బైట తాళం వేశాడు.

అరుణ శిలాప్రతిమలా నుంచుండిపోయింది.

# 8

రాత్రి ఎనిమిదిన్నరయింది.

ఆ రోజంతా ఆలోచించి ఓ నిశ్చయానికొచ్చింది అరుణ.

అరుణకోసం భోజనం తెచ్చాడు, రోజూ భోజనం తెచ్చే బోడిగుండు బోండాంగాడు.

అరుణ భోంచేసిందాకా అరుణ గదిలోనే ఉండి, ఆ తర్వాత ఖాళీ ప్లేట్లు తీసుకుని వెళ్ళిపోతాడు. వెళుతూ వెళుతూ గదిబైట తాళంవేసి వెళతాడు.

అరుణ ఉన్న గది ఎయిర్ కండిషన్‌ది. బాత్‌రూమ్, లెట్రిన్ ఎటాచ్‌డ్ ఆ గదిలోనే ఉన్నాయి.

"భోంచేయండి," ప్లేటు, డిష్‌లు బుల్లి రౌండ్ టేబుల్ మీద సర్దుతూ అన్నాడు బోడిగుండు బోండాంగాడు.

"చేతులు కాళ్ళు కడుక్కొస్తాను," అని అరుణ బాత్‌రూంలోకి వెళ్ళి తలుపేసుకుంది. జాకిట్‌కున్న పిన్నునూది తీసి పాదంపక్కగా గీసుకుంది. పాదంపక్క రక్తం చిమ్మింది. తర్వాత పంపు ఫుల్‌గా వదిలింది. దడదడ చప్పుడుచేస్తూ నీళ్ళు కారటం మొదలుపెట్టింది పంపు.

చేత్తో, కాలుపట్టుకుని అరుణ గదిలోంచి కుంటుతూ బైటకు వచ్చింది.

"అమ్మ... అబ్బ... బాత్‌రూంలో ఏదో వుంది. కాలిమీద కుట్టింది. భగభగ మండిపోతున్నది. బాబోయ్ నెప్పి! అబ్బా ప్రాణంపోతుంది," బాత్‌రూమ్ బైట చతికిలబడి కాలుచేత్తో నిమురుకుంటూ యమబాధ పడుతున్నట్లు అంది అరుణ.

"ఏదీ, ఎక్కడ... ఎక్కడ" కంగారుగా బోడిగుండు బోండాంగాడు అరుణవద్దకొచ్చాడు.

అరుణ కాలు చూపించింది. గీసుకున్నచోట ఎర్రగా కంది రక్తం వచ్చి వుంది. "బాత్‌రూమ్‌లో ఏదో వుంది. అది కుట్టింది. కాలు పీక్కుపోతున్నది. మండిపోతున్నది. ముందు అదేమిటో చూడు. పామో, తేలో, మండ్రగబ్బో" అంది అరుణ.

బోడిగుండు బోండాంగాడు బాత్‌రూమ్‌లో దూరి జాగ్రత్తగా మూలమూలలా చూడటం మొదలుపెట్టాడు, పాము, తేలు, మండ్రగబ్బలాంటి విషపుజంతువు కనపడు తుందేమో అని.

బాత్‌రూమ్ తలుపు లోపలినుంచి వేసేదికాదు. బైట నుండి వేసేదే. అరుణ అవకాశాన్ని సద్వినియోగం చేసు కుంది. రక్కున లేచి, స్పీడ్‌గా బాత్‌రూమ్ తలుపువేసి, బైట బోల్ట్ బిగించింది. ఇక వాడు అరచి గీపెట్టినా బయటికి వినిపించదు.

తన గది తలుపు ఓరగా తెరిచి అటూ ఇటూ చూచింది. బైట ఎవరూ లేరు. చేతి సంచీ తీసుకుని గది బైటకు వచ్చి, తలుపుకు వున్న తాళం వేసి, తాళంచెవి సంచీలో వేసుకుని, జాగ్రత్తగా నలువైపులా చూస్తూ మేడ వెనుకభాగం వైపు చేరింది అరుణ.

ఈ మేడకి మెట్లెటు వున్నాయో తెలియదు. మెట్లు వుపయోగించేటట్లయితే ఒక్కంత స్తుకే లిఫ్ట్ ఎందుకు పెడతారు? కాబట్టి కిందకు వెళ్ళడానికి మార్గం లిఫ్ట్ ఒక్కటే. లిఫ్ట్‌వద్ద మనిషి ఉంటాడు. వాడిని మోసం చేయటం కష్టం. పైగా పైనొకడు ముందొకడు. ఇద్ద రున్నారు. మేడమీదనుంచి దూకితే కాళ్ళిరుగుతాయి అనుకుంది అరుణ.

పిట్టగోడమీదనుండి వంగి కిందకు చూచింది. చీకటిగా ఉన్నా ప్రదేశం కనపడుతూనే ఉంది మసకగా. పూల కుండీలు, అందంగా కత్తిరించబడిన పూలపొదలు, గుబురుగా ఉన్న లాన్, నిశ్శబ్దంగా ఉంది. అక్కడ ఒక్క దీపం కూడా వెలగటంలేదు.

అరుణ సంచీలోంచి తన రెండు చీరలు తీసింది. రెండు లు కలిపి గట్టిగా ముడివేసింది. చీరని డాబా పిట్టగోడ ౖ ఇనప కడ్డీకి కట్టింది. డాబామీదనుండి కిందకు జార చింది. చీరను పట్టుకుని మొండిధైర్యంతో మెల్లిగా గుతూ డాబాకింద కొచ్చేసింది.

అరుణ కాళ్ళకు క్రింద నేల తగిలింది.

చీరెను అలానే వదిలేసి కుండీలమధ్యనుండి పొదల ్క నుండి వంగుని నడుస్తూ, పరిసరాలు గమనించింది. కిలివైపు లైట్స్ ఉన్నాయి. మేడకి ఎటుపక్కా లైట్సు ిగటంలేదు.

వాకిట్లోంచి పోవాలంటే గూర్కా కాపలా వున్నాడు. ిడిచేతిలో తుపాకి, బొడ్లో కత్తి ఉన్నాయి. పోనీ దదూకి పోదామంటే గోడలు ఏడడుగుల ఎత్తులో న్నాయి. వాకిలినుంచి తప్ప మరో దారిలేదు.

అరుణ అధైర్యపడలేదు. కుండీలలో ఉన్న క్రోటన్స్ ముక్కలను పీకి అవతల పడేసింది. గోడదగ్గరకు కుండీలు తెచ్చి కుండీమీద కుండీ మూడు కుండీలు పేర్చింది. ఆ ండీలమీద ఎక్కి గోడ అందుకుంది. గోడనిండా గాజు పెంకులు గుచ్చారు. ఓ గాజుపెంకు అరుణ చేతిని ముద్దు పెట్టుకుంది.

మేడమీద లైట్స్ ఒక్కసారి వెలిగాయి. మనుషులు అటూ ఇటూ పరుగెత్తున్న చప్పుడు. పెద్దగా మాటలు వినిపించాయి.

అరుణ చటుక్కున కుండీలమీదనుండి క్రిందకు దూకింది. ఓ పొదలో దూరింది.

“అది ఎంతోదూరం పారిపోయి ఉండదు. అందరూ వెళ్ళి వెతకండి. ముందు ఇంటి చుట్టూతా అంగుళం కూడా

వదలకుండా వెతకండి. తర్వాత నాల్గు వీధులకు పదండి,"
అది శ్రీపతి గొంతు గట్టిగా వినిపించింది.

'లాభంలేదు. తనుపడ్డ శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరయింది. నుంచుంటే వాళ్ళు గమనిస్తారు. ఇటుపక్క లైటులేదేమో టార్చ్‌లైట్స్ వేసుకుని వెతుకుతున్నారు. ఏంచేయాలి?'

అరుణ కూర్చుని జరుగుతూ ఓ పక్కకి వచ్చింది. వరసగా మూడుకార్లు ఆగి ఉన్నాయి.

"తను ఈ మొక్కలమధ్య ఉంటే పట్టుబడటం ఖాయం. పరుగెత్తినా లాభంలేదు. చివరి ఆశ ఒక్కటే, కారు డిక్కీలో దాక్కోటం. తను అదృష్టవంతురాలయితే వాళ్ళు గమనించకపోవచ్చు."

కారు డిక్కీకి తాళం వేసిలేదు. అరుణ డిక్కీలో దూరి తలుపేసుకుంది. కాస్త మాత్రం డిక్కీ తలుపు ఎత్తి బైట ఏంజరుగుతుందా అని చూస్తున్నది.

అరుణ కుండీలు పేర్చినచోట చూశారు వాళ్లు. శ్రీపతిని పిల్చారు. కుండీల మీదెక్కి అరుణ గోడదూకి ఉంటుంది అని అభిప్రాయపడ్డారు.

"సైకిళ్ళమీద, స్కూటర్‌మీద, కార్లమీద వెళ్ళి వెతకండి. అరుణ ఎక్కడున్నాసరే వెంటనే లాక్కురావాలి, లేకపోతే మనందరి ప్రాణాలకి ముప్పు. పరుగెత్తండి."

శ్రీపతి కంచుకంఠం పెద్దగా, కంగాయగా వినిపించి నవ్వుకుంది అరుణ.

అరుణ ఏ కారు డిక్కీలో దూరిందో అదే కారులో శ్రీపతి ఎక్కాడు. స్టీరింగ్ ముందు కూర్చుని శరవేగంగా ముందుకి పోనిచ్చాడు.

గూర్ఖా గేటు తెరిచాడు.

అరుణ, శ్రీపతి ఎక్కిన కారు రోడ్డెక్కింది.

# 9

గాలికోసం అరుణ డిక్కీ మూత కాస్త పైకెత్తి పట్టు కుంది. డిక్కీలో వదిగి కూర్చోటం ఓ చేత్తో మూత ఎత్తి పట్టుకోటం అరుణకి ప్రాణం పోతున్నట్లుగా ఉంది. మెడ, నడుము, చేతులు నెప్పి పుడుతున్నాయి.

శ్రీపతి కారుని చాలా వీధులు తిప్పాడు. బాగా చీకటి దాక్కోటానికి వీలున్న గొందులులాంటి చోట కారు ఆపి నడిచి చూసొచ్చాడు.

అరుణకి డిక్కీలోంచి బైటపడటానికి మాత్రం వీలు చిక్కలేదు.

శ్రీపతికి విసుగుపుట్టిందాకా ఆ చుట్టుపట్ల అన్ని వీధులు గాలించి, చివరికి రైలుస్టేషను వేపు బైలుదేరాడు.

స్టేషనుకెళ్ళే దోవలో ఏదో యాక్సిడెంట్ జరిగింది. ఓ టూరిస్ట్ బస్, ఫుల్ లోడ్ తో వున్న లారీ గుద్దుకున్నాయి. బస్ లో వారికి దెబ్బలు తగిలాయి. లారీడ్రైవర్ అక్కడి కక్కడే మరణించాడు.

కార్లు, స్కూటర్లు చాలా ఆగిపొయ్యాయి. అందరూ దిగి యాక్సిడెంట్ అయినచోట చూస్తున్నారు. శ్రీపతి కారు ఆపుజేసి కారు దిగకుండానే ఎవరినో అడిగాడు "ఏం జరిగింది?" అని.

"ఎవరో ఓ ఇరవైఏళ్ళ అమ్మాయి రోడ్డుకడ్డంగా పరుగెత్తిందిట. లారీ, ఎదురుగా వచ్చే బస్సు ఆ పిల్లను తప్పించటానికి ఒకేవైపు తిప్పి పోనిచ్చారు. రెండూ అమిత స్పీడ్ గా వస్తున్నాయోమో, గుద్దుకున్నాయి.

అబ్బబ్బ! ఆ దృశ్యం చూడలేము,'' అని చెప్పి అతనెళ్ళి పోయాడు.

'ఇరవైఏళ్ళ అమ్మాయి రోడ్డుకడ్డంగా పరుగెత్తింది. యాక్సిడెంట్' శ్రీపతికి ఆ రెండే వినపడుతున్నాయి. చటుక్కున కారుదిగి ముందుకు నడిచాడు.

అరుణ డిక్కీ కొద్దిగా ఎత్తి చూచింది. చీకటిగా ఉన్నది. అటూ ఇటూ కార్లు ఆగివున్నాయి. మనుషుల జాడా లేదు. శ్రీపతి కారుదిగి అక్కడ చూడటానికి వెళ్ళాడు. ఇదే సమయం.

అరుణ డిక్కీ మూత పూర్తిగా ఎత్తి లోపలినుంచి బైటపడింది అటూ ఇటూ చూచింది. చాలా కార్లు ఆగి ఉన్నాయి.

పోలీసు లొచ్చారు. యాక్సిడెంట్ అయినచోట మనుషులు గుమిగూడటం అటూ ఇటూ సందులేకుండా కార్లు ఆగి ఉండటం చూచి మనుషులని లాఠీకర్రలతో అదమాయించి తరిమేశారు.

అందరూ వెనక్కురావటం మొదలుపెట్టారు. శ్రీపతి రావటం కూడా చూసింది అరుణ. చటుక్కున తనొచ్చిన కారు ఆ పక్కకారూ దాటి ఓ బుల్లి కారుదగ్గర ఆగింది. డోర్‌లాగి చూచింది. డోర్ తెరుచుకుంది. ఏమాత్రం ఆలశ్యం చేయకుండ కారులో ఎక్కింది. వెనక సీటుకింద ముడుచుకు పడుకుంది.

ఆ కారు ఎవరిదోకాని, డోర్ తెరిచి స్టీరింగ్ ముందు మనిషి కూర్చోటం కారుని బాక్‌కి పోనివ్వటం గ్రహించింది, సీటుకింద ఉన్న అరుణ.

పావుగంట ప్రయాణం చేసి, ఆ కారు ఓ చిన్న అందమైన

ముందు ఆగింది. కారు నడుపుతున్నది స్త్రీ. ఆమె
దిగింది.

రు కాంపౌండ్‌లో ఆగటం చూచి, ఇంట్లోంచి
ఏ బైటకు వచ్చాడు. అతను, ఆమె భర్త మురారి.

హాయ్, బిందూ! వచ్చేశావా? అర్జంట్‌గా నాకు
కావాలి. రజనీకాంత్ వాళ్ళు ఊరికి వెళతారుట.
ని స్టేషన్‌దాకా డ్రాప్ చేసి వస్తాను'' అన్నాడు
రి.

ఓ. కె'' అంది బిందు.

'మమ్మీ, మమ్మీ, మేంకూడా డాడీతో స్టేషనుదాకా
ళ్తాము,'' అన్నారు బిందు పిల్లలు.

బిందు అభ్యంతరం చెప్పలేదు.

మురారి కారు వెనుక డోర్ తెరిచాడు. సీటుకింద
చి అరుణ కాళ్ళు కనపడ్డాయి. వెంటనే మనిషి
ారం కూడా కనపడింది.

''బిందూ! ఎవరో చూడు సీటుకింద దాగొన్నారు.
న్, ఎవరది?'' మురారి అరిచాడు.

అరుణ ధైర్యం తెచ్చుకుని సీటుకిందనుండి పైకివచ్చి
రు దిగింది. ఆశ్చర్యపోయి చూస్తున్న బిందు, మురారికి
కులు జోడించింది.

''సిస్టర్! మీరెవరో తెలియదు. నేను ఆపదలో ఉండి
డీల బారినుండి తప్పించుకు పారిపోతూ మీ కారు
దాక్కొన్నాను. యాక్సిడెంట్ జరిగినచోట నేను
కారెక్కాను. దయచేసి నన్ను పోనీయండి. నేను
ంగను కాదు,'' అంది అరుణ.

బిందు, మురారి ముఖముఖాలు చూసుకున్నారు.

"నీ ముఖం చూస్తూనే తెలుస్తున్నది, నీవు దొంగవు కావని. రాత్రిపూట ఎక్కడికి వెళతావు! మా ఇంట్లో ఈ రాత్రికి ఉండు. ఉదయమే ఎక్కడికెళ్ళాలో చెప్పు పంపుతాను," బిందు, అరుణ భుజంమీద చెయ్యివేసి అంది.

వీళ్ళెవరో పెద్దింటివాళ్ళు. మంచి మర్యాదగల వాళ్ళలా ఉన్నారు. మళ్ళీ తను ఆపదలో ఇరుక్కునే గీత ఉంటే ఈ ఇంట్లోనే జరగవచ్చు, బైటకు వెళ్ళినా జరగొచ్చు. వీధికన్న ఇల్లు పదిలం అనుకుంది అరుణ. "అలాగే ఈ రాత్రికి ఆశ్రయం ఇవ్వండి చాలు. ఉదయమే వెళ్ళిపోతాను," అంది.

"అలాగే" అంది బిందు. మురారివైపు తిరిగి "తమ్ముడున్నాడా?" అని అడిగింది.

"ఆ... నిన్న మొన్న నిద్రలేదుగా పడుకున్నాడు. లేపకు," అన్నాడు మురారి.

మురారి, పిల్లలు కారులో వెళ్ళిపోయారు. బిందు, అరుణతో ఇంట్లోకి వచ్చింది.

బిందు, అరుణకి చక్రకేళీపండు, యాపిల్ ముక్కలు, రెండు క్రీం బిసికెట్స్ పెట్టి, హార్లిక్స్ కలిపిచ్చింది.

అరుణ ప్రాణం తేరుకుంది. బిందు మంచి మనిషని గుర్తించింది.

బిందు పక్కమీద వాలుతూ అడిగింది అరుణ కొచ్చిన అపద ఏమిటో.

"తన కిష్టం లేకపోయినా ముసలాడికిచ్చి తన్ని కట్టబెడుతుంటే ఇంట్లోంచి పారిపోయి రావటం, మారుటి అన్న బుద్ధి, వదిన సహాయం, తను రౌడీల చేతిలో పడటం,

ప్పించుకు రావటం" ఓ కథలా చెప్పింది అరుణ, జూలిమా హత్య విషయం తప్ప.

"ఏం చేయాలని నీ ఉద్దేశ్యం?"

"బి. ఏ. ఫష్టియర్ పూర్తయింది. మద్రాసులో నా స్నేహితురాలుంది. దానివద్దకెళ్ళి ఏదయినా జాబ్ చూసుకుంటాను."

"పోనీ ఓ పని చెయ్యి. అక్కడికి వెళితేమాత్రం నీకు జాబ్ దొరుకుతుందనే నమ్మకం ఏముంది? మా ఇంట్లోనే వుండు. నే చూసి పెడతాను నీకేదయినా తగిన జాబ్."

"అమ్మయ్యో, ఈ ఊళ్ళోనా? చచ్చినా నే చేయను" అంది అరుణ.

బిందు మరేమీ అడగలేదు. అంతటితో ఆ ప్రసక్తి ఆపేసింది.

# 10

అరుణ బిందు ఇంటికొచ్చి మూడు రోజులయింది. బిందుకి జ్వరం రావటంతో బిందు కోరికపై అరుణ మద్రాస్ ప్రయాణం మానుకుంది.

"లంచాలు తినని, నమ్మకమైన పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఎవరయినా మీకు తెలుసా? అతను మంచివాడయికూడా ఉండాలి." అడిగింది అరుణ, బిందుని.

బిందు ఫామిలీ అంతా మంచివారు, సహృదయులు అని గ్రహించింది అరుణ.

తనవద్ద ఉన్న వస్తువు పోలీస్ ఇన్‌స్పెక్టర్‌కి అందిస్తే శ్రీపతిలాంటి నీచుల ఆట కడుతుంది. జూలిమా హత్య విషయంలో జరిగింది అంతా చెప్పేయాలి. నిజం వారే తెలుసుకుంటారు. బిందులాంటివారి అండ వుంటే తనకే ఆపదరాదు.

నా కెందుకొచ్చిన గోల అనుకుంటే తనే నేరస్తురాలు అవుతుంది. కాబట్టి వెంటనే తను పోలీస్ ఇన్‌స్పెక్టర్‌ని కలుసుకోవాలి, ఇదీ అరుణ నిర్ణయం.

"ఉన్నారు. ఇన్‌స్పెక్టర్‌తో ఏం పని?" బిందు ఆశ్చర్యంగా అడిగింది.

"ఓ ముఖ్యమైన వస్తువ, మరో అతి నిగూఢమైన రహస్యము వారితో చెప్పాలి."

"నామీద నమ్మకం ఉందా?"

"మీరా! మీరు నాకు ఆప్తులు, అక్కలాంటివారు."

బిందు తృప్తిగా లేచి పక్క గదిలోకి వెళ్ళింది. రెండు నిమిషాలలో తన తమ్ముడితో వచ్చింది.

"అరుణా! వీడు నా తమ్ముడు విజయ్. పోలీస్ ఇన్‌స్పెక్టర్. వారంరోజులు రెస్ట్‌కోసం శెలవు పెట్టాడు. నువ్వు చెప్పేది పూర్తి నిజం, మంచి అయితే నీకే ఆపదా రాకుండా చూస్తాడు."

"నిజమా?" ఆశ్చర్యంగా తన కళ్ళను తనే నమ్మలేక పోయింది. తను మూడు రోజులుగా ఉంటున్నది పోలీసుల ఇంట్లో అని తెలియగానే అరుణకు అంతులేని సంతోషం కలిగింది.

ఇన్‌స్పెక్టర్ విజయ్‌తో జరిగిందంతా పూసగుచ్చినట్లు చెప్పింది అరుణ. శ్రీపతి రెండు ఇళ్ళ అడ్రస్ చెప్పి' జూలియా హత్య, అక్కడ వేలిముద్రలు తనవే అయి ఉంటాయని చెపుతూ, అంతవరకూ దాచిన మినీ కెమేరా, రికార్డర్ విజయ్ చేతిలో పెట్టింది అరుణ.

"జూలియా కేసు అర్థంగాక మేము తలబద్దలు కొట్టుకుంటున్నాము. ఇప్పుడు మంచు విడిపోయినట్లు కేసు విడిపోతుంది," అంటూ విజయ్, అరుణ వేలిముద్రలు

తీసుకుని క్రైమ్ బ్రాంచ్‌కు వెళ్ళిపొయ్యాడు.

"నిజం నిర్భయంగా చెప్పావ్, నీకే ఆపదా రాదు. మంచే జరుగుతుంది," అంది బిందు, ఆప్యాయంగా అరుణ తల నిమురుతూ.

సాయంత్రానికి ఇంట్లో అడుగుపెట్టాడు విజయ్.

"అరుణా! నీ వెన్నో ఆపదల్లో చిక్కున్నావ్! అయినా నిజం నిప్పులాంటిది. అంతా బైటపడింది. ద్రోహులంతా చిక్కారు. నీ విచ్చిన కెమేరా అండ్ టేప్ రికార్డ్ వల్ల, ఎన్నో విషయాలు తెలిశాయి. జూలిమా, శ్రీపతి అసిస్టెంట్. వీళ్ళ పని పెద్ద పెద్ద వాళ్ళని బ్లాక్ మెయిల్ చేసి డబ్బు గుంజటం, స్మగ్లింగు చేయటం. శ్రీపతి పట్టుపడటంతో కథంతా బైటికొచ్చింది.

శ్రీపతి మారు పేరు నాథ్. నీవు చెప్పిన గుర్తులవల్ల జూలిమాని హత్య చేసిన వాళ్ళను పట్టుకున్నాం. వాళ్ళు పాత నేరస్తులు. ఓ లక్షాధికారిని బ్లాక్ మెయిల్ చేసింది జూలిమా. అది తెలిసి జూలిమాని తుదముట్టించటానికి పాత నేరస్తులకి బాగా డబ్బు పెట్టి, అతను జూలిమాని హత్య చేయించాడు. ఆ లక్షాధికారే మాకు ఫోన్ చేశాడు జూలిమా హత్య చేయబడినట్లు.

జూలిమా తీసిన ఫోటోలు, రికార్డ్ చేసిన మాటలవల్ల, ఎందరో దేశద్రోహులు, హంతకులు బైటపడ్డారు. శ్రీపతి, ఆ హంతకులు, అందరూ తమ తమ నేరం ఒప్పుకున్నారు. అడుగడుగునా ఆపద ఎదుర్కొంటూ దేశాని కెంతో సాయం చేశావు," అన్నాడు ఇన్‌స్పెక్టర్ విజయ్.

"నా కిప్పుడెంతో తృప్తిగా ఉంది," అంది అరుణ.

"మీ పోలీసులు శ్రమపడకుండా, అరుణ ఇంత సాయం

చేసింది కదా! మీరిచ్చే ప్రతిఫలం ఏమిటిరా విజయ్?"
బిందు అడిగింది.

"ప్రభుత్వం యాభై వేలరూపాయలు బహుమతి ఇస్తుంది. కారణం ఇప్పుడు పట్టుపడిన వారిలో ఒకడి ఆచోకీ తెలియక బహుమతి ప్రకటించారు. అరుణకి యాభై వేలు అందుతాయి."

"అరుణా! నీకు ఆపదలు తప్పిపోయాయి. ఇహపై నీకు అంతా అదృష్టమే కలిసొస్తుంది," అంది బిందు.

"మొదటి అదృష్టం, మీరు నన్నభిమానించటం!" అంది అరుణ నవ్వుతూ.

-: ఐ పో యిం ది :-

# ది సంవత్సరాల ప్రతీకారం

. వీ. మోహన్రావ్

లాగింది.

గబుక్కున ప్లాట్ ఫామ్ పైకిదూకాను.

ఎదురుగుండా పెద్ద అక్షరాలతో 'విజయవాడ' స్టేషను
ర్డు కనుపించింది.

మెడచుట్టువున్న మఫ్లరును కొద్దిగా వదులు చేసుకుని
ల్లగా మెట్లెక్కి, బ్రిడ్జిమీదుగా గాంధీనగరం వేపు
ుపలకు దిగాను.

రిక్షావాళ్ళు ఈగల్లా చుట్టూ ముసురుకున్నారు.
వద్దని చేత్తోనే సంజ్ఞ చేసి, వాళ్ళ మధ్యనుంచి తప్పు
ు రోడ్ పైకొచ్చాను.

అర్ధరాత్రి దాటింది.

వీధులు దాదాపు నిర్మానుష్యంగా వున్నాయి.

నడచుకుంటూనే వెళ్ళి రిట్జ్ రెస్టారెంటులోని కడుగు పెట్టాను. హాలంతా కలయజూసి, ఖాళీగా వున్న టేబుల్ ముందు కూర్చున్నాను.

సర్వర్ వచ్చి సవినయంగా తలొంచుకొని నిల్చున్నాడు, 'మెనూ' కార్డ్ అందించి.

ఓమారు కార్డును క్రిందినుంచి పైకి పరిశీలించి చూస్తూనే చదువుకున్నాను.

"బాటిల్ బీర్!" అన్నాను.

సర్వర్ వెళ్ళిపోయాడు.

ఎనిమిది సంవత్సరాల తర్వాత విజయవాడకు వచ్చాను నేను. ఇన్నాళ్ళూ, ఈ దినాన ఇక్కడకు రావడంకోసమే బ్రతికాను. మంచికి నాకు నేనే దూరమై, రౌడీలమధ్య పెరిగాను. దొంగతనాలు చేశాను. హత్యను చేసే ఆత్మ ధైర్యం తెచ్చుకున్నాను. నేను జీవితానికి పెట్టుకొన్న ధ్యేయాన్ని సాధించగలనన్న నమ్మకం, ఉంచుకున్న గమ్యం చేరగలనన్న ధైర్యం కూడగట్టుకొని, వచ్చానిక్కడకు.

బీర్ బాటల్ తెచ్చిపెట్టాడు సర్వరు.

నోటితో కార్క్‌ను పళ్ళ సందున బెట్టి ఊడ బెరికి, ప్రక్కకు విసిరాను. గ్లాసు ప్రక్కనున్నా దానికేసి చూడకుండా సీసా అమాంతం పైకెత్తి గటగటమని ఒక్కబిగిన త్రాగేశాను మొత్తం బీరు. సీసా పెద్దగా శబ్దంచేస్తూ టేబుల్ పైన పెట్టాను. చుట్టూవున్న జనం తలెత్తి నాకేసి వింతగా చూడటం గమనించాను.

"ఏమైనా తింటారా?" అడిగాడు సర్వర్.

"మసాలా చికెన్. వీట్ పరోటా!" అరచినట్లు చెప్పాను.

సర్వర్ భయంగా పరుగెత్తాడు లోనికి.

ఫిల్టర్ సిగరెట్ పాకెట్‌లోంచి ఒకదాన్ని లాగి వెలిగించి గుప్పుమని పొగ వదిలాను.

ఆ పొగలోంచి పదేళ్ళనాటి సంఘటన కళ్ళముందు కొచ్చి కనుపించింది.

ఊరిలోని త్రాగుబోతుల్ని, వ్యభిచారుల్ని, జూద గాళ్ళనూ, మకుటం లేని మహారాజులా పరిపాలిస్తుండిన 'చిట్టి'ని అరెస్టు చేసేందుకు వెళ్ళిన మా నాన్న శవమై తిరిగి వచ్చాడు.

ఆయన భౌతికకాయం నా కళ్ళముందు మెదిలింది. మెడచుట్టూ నైలాన్ త్రాడు చుట్టి, బలంగా బిగించి చంపారు ఆయన్ని. మెడంతా కందిపోయి వుండటం గమనించాను. ఆ తర్వాత ఆయన్ని చంపినవాళ్ళకోసం ఎంతో ప్రయత్నించారు. ఎవ్వరూ కనుపించలేదు. కేసు మూసేశారు.

ఇది తేలేందుకు రెండు సంవత్సరాలు పట్టింది. అంత దాకా ఒంటరిగా అక్కడే వుండిపోయాను. ఆ తర్వాత లాభంలేదని బొంబాయి చెక్కేశాను.

ఎనిమిదేళ్ళు బొంబాయిలో తిరిగాను. పెరిగాను. ఇప్పుడు తిరిగి వచ్చాను.

సర్వర్ వచ్చాడు నేను ఆర్డరిచ్చిన చికెన్ మసాలా, వీట్ పరోటాలతో.

తినటం మొదలెట్టాను.

"సార్!" పిలిచాడు మెల్లగా సర్వర్.

ఏమిటన్నట్లు తలెత్తి చూశాను.

"కౌంట్ ఆడుతారా?"

"ఇక్కడుందా?"

"ఉంది! మీకు ఇంటరెస్టు వుంటే తీసుకెళ్తాను!"

"అదంటే నాకు చచ్చేంత ఇంటరెస్టు. పోదామా?" అడిగాను.

"ముందు తినండి! తర్వాత వెళ్దురుగాని!"

చకచక తినేశాను.

చెయ్యి కడుక్కుని సర్వర్‌ని "నడువు" అన్నాను.

అతను నన్ను రెస్టారెంటులోని అల్మైరావద్దకు తీసుకెళ్ళాడు. అక్కడేదో బటన్ నొక్కాడు. ఆ అల్మైరా ప్రక్కకు తొలగిపోయింది. మెట్లు కనుపించాయి. "దిగి తిన్నగా వెళ్ళండి!" అన్నాడు.

"థాంక్స్!" అంటూ వడివడిగా మెట్లు దిగాను.

విశాలమైన హాలు కనుపించింది.

మధ్యగా చిన్న ఇరుసులాంటి దానిపైన పన్నెండడుగుల వ్యాసంతో వున్న గుండ్రని చెక్క ప్లాట్‌ఫామ్ వుంది నల్లటి పెయింట్ పూసివున్నారు పైన. ఒకటినుంచి నూరు దాకా గళ్ళున్నాయి అంకెలతో అంచుకే. మధ్యగా ఓ స్త్రీ నగ్నంగా నిలుచుని వుంది.

అందరి చేతుల్లోనూ ఎర్రని ప్లాస్టిక్ బిళ్ళలున్నాయి. బెల్ మ్రోగింది పెద్దగా.

ప్లాట్‌ఫామ్ పైనున్న స్త్రీ డాన్సు మొదలెట్టింది అంతకుముందే మొదలైన మ్యూజిక్‌కు సరిపోయేట్లు.

ప్లాట్‌ఫామ్ రివ్వున తిరగటం మొదలెట్టింది.

రెండు నిముషాలకాలం తిరిగింది ప్లాట్‌ఫాం. ఆమె కూడా డాన్సు చెయ్యసాగింది. ఉన్నట్లుండి మ్యూజిక్

ఆగిపోయింది. డాన్సు చేస్తున్న స్త్రీ క్రిందపడింది. ఆమె చెయ్యి రెండో నెంబరు గడిపైన పడింది.

అందరూ "నంబర్ టూ, టూ టైమ్స్!" అంటూ అరవసాగారు. నాకు అర్థంకాలేదు. అయోమయంగా అనిపించింది.

ప్రక్కనున్న అతన్ని అడిగి తెలుసుకున్నాను. అలా డిస్క్‌లా తిరుగుతున్న ప్లాట్ ఫామ్ ఆగినప్పుడు, ఆ స్త్రీ కుడిచెయ్యి ఏ నెంబరుపైన పడితే ఆ నెంబరు కట్టినవాళ్ళకు అన్ని రెట్లు ఎక్కువ డబ్బిస్తారని.

నాకూ ఒకచెయ్యి చూద్దామనిపించింది. కానీ ఓడిపోవడం డబ్బు పోగొట్టుకోవడం నా కిష్టంలేదు. అందుకు మార్గమేమిటాని ఆలోచించసాగాను.

డిస్క్‌పైనున్న అందమైన అమ్మాయి ప్రక్కనేవున్న గదిలోకి దూరింది. బెట్టింగులు మొదలైనాయి. అందరూ కౌంటరువైపు హడావుడిగా వెళ్ళారు. నేను చుట్టూ చూసి మనుషులమధ్య కదులుతూ, ఆ అమ్మాయి వెళ్ళిన గదిదాకా వెళ్ళాను. అటూ ఇటూ చూసి తలుపుకున్న హాండిల్‌పైన చెయ్యివేశాను. లిప్తకాలంలో, లోనికి దూరి తలుపు మూశాను.

అద్దంముందు కూర్చునివున్న అమ్మాయి నన్నుచూసి లేచింది. నావైపు తిరిగి "ఎవరు నువ్వు?" అడిగింది.

"యముణ్ణి!" అన్నాను జేబులోంచి కత్తితీసి బటన్ నొక్కి బ్లేడ్ మెరిసేలా పట్టుకుని.

"ఏంకావాలి?" బిక్కపోయి అడిగింది.

"ఈమారు హండ్రెడ్ దగ్గర నీ చెయ్యి పడాలి!" అన్నాను.

"ప్లీజ్ లేదు!"

"అయితే నీకు ప్రాణాలపైన తీపి లేనట్లేనా?"

"నువ్వు చెప్పినట్లు చెయ్యకుంటే చంపుతావా?"

"నిస్సందేహంగా!"

"అలా చేస్తే వీళ్ళు చంపుతారు!"

"వాళ్ళగురించి భయపడకు. నీపైని ఈగ వాలకుండా చూసే పూచీ నాది!" అన్నాను.

"అంత మొనగాడివా?"

"నా మొనగాడితనం చెప్పుకు నేదికాదు!" అన్నాను.

నాకేసి తీక్షణంగా, ఆమె చూడటం గమనించాను.

"ఆల్ రైట్! అలాగే తీస్తాను. నువ్వెళ్ళు. ఎవరైనా చూస్తే నిన్ను ఇక్కడే చంపేస్తారు!" అంది భయంగా.

మాట్లాడకుండా మెల్లగా తలుపు తీసుకుని వచ్చాను వెలుపలకు. జనంలో కలిసిపోయి కౌంటర్ వద్దకు వెళ్ళాను. హండ్రెడ్ పైన హండ్రెడ్ రుపీస్ వేశాను. కౌంటర్లో వున్నతను కాయిన్స్ ఇస్తూ నాకేసి చూడటం, లోలోపల నవ్వుకోవడం గమనించాను.

మళ్ళీ డిస్క్ తిరగడం మొదలైంది. లైట్లు డిమ్ అయినాయి. నగ్నంగా వున్న ఆ అమ్మాయి వచ్చి డాన్సు మొదలెట్టింది. మధ్యమధ్య నాకేసి చూడసాగింది.

నేను కత్తిదాచిన జేబుకేసి చూపించాను ఆమెను హెచ్చరిస్తూ.

డిస్క్ ఆగింది. ఆమె చెయ్యి హండ్రెడ్ పైన పడింది.

జనంలో గగ్గోలు పుట్టుకొచ్చింది. అందరూ నాకేసి విచిత్రంగా చూడసాగారు.

కౌంటరు దగ్గరకు వెళ్ళాను.

పలున్న అతను నన్ను తేరిపారచూపి డబ్బు లెఖ
పదివేలు అందించాడు. నోట్లన్ని జేబులో చెక్కా
ను.

తను వచ్చి నా ప్రక్క నిలబడ్డాడు. అది గమనిం

మిస్టర్! మిమ్మల్ని మా బాస్ రమ్మంటున్నాడు"
డు.

వాడితో నాకు పని లేదు!" అన్నాను.

'ఆయనకు పనుందట, నీతో మాట్లాడాలట!"

"నాకు తీరిక లేదు! అర్జంటుగా వెళ్ళాలి నేను"
న్నాను.

"అంత పెద్దమనిషి పిలిచాక, చూడకుండా వెళ్ళడం
చిదిగాదు. అలా నువ్వు వెళ్ళటంకూడా అసాధ్యమే
కుంటాను" అన్నాడు అతను.

"బెదిరిస్తున్నావా?"

"లేదు పొజిషన్ చెప్తున్నాను."

"నేనెవరో నీకు తెలీదులాగుంది. నా పేరు యముడు.
వర్నీ లెఖచేసేవాణ్ణి కాదు. మీ బాస్‌ను పోయి గంగలో
దూకమను" అంటూ గుమ్మంవేపు నడిచాను.

నలుగురు వస్తాదుల్లాంటి మనుషులు గుమ్మానికి అడ్డంగా
నిలుచున్నారు.

"ప్రక్కకు తొలగండి! నేను వెళ్ళాలి!" అన్నాను.

వాళ్ళెవరూ మాట్లాడలేదు. ప్రక్కకు తొలగలేదు.
అందుబాటులో వున్న లావుపాటి మనిషి పొట్టపైన కుడి
కాలి బూటుతో తన్నాను. వాడు "అమ్మో!" అంటూ
కడుపు పట్టుకొని పడ్డాడు. అదే అదనులో పైకొస్తున్న
ఇంకోడి మెడ విరిగేట్లు కుడిచేయి కత్తిలా పెట్టి కొట్టాను

వాడూ క్రిందపడ్డాడు. మిగిలిన ఇద్దరూ పైకి దూకారు.

రవ్వ క్రిందికి వొంగి, ఇద్దరి కాళ్ళు చేతులతో పట్టుకొని పైకిలేచాను. తలలు నేలకేసి మోదుకున్నాయి. బోరగింతలా పడిపోయారు. కొంచెం గాలిలో ఎత్తున ఎగిరి, వాళ్ళ వీపులమీద కాళ్ళుపెట్టి నిలుచున్నాను. ముందు దెబ్బలుతిన్న ఇద్దరూ లేచేరు. నాపైకి మళ్ళీ రాబోయారు. జేబులోంచి రివాల్వర్ తీసి గురిచూశాను. దాన్ని చూడగానే చేతులు పైకెత్తారు.

అంతలో ఆ అమ్మాయి బట్టలు వేసుకొనివచ్చి నిలుచుంది నాకు కొద్దిదూరంగా. ఆమెను రమ్మన్నాను. వచ్చింది. ఆమెను వెంటబెట్టుకొని పైకొచ్చి బటన్ నొక్కి, రెస్టారెంటుగుండా వీధిలోకి వెళ్ళాను.

టాక్సీలో ఎక్కి కూర్చున్నాం.

"పోనీ!" అన్నాను.

"ఎక్కడకు?" అడిగాడు టాక్సీవాలా.

"తర్వాత చెప్తాను!" అన్నాను.

టాక్సీ బయలుదేరింది.

"ఇంత సాహసం చెయ్యగలరని నే ననుకోలేదు" అందామె.

"నేను ఈ వూరికి ఈ దినమే వచ్చాను. అందుకే ఎవర్నీ చంపడం ఇష్టంలేకపోయింది," అన్నాను.

"ఇప్పుడు ఎలాగో బ్రతికి బయటపడ్డాము. వాళ్ళు వేటకుక్కల్లాంటివాళ్ళు. మనల్ని ఎలాగైనా పట్టుకొని చంపుతారు," అందామె.

"ఆ భయం నీ కవసరంలేదు! ఇంతకూ నీ పేరేమిటి?"

"రాణి! బ్రతుకుతెరువుకోసం ఈవృత్తిలో వున్నాను."

"నీకు ఇల్లుందా?"

"ఉంది!"

"ఎక్కడ."

"కేదారేశ్వరపురంలో."

"అక్కడికి వెళ్దామా?" అడిగాను.

"ఇంట్లో కళ్ళులేని అమ్మ, కాళ్ళులేని చెల్లెలూ వున్నారు. వుండగలుగుతావా?" అడిగింది రాణి.

నా కళ్లు తిరిగిపోయాయి ఆమె మాటలతో. ఇంత అందమైన అమ్మాయి ఎంత నికృష్ణమైన పరిస్థితులమధ్య బ్రతుకుతుందాని.

"వాళ్ళ సాయం నాకు అవసరంలేదు. ఆ ముఠాకు మీ ఇల్లు తెలుసా?".

"తెలీదు!"

'అయితే కొద్ది రోజులు మకాం పెట్టవచ్చు' అను కున్నాను లోలోపలే.

టాక్సీ వేగంగా పోతూనే వుంది.

"మీ పేరేమిటి?"

"ప్రస్తుతానికి యముడని అనుకో! సమయం వచ్చి నప్పుడు నా కథ యావత్తూ చెపుతాను!" అన్నాను.

# 2

రాణిది పెద్ద ఇల్లేమీ కాదు. రెండు గదుల వసారా పైన పెంకు కప్పి వుంది.

ఆ రాత్రికి రెస్ట్ తీసుకున్నాను.

తెల్లావారాక కాలకృత్యాలు తీర్చుకొని డ్రెస్ చేసు కొని కూర్చున్నాను రాణితో చెప్పి వెళ్దామని.

కాఫీ గ్లాసుతో వచ్చింది.

అందుకుంటూ "ఇలాంటివేమీ పెట్టుకోకు!" అన్నాను.

"వెళ్తున్నారా?" అడిగింది.

"ఆఁ!" అన్నాను సిప్ చేస్తూ.

"ఆ తోడేళ్లు ఊరంతా తిరుగుతుంటాయి. జాగ్రత్త. త్వరగా వచ్చెయ్యండి. మీకు భోజనం కూడా ఇక్కడే ఏర్పాటు చేస్తాను!" అంది ఆప్యాయంగా.

"నా గురించి నువ్వు శ్రమ తీసుకోవద్దు. నేను చాలా ముఖ్యమైన పనిమీద ఈ ఊరొచ్చాను. ఎక్కడో తిని, తిరుగుతాను. జాగ్రత్తగా మాత్రం వుండు," అన్నాను.

"పగటిపూట ఫర్వాలేదు! రాత్రి అయితేనే వాళ్ళతో భయం!" అంది.

"అప్పటివరకు నేనొచ్చేస్తాను" అంటూ కాఫీగ్లాసు అక్కడే పెట్టి బయలుదేరాను.

తిన్నగా గవర్నరుపేట సెంటరుకొచ్చాను.

ఆ ప్రాంతాలంతా నాకు బాగా గుర్తున్నాయి. అప్పటికీ ఇప్పటికీ చెప్పుకోదగ్గ మార్పులుకూడా ఏమీ జరగలేదు. మా నాన్నతోపాటు వుండిన ఇంటికేసి వెళ్ళాను.

ఆ ఇంటిముందు పదినిముషాలు నిలబడ్డాను. వెలుపలున్న అరుగును చూస్తే నా గుండెనెవరో పట్టుకుని పిండినట్లయింది. మా నాన్నగారి శవాన్ని తెచ్చి అక్కడే వుంచారు.

ఆయన రూపం నా కళ్ళముందు మెదలింది. తెలీకుండానే తడిసిపోయాయి కనుగుడ్లు. జేబురుమాలుతో తుడుచుకున్నాను. ఆ వీధిలోంచి వెలుపలకు వచ్చి మళ్ళీ సెంటరు చేరుకున్నాను.

ఒక షాపులో దూరి రెండు ఎయిర్ బ్యాగ్‌లు, టవల్సు మొదలైన నిత్యావసర సామగ్రి కొన్నాను. డబ్బిచ్చి,

ా నటరాజ్ హోటల్‌కు వెళ్ళి, ఏ. సీ. రూం

న్నాను.

ంచంపైన వెల్లికింతలా పడుకుని నా కార్యక్రమాన్ని

చించుకోవడం మొదలెట్టాను.

ోన్ మ్రోగింది.

చిత్రంగా చూశాను దానికేసి. నేనొచ్చి అరగంటన్నా

ముందే ఫోన్ రావడం ఆశ్చర్యం కలిగించింది.

సీవరు అందుకున్నాను.

"హల్లో!" అన్నాను మెల్లగా.

"యముదేనా మాట్లాడుతూంది!" అవతలి కంఠం

గురు పోయినట్లుగా వుంది.

"అవును! నువ్వెవరు?" అడిగాను.

"యముడికి యముణ్ణి!" అన్నా డవతలివ్యక్తి పరిహా

గా.

"అలాగా? అయితే ఇప్పుడేం కావాలి?"

"రాత్రి నువ్వు రిట్జ్ రెస్టారెంటులో చేసిన అల్లరి

రుండా. రమ్మన్నా రాకుండా, ఆ పిల్ల రాణిని వెంట

ట్టుకు వెళ్ళావ్. అంతమాత్రంచేత నిన్ను వదిలేస్తానను

న్నావేమో? అది కలలోని మాట. ఎక్కడున్నా వెతి,

ట్టుకొని ఎముకలు నలగ గొట్టిస్తాను."

"ఏడిశావ్! చెయ్యగలిగిన వాడెప్పుడూ ఇలా నీలా

పేలడు" అన్నాను కోపంగా.

"ఆ పిల్లను తెచ్చి కాళ్ళూ చేతులూ కట్టేసి చీకటి

కొట్లో పడేశాను. వచ్చి చూస్తావా?"

"రాస్కెల్! ఆమె జోలికి వెళ్ళావంటే నీకు యమ

పురికి టిక్కెట్టు కొనిస్తాను. మర్యాదగా వదిలెయ్!"

అన్నాను.

"ఒక్క రాత్రికి అంత ప్రేమ పుట్టుకొచ్చిందా? అయితే స్వయంగా వచ్చి ఆమెను విడిపించుకొనిపో! నా కభ్యంతరం లేదు!" అన్నాడు.

"అలాగే!" అన్నాను.

"ఎప్పుడొస్తావ్?"

"రాత్రికి!"

"ఎన్ని గంటలకు?"

"పన్నెండు గంటలకు. దమ్ముంటే నిన్ను నువ్వు కాపాడుకో!"

ఆ తర్వాత ఫోన్ పెట్టేసిన శబ్దం వినిపించింది.

ఫోన్‌లో అతనితో ఛాలెంజి చేశాను. కానీ ఆమెను ఎలా తప్పించి తీసుకురావటం? నేను వస్తానని చెప్పాక తగిన బందోబస్తు చేసుకోకుండా వుండే వాజమ్మలుకాదు వాళ్ళు.

ఏదైనా పథకంతో వాళ్ళను బోల్తా కొట్టించాలి.

బుర్రకు పదును పెట్టసాగాను. రకరకాల ఊహాలు మెదల్తున్నాయి. ఏదీ సరిగా లేదనిపించింది.

రిసెప్షనుకు ఫోన్ చేసి విస్కీ పంపమన్నాను.

బాటల్ వచ్చింది.

దాన్ని త్రాగుతూ, సిగరెట్ కాలుస్తూ ఆలోచించసాగాను.

## 3

టూరిస్టు డిపార్టుమెంటుకు ఫోన్ చేసి ఎయిర్‌కండిషన్డ్ ఇంపాలా రాత్రి ఎనిమిదినుంచి తెల్లవారి ఎనిమిదిదాకా అద్దెకు కావాలని చెప్పాను. వాళ్ళు వెంటనే ఒప్పుకున్నారు. కారును నేనున్న హోటల్‌కు పంపమన్నాను

నా రూంకు సర్వీస్ చేస్తున్న మనిషిని డబ్బాలచూపి బుట్టలో వేసుకున్నాను. నా సర్వెంటుగా కార్లో రిట్జ్ కు వచ్చే ఏర్పాటు చేసుకున్నాను.

రాజకుమారుడిలా మేకప్ చేసుకున్నాను నేను.

సర్వర్ ఆఫ్ డ్యూటీలో వున్నాడు. వాడికీ రాజుల సర్వెంట్ లా మేకప్ చేశాను. ఇద్దరం ఇంపాలా ఎక్కి రిట్జ్ కెళ్ళాము.

నేను కార్లోనే కూర్చున్నాను.

నా సర్వెంట్ లోనికి వెళ్ళాడు. రెండు నిముషాల తర్వాత మరో ఇద్దరు హోటల్ వాలాలతో తిరిగొచ్చాడు. తలుపుతీసి, తలొంచుకొని నిల్చున్నాడు.

చేతికర్ర క్రిందపెట్టి, మెల్లగా దిగాను. ఒక కాలు కుంటుతూ నడిచాను. నల్లటి రైబాన్ గ్లాసెస్ మెర్క్యూరీ పూసినవి పెట్టుకున్నాను. ఒక స్పెషల్ రూంకు తీసు కెళ్ళారు వాళ్ళు నన్ను.

రకరకాల డ్రింకులు తెప్పించి కాక్ టెయిల్ తయారు చేసి ఒక గ్లాసుమాత్రం మెల్లగా పుచ్చుకున్నాను.

మిగిలినవన్నీ తీసెయ్యమన్నాను.

అలాగే రకరకాల డిష్ లు ఆర్డరు చేశాను. అన్ని ప్లేట్లతో తెచ్చిపెట్టారు. కొన్నిమాత్రం కొద్దికొద్దిగా తిని, మిగిలినవి త్రోసేశాను. నా చేష్టలకు సర్వర్లు విచిత్ర పోతున్నారు. అందాకా వెయ్యిరూపాయల సరుకు తెప్పించి అందులో కనీసం పదిరూపాయలకూడా తినలేదు.

నా సర్వెంట్ ని పిలిచి చెవిలో చెప్పాను.

"జీ! హుజూర్!" అంటూ తలూపి వెళ్ళాడు వెలుపలకు.

ఐదునిముషాల తర్వాత ఒక సూట్ వాలాను వెంట బెట్టుకొచ్చాడు.

"నమస్తే రాజాసాబ్!" అన్నాడు.

"ఆఁ!" అన్నాను బింకంగా.

"తమరి కోరిక మీ సర్వెంట్ తెలియపరిచాడు. మీ లాంటి రాజావారు చూసిన అమ్మాయి ఈ దినం మూడ్స్‌లో లేదు. మరో అమ్మాయిని సెలెక్టు చేసుకుంటారా!"

"ఆమె అందంగురించి విన్నాం! అందుకే వచ్చాం! ఎంత డబ్బు కావాలన్నా ఇస్తాను. ఆమెకు మూడ్స్ లేకుంటే మా బసకు పంపండి. మేమే తంటాలుపడి మూడ్స్‌లోకి తెచ్చుకుంటాం!" అన్నాను.

"ఇప్పుడే వస్తాను!" అంటూ అతను వెళ్ళిపోయాడు.

నాకు ధైర్యం, భయం రెండూ కలగాపులగంగా వున్నాయి. ఆ పక్షి నన్ను అనుమానించి వుంటాడాను కున్నాను. అన్నింటికీ సిద్ధమై వచ్చాను కాబట్టి ధైర్యం గానే కూర్చున్నాను.

అంతకుముందు వచ్చి వెళ్ళిన మనిషి తిరిగి వచ్చాడు నా దగ్గరకు.

"అలాగే పంపుతాను! ఐతే ఐదువేలు ఛార్జి చేస్తాం!"

"కాష్ కావాలా? చెక్కిచ్చేదా?"

"కాష్ ఇవ్వండి!"

సర్వెంట్‌తో చెప్పాను ఇమ్మని.

తోలుసంచీ తెరచి అందులోంచి కొంత డబ్బు లెఖ పెట్టి ఇచ్చాడు.

"ఆమెను కారుదగ్గరకు తీసుకురండి," అంటూ క్రిందికి దిగాను మెల్లగా కుంటుకుంటూ.

వెళ్ళి కారెక్కాను.

రాణిని పెడరెక్కలు విరిచిపట్టుకొని ముగ్గురు మెరిక

ల్లాంటి మనుషులు తీసుకొచ్చారు. డోర్ తెరచి వుంది. దాన్లోంచి లోనికి త్రోశారు. ఆమె లోనికి రాగానే, తలుపు మూశాను.

నా వెంటవున్న సర్వెంట్, ముగ్గురు మనుషులకూ, తలో వంద ఇచ్చాడు. వాళ్ళు సలాం చేసి వెళ్ళిపోయారు.

కారు స్టార్టయింది.

"వీళ్ళకెలా చిక్కావ్?" అడిగాను సల్లద్దాలు తీసేసి లైటు స్విచ్ నొక్కి .ఆ వెలుగులో నన్ను చూసి "మీరా?" అంది.

"నేనే!" అన్నాను.

"వీళ్లు మనుషులు కాదు! రాక్షసులు. ఎంతకైనా సాహసించగల దుర్మార్గులు. వీళ్ళతో పెద్ద ముఠా వుంది. మనల్ని వెంటపడి వేటాడి చంపిందాకా వాళ్ళు నిద్ర పోరు!"

"ఎప్పుడో ఒకసారి చావక తప్పదు. ఇప్పుడు చచ్చిపోతామేమోనన్న భయంతో వాళ్ళకు జడిసి ఛస్తూ బ్రతకడం నా కిష్టంలేదు!" అన్నాను.

ఈలోగా నేను బసచేసిన హోటల్ వచ్చింది.

కారుకు డబ్బిచ్చి పంపేశాను.

రాణిని వెంటబెట్టుకొని నా గదికి వెళ్ళాను.

తాళం త్రిప్పి తలుపులు తీశాను.

లైటు స్విచ్ నొక్కేందుకు చెయ్యెత్తాను.

ఎవరిదో చెయ్యి నా చేతిని బలంగా పట్టుకొంది.

ఎడం కాలితో ఎగిరి తన్నాను చీకట్లోనే ఆ మనిషి పొట్టభాగం ఎంత ఎత్తులో వుండివుండచ్చో ఊహించుకుంటూ. నా చేతిపైనున్న అతని పట్టు సడలింది. చెయ్యి విడుల్చుకొని లైటు వేశాను.

గది మధ్యగా ఇద్దరున్నారు.

నా పైకి విరుచుకుపడ్డారు పులుల్లా.

సింహంలా దూకాను ఇద్దరిపైకి.

ఇద్దరి తలల్ని రెండు చంకల్లో ఇరికించుకొని, గాల్లోకి ఎగిరి కాళ్ళతో ఇద్దర్నీ చాతీపైన తన్నాను. విరుచుకు పడ్డారు క్రింద.

కాళ్ళతో త్రొక్కాను. ఇద్దరూ శవల్లా మారి నేలకు కరుచుకుపోయారు. కర్టెన్ త్రాడుతో ఇద్దరి కాళ్ళూ, చేతులూ కట్టేశాను. కాలితో మంచం క్రిందకు తోశాను.

పోలీసులకు ఫోన్ చేశాను నా రూంలో దొంగలు పడ్డారనీ వాళ్ళను పట్టుకొని కట్టేశాననీ. వెంటనే వచ్చి వాళ్ళను స్వాధీనం చేసుకుంటామని చెప్పారు.

ఆ తర్వాత రిట్జ్ హోటల్ కు ఫోన్ చేశాను.

"ఎవరది?" అడిగాడు అవతలి మనిషి.

"నేనే! యముణ్ణి!" అన్నాను.

"నీకోసం చూస్తున్నాం! ఇంకా బయలుదేరలేదా?"

"నీ మొహం! నేను మీ హోటల్ కు రావడం, రాణిని దర్జాగా కార్లో ఎక్కించుకొని తిరిగి నా గదికి తీసుకొచ్చుకోవడం అయింది. మీరు పంపిన వస్తాదుల్ని చావగొట్టి, కట్టిపడేసి వుంచాను. ఇంతకుముందే పోలీసులకు ఫోన్ చేశాను. మరో పదినిముషాల్లో వచ్చి ఈ రెండు శాల్తీలను తీసుకెళ్తామన్నారు. తెల్లారేలోగా మీరు మరో పదిమంది నన్నా పంపండి!" అన్నాను.

"అయితే ఆ రాజా వేషంలో వచ్చింది నువ్వేనా?"

"ఇప్పటికయినా తెలుసుకున్నావ్! సంతోషం!" అన్నాను.

"మమ్మల్ను మారువేషంతో మోసం చేసినందుకు నిన్ను..." అంటూ మాటలకోసం తడుముకోసాగాడు.

"ఏమీ చెయ్యలేవురా చవటా! నిన్ను కూడా ఎప్పుడో ఒకనాడు చావదన్ని పోలీసులకు అందజేస్తాను నేనే! జాగ్రత్తగా వుండు" అని ఫోన్ పెట్టేశాను.

# 4

పోలీసులు వచ్చారు.

వాళ్ళకు ఇద్దర్నీ అప్పజెప్పాను.

"ఈ గదిలోకి ఎందుకు వచ్చారు మీరు?" అడిగాడిద్దర్నీ పోలీసు ఇన్‌స్పెక్టర్.

"దొంగతనం చేసేందుకు" అన్నాను.

"వాళ్ళను తీసుకెళ్తాను. రేపొచ్చి కంప్లయింట్ రాసివ్వండి!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అలాగే!" అన్నాను.

పోలీసులు వెళ్ళిపోయాక గది తలుపులు వేశాను.

"రాణీ!" పిలిచాను.

"ఏమిటి?" అడిగింది.

"ఇందాకేదో ముఠా అన్నావు. నీకు దాని వివరాలు తెలుసా?"

"తెలుసు! ఈ వూళ్ళో జరిగే అవినీతి వ్యాపారమంతా ఒకేఒక ముఠా కంట్రోలులో వుంది. వాళ్ళను ప్రజలు ఎదుర్కోలేరు. పోలీసులు పట్టుకోరు!" అంది రాణి.

"ఎందుకని?"

"ప్రజలకేమో వాళ్ళను చూస్తేనే భయం. పోలీసుల్ని బాగా డబ్బుపెట్టి కొనేశారని అందరూ అనుకొంటూ వుంటారు. అదీగాక రాజకీయనాయకుల మద్దతుకూడా

వుందట. వాళ్ళు ఆడింది ఆట, పాడింది పాటగా జరిగి పోతూంది చాలా సంవత్సరాలనుంచి.''

"ఎవ్వరూ ఎదురు తిరగటంలేదా?''

"లేనట్లే!''

"ఈ ముఠాకు నాయకుడెవరో నీకు తెలుసా?''

"తెలుసు. అతన్ని అందరూ 'చిట్టి' అంటారు.''

ఆ రెండక్షరాల పేరు వినగానే నా రక్తం కుతకుతమని ఉడికిపోయింది. కళ్ళల్లోకి రక్తం తన్నుకొచ్చింది.

"ఎందుకలా ఆవేదపడుతున్నారు?'' భయంతో అడిగింది రాణి.

"రాణీ! నువ్వా చిట్టిని చూశావా?''

"లేదు!''

"అతన్ని గురించి నువ్వెక్కడ విన్నావు?''

"మా హోటల్ లోనే. చీకటి వ్యాపారాలుచేసే ప్రతి ఒక్కరూ తమ లాభంలో పదోవంతు అతనికి పంపాలి. అందుకు ప్రతిఫలంగా, పోలీసులతో గొడవలుగానీ, ప్రత్యర్థులతో పేచీలుగానీ రాకుండా అతనూ, అతని అనుచరులు చూస్తుంటారని వాళ్ళమాటలు విని తెలుసుకున్నాను'' అంది రాణి.

"నేనా చిట్టిని కలుసుకోవాలి! అతనికోసమే వెతుకుతూ వచ్చాను.''

"అతన్నెందుకు కలుసుకోవటం?''

రాణికి నా కథ యావత్తూ పూసగ్రుచ్చినట్లు చెప్పాను. విని విభ్రాంతి చెందింది.

"ప్రతీకారం చేసేందుకిలా బంగారంలాంటి జీవితం బుగ్గిలో పోసుకున్నావన్నమాట!'' అంది నిస్పృహతో.

"అని నే ననుకోవడంలేదు. కర్తవ్యపాలనే జీవిత పరమావధిగా ఎంచిన తండ్రిని పొట్టనబెట్టుకొన్న ఆ దుర్మార్గుణ్ణి చంపడం నా లక్ష్యం. అందుకోసమే ఇలా కసాయివాడిలా తయారయ్యాను" అన్నాను.

నాకు జవాబు చెప్పకుండా ఏదో ఆలోచిస్తూ పడుకుంది రాణి. ఆమెను డిస్టర్బ్ చెయ్యడం నాకిష్టంలేకపోయింది. నేనూ మంచంపైన మేను వాల్చి పడుకున్నాను.

నాకు తెలీకుండానే నిద్ర పట్టేసింది.

# 5

ప్రొద్దున్నే కాల కృత్యాలు వడివడిగా ముగించుకొని డ్రెస్ చేసుకుని క్రిందికొచ్చాను.

తిన్నగా పోలీస్ స్టేషన్‌కు వెళ్ళాను.

ఇన్‌స్పెక్టర్ సీటు ఖాళీగా వుంది.

"ఎవరు కావాలి?" అంటూ వచ్చాడు హెడ్ కానిస్టేబుల్.

"మీ ఇన్‌స్పెక్టర్ లేడా?" అడిగాను.

"లేరు టౌన్లోకి వెళ్ళారు!" అన్నాడతను.

"రాత్రి హోటల్ అప్సరలోంచి పట్టుకొచ్చిన వెధవలేం చేస్తున్నారు?"

"అప్సర హోటల్‌లోంచా? మనుష్ల్ని పట్టుకు రావడమా? స్వప్నం కలగంటున్నారా? లేక పిచ్చిపట్టి మాట్లాడుతున్నారా?" అడిగాడు అతను.

అతనికి పిచ్చేమో అనుకున్నాను. అయినా ఓపిగ్గా జరిగిందంతా చెప్పాను.

"అసలు మేము అక్కడకు రానేలేదు రాత్రి!" అన్నాడు హెడ్.

ఆ మాటకు నా హెడ్ సినిమా రీలులా తిరిగింది.

"ఇందులో ఏదో మోసముంది?"

"అదేం నాకు తెలీదు! నువ్వుమాత్రం మా అయ్యగారు వచ్చేదాకా వుండి విషయం తేల్చుకుని వెళ్ళు!" అన్నాడు.

అలాగేనంటూ కూర్చున్నాను.

పది నిముషాల తర్వాత మోటర్ సైకిల్ వచ్చి ఆగింది. ఇన్‌స్పెక్టర్ దిగి లోనికొచ్చాడు. చూడగానే తెలుసుకొన్నాను రాత్రి నేను చూచిన వ్యక్తి అతను కాదని.

నన్ను నేనే పరిచయం చేసుకుని రాత్రి జరిగిందంతా చెప్పాను.

అంతావిని "అప్సర హోటల్ గురించి మాకు తెలుసు. మీరు చెప్పినట్లు ఎన్నటికీ జరుగదు. పైగా రాత్రి నేను రానేలేదు!"

"ఆ విషయం మిమ్మల్ని చూశాక నాకు తెలిసింది" అంటూ లేచాను.

"నీకు మతిస్థిరంగా వున్నట్లు లేదు. మెంటల్ హాస్పిటల్‌కు పంపమంటావా?"

"అప్పుడే అవసరంలేదు. అలా వెళ్ళదలచుకున్నప్పుడు మీ దగ్గరకే వస్తాను!" అంటూ లేచి వెలుపలకి వచ్చాను.

రాత్రి నాతో ఫోన్‌లో మాట్లాడింది పోలీసులు కాదని, హోటల్ రిసెప్షన్‌లోని వాళ్ళేనని, వెంటనే పోలీసుల వేషంతో వచ్చి, నాకు చిక్కిన ఇద్దర్ని తీసుకెళ్ళిపోయారనీ ఊహించాను. ఇదంతా చిట్టి ముఠా పనేననిపించింది.

తాళం తీసి గదిలోని మనుషుల్ని ప్రవేశపెట్టగలిగిన వాళ్ళు, పోలీసుల వేషంలో వాళ్ళను రక్షించి తీసుకుపోవడం పెద్ద బ్రహ్మవిద్యకాదు.

నా మకాం సరయిందని తేల్చుకున్నాను. అప్సర

హోటల్ చిట్టి యాజమాన్యంలోనే నడపబడుతుందని నిర్ణయించుకున్నాను.

# 6

రోడ్ వారగా పెద్ద కారు ఆగివుంది. ఎవరో ఎదురుకుండా వచ్చి నాకు డాష్ ఇచ్చారు. అదమరుపుగా వుండడంతో క్రింద తూలిపడ్డాను.

"దొంగ, దొంగ, దొంగ!" అతను కేకపెట్టాడు పెద్దగా.

నేను ఎక్కడా అనుకుంటూ చుట్టూ చూశాను. జనం గుంపులు గుంపులుగా పరుగెత్తుకొచ్చి నా చుట్టూచేరారు.

తల పైకెత్తి చూశాను.

ఖరీదైన దుస్తుల్లో వున్న ఆ డాష్ ఇచ్చిన వ్యక్తి చేతులు నా వేపు చూపుతున్నాయి.

"కొట్టండి. తన్నండి!" అంటూ గగ్గోలుపెడుతున్నారు జనం పిచ్చికుక్కల్లా.

నేను దొంగతనం చేయలేదని చెప్పాలనిపించింది.

పోలీస్ వాన్ వచ్చి ఆగింది.

ఇన్స్పెక్టరూ, అతని పటాలం జనాన్ని తోసుకుని, నా దగ్గరకు చేరారు.

నా పక్కనున్న వ్యక్తి ఏం జరిగిందని అడగడం, అతను తన పర్సును నేను దొంగిలించానని చెప్పడం రెండూ విన్నాను.

ఇద్దరు పోలీసులు నన్ను పైకి లేవదీశారు.

జేబులో చేతులు పెట్టి వెతికారు మరో ఇద్దరు.

నా పాంటు జేబులోంచి నల్లటి పొడవుగల పర్సు వెలికితీశాడు పోలీసు.

"ఇదేనా మీ పర్సు?" అడిగాడు నా ప్రక్కనే వున్న వ్యక్తిని.

"అవును!"

"ఇందులో మీ డబ్బెంత వుంది?"

"ఆరువేలు!"

"ఏ రూపంలో వున్నాయి?"

"వంద కాగితాలు అరవై వున్నాయి. నా విజిటింగు కార్డుంది."

"నీ పేరు?"

"రాజారావు!"

"అడ్రసు."

"ఆనందనివాస్, సూర్యనారాయణపురం" అన్నాడతను.

ఇన్స్పెక్టర్ చెక్ చేసి "యస్. మీ పర్సే యిది!" అన్నాడు.

"నీదేవూరు?" అడిగాడు నన్ను.

"నాకు ఊరు లేదు!"

"పేరు"

"డీ. వై. రాజు!" అన్నాను.

"అంటే పూర్తి పేరు చెప్పు!"

"డీ. యమధర్మరాజు!" అన్నాను.

"ఏం చేస్తూంటావ్?"

"ఇంకా ఏం చెయ్యడం లేదు! ఏదన్నా చేద్దామని అనుకుంటున్నాను. ఇంతలో ఈ హడావుడి జరిగింది!"

"ఆయన పర్సు దొంగిలించావు కదూ!"

"లేదంటే నమ్ముతారా?" అడిగాను కోపంగా.

"ఎలా నమ్ముతాం? పోయిన పర్సు నీ జేబులో దొరి

కిందిగా. నిన్ను రెడ్ హేండెడ్ గా పట్టుకున్నాం. కేసు పెట్తాం. సంవత్సరం పాటన్నా జైల్లో వుండక తప్పదు!" బెదరిస్తూన్నట్లుగా అన్నాడు ఇన్ స్పెక్టర్.

"అలాగే! మీ యిష్టం! కానివ్వండి" అన్నాను.

జనాన్ని తరిమేశారు మిగిలిన పోలీసులు.

నాకు డాష్ ఇచ్చిన మనిషి, నన్ను చూసి నవ్వి "రోట్లో తలదూర్చావ్. ఇలాంటి రోకటి పోట్లు తప్పవు. తలతోపాటు మెదడు కూడా దూర్చావంటే దాన్ని అంతవరకూ క్రైమా క్రింద కొట్టేం చేయవలసి వస్తుంది. జాగ్రత్తగా వుండు!" అన్నాడు.

"ఉంటాను. మిస్టర్ చిట్టీ! ఉంటాను!" అన్నాను.

"అలా పిలవమని ఎవరు చెప్పారు?"

"ఎవ్వరూ చెప్పలేదు! నిన్ను చూస్తే అలా పిలవాలని నాకే అనిపించింది. నీ ఆటలు ఎన్నో రోజులు సాగవు. త్వరలోనే కడతాయి. అందాకా నీ సరదాలు తీర్చుకో!" అన్నాను.

"షటప్! ఇన్ స్పెక్టర్ ఇతన్ని తీసుకు వెళ్ళండి!" అన్నాడు చిట్టి నాకేసి చూపిస్తూ.

కానిస్టేబుల్ నా రెక్క బట్టుకుని జీపు వేపు వెళ్ళాడు, చిట్టి కారు వేపు వెళ్ళాడు.

జీపెక్కాను.

వెనుక వైపు మధ్యగా నన్ను కూర్చోబెట్టి పోలీసులు కూర్చున్నారు కాపలాగా. జీప్ బయలుదేరింది. నన్ను అడ్డులేకుండా చేసుకునేందుకు మంచి ఎత్తే వేశాడనుకున్నాను.

జీపు స్పీడుగా పోతూవుంది.

నా చేతులకెందుకనో వాళ్ళు సంకెళ్ళు వేయలేదు.

పోలీసుల దగ్గర లాఠీలు తప్ప మరేమీ లేదు. ముందు డ్రైవరు ప్రక్కన కూర్చున్న ఇన్‌స్పెక్టర్ దగ్గర రివాల్వరుంది. వీళ్ళను తన్ని తప్పించుకుందామని అనుకున్నాను. రోడ్లు బిజీగా వున్నాయి. ఎక్కడచూసినా జనం ప్రవాహంలా కదులుతున్నారు. నేను సాహసించి దూకినా వీళ్ళు అల్లరి చేస్తారు. ఎవరో ఒకరు అడ్డొచ్చి పట్టుకుంటారు.

ప్రయోజనం లేదనుకున్నాను.

జీపు స్టేషను చేరుకుంది.

నన్ను రిమాండ్ రూంలో వేశారు. ఒక్కణ్ణే వున్నాను.

పది గంటల ప్రాంతంలో దొడ్డికి పోవాల్సి నట్లుగా వుండింది. సెంట్రీని పిలిచి చెప్పాను.

అతను పోలీసును పిలిచి, నన్ను తీసుకు వెళ్ళమన్నాడు. అతని వెంట స్టేషనుకు వెనుక భాగాన వున్న లెట్రిన్‌కు వెళ్ళాను. లోనికి వెళ్ళి పరిశీలించి చూశాను. పెద్దరాయి కనుపించింది. దాన్ని తీసుకుని వచ్చాను. పోలీసు బీడి కాలుస్తున్నాడు. దాంతో అతని తలమోదాను. అమ్మా! అంటూ నేలకూలాడు. గోడదూకి వీధిన పడ్డాను.

## 7

నా లగేజీ హోటల్‌లో వుంది. కత్తి పోలీసులు లాక్కున్నారు. బాగ్‌లో రివాల్వరుంది. అదన్నా సంపాయించుకోవాలనిపించిది.

అర్ధరాత్రిదాకా అక్కడక్కడా తిరిగి, హోటల్

వెనుక భాగం చేరుకున్నాను. డ్రైనేజీ పైపు సాయంతో పైకెళ్ళాను. అంతకుముందు రోజూ గ్లాసు తీసేసిన కిటికీ గుండా గదిలోకి దూరాను. బట్టలు మార్చుకుని, ముస్లిం వేషం వేసుకున్నాను. రివాల్వరు, డబ్బు తీసుకున్నాను.

వచ్చిన దారినే వెనక్కి వెళ్ళిపోయాను.

చిన్న బార్‌లో కెళ్ళి కూర్చుని బ్రాందీ రెండు క్వార్టరు సీసాలు త్రాగాను. వొంటనిండా పేరుకుపోయి నొప్పులు కాస్త తగ్గాయి. క్రొత్త చైతన్యం నరాల్లోకి ప్రవేశించింది. బిల్లు చెల్లించి బైటకొచ్చాను.

ఆ చీకట్లోనే కేదారేశ్వర పురంలోని రాణి ఇంటికి వెళ్ళాను. తలుపు తట్టాను.

రాణి ఇంట్లోనే వుంది.

నన్ను చూసి విస్తుపోయి "నువ్వా!" అంది.

"నేనే! నీ వేమయినావోనని కంగారు పడుతుండి పోయాను."

"పోలీసుల దగ్గర నుంచి పారిపోయావు కదూ?"

"అవును."

"నువ్వు ఇక్కడకు వస్తావని, ఇంతదాకా చిట్టి మనుషులు, పోలీసులు, కాపలా కాచారు. ఇంతదాకా రాక పోయేసరికి వెళ్ళిపోయారు. మళ్ళీ వచ్చినా వస్తారు. నువ్వెళ్ళిపో!" అంది భయంగా.

"ఫరవా లేదు! ఎవరొచ్చినా ఫర్వాలేదు. అన్నిటికీ సిద్ధమై వచ్చాను. నాకు కొంత సమాచారం కావాలి." అన్నాను.

"ఏమిటి?"

"రాజారావు అనే పేరు ఎప్పుడన్నా విన్నావా?"

"విన్నాను. చాలా పెద్ద మనిషి. మా హోటల్‌కు చాలాసార్లు వచ్చారు. అతను వచ్చాడంటే అందరూ హడలి చస్తుంటారు."

"చిట్టి ఎవరో కాదు! అతనే! అతనిల్లు తెలుసా?".

"తెలీదు!"

"అతన్ని చంపాలి! అది పూర్తయ్యాక నేను పోలీసులకు చిక్కినా లక్ష్యపెట్టను." అన్నాను.

"ఏమో నువ్వు ఒంటరి గాడివి. వాళ్ళు పెద్ద ముఠా! అతనితో నిలబడి ప్రాణాలు పోగొట్టుకోవటంకన్నా యీ వూరు విడిచి వెళ్ళిపో" అంది రాణి.

"ఆ రాజారావుకు నువ్వు తెలుసా?"

"అంత బాగా తెలీదు. హోటల్‌లో ఎప్పుడైనా చూసి వుండవచ్చు."

"అయితే నీ సాయం కావాలి నాకు. చేస్తావా?"

"ఏం చేయమన్నా చేస్తాను."

"ఓ. కే. ఉదయం ఎక్స్‌ప్రెస్‌కు రాజమండ్రి వెళ్దాం. నువ్వు ముస్లిం స్త్రీలా డ్రెస్ చేసుకో పైన పరదాకూడా వేసుకో!"

"నల్ల పరదా నా దగ్గర లేదు!"

"నేను తెస్తాను. నువ్వు స్టేషను దగ్గరుండు." అని వెళ్ళిపోయాను ఊళ్ళోకి.

తెల్లవారుతూండగా ఒక లాండ్రికి వెళ్ళి అడిగాను ముస్లిలు వాడే నల్లపరదాకోసం. అతని దగ్గర ఉందిగానీ నాకు ఇచ్చేందుకు అనుమానించాడు. వంద రూపాయల నోటు చూపించాను. చూడగానే న్యూస్ పేపరులో పొట్లం కట్టిచ్చాడు.

గాన్ని తీసుకొని స్టేషను చేరుకున్నాను.

గాణి బుక్ స్టాల్ ప్రక్కన కనిపించింది. నా చేతిలో
ప్యాకెజ్ ఆమెకు ఇచ్చాను. అది తీసుకుందామె.
కి వెళ్ళి ఐదు నిముషాల తర్వాత తిరిగొచ్చింది.

మేమిద్దరం ఫక్తు ముస్లిం జంటలా తయారైనాము.
ప్రెస్‌లో ఏలూరు వెళ్ళాం. ఓ హోటల్లో రూమ్ తీసు
న్నాం.

విజయవాడ టెలిఫోన్ డైరక్టరీలో రాజారావు అడ్రసు
ాను. దాదాపు ఆరుగురు రాజారావులున్నారు. అందరి
డ్రసులు రాసుకున్నాను. ఎవ్వరి ఇళ్ళకూ పేర్లు లేదు
క్కరికి తప్ప. ఒకతను డాక్టరు. మరొకతను లాయరు.
కో మనిషి కమిషన్ ఏజంటు. ఆ ముగ్గుర్ని లిస్టు నుండి
ాలగించాను, నాకు అవసరమైన మనుషులు కాదన్నట్లు.
గిలిన ముగ్గురిలో, నాకు కావలసిన మనిషి ఎవరో సుల
ంగా పట్టుకోగల మార్గం కోసం ఆలోచించ సాగాను.

మూడు నెంబర్లకు ఫోన్ చేశాను, ట్రంకాల్ బుక్ చేసి.
అవతలి వ్యక్తులతో మాట్లాడిన తర్వాత రెండు
నెంబర్లు డ్రాప్ చేశాను. మూడో నెంబరు వ్యక్తి అడ్రసు
లోనే, అతని బంగళాకు పేరు వుంది. అతనే నాకు కావ
లసిన మనిషని తీర్మానించుకున్నాను.

అతనితో మాట్లాడ వలసిన అవసరం కనుపించలేదు.

హోటల్ బ్యారేజివ్యూకు టెలిగ్రాం ఇచ్చాను. డీలక్స్
సూట్ ఒకటి జనాబ్ మహమ్మదాలీ అండ్ బేగమ్‌కు
సుఘమాల కోసం రిజర్వ్ చెయ్యమని.

# 8

రాత్రికి మెయిల్లో ఫస్ట్‌క్లాస్ కంపార్టుమెంటులో తిరిగి
యిద్దరం విజయవాడకు ప్రయాణం చేశాం. రెండు సూట్

కేసులు మాత్రం వున్నాయి మా వద్ద.

కూలీలు సామాను వెలుపలకు తెచ్చారు. టాక్సీలో పెట్టమన్నాను. టాక్సీ డ్రైవరును హోటల్ బ్యారేజ్ వ్యూకు వెళ్ళనిమ్మన్నాను టాక్సీని. ఐదు నిముషాల్లో హోటల్ చేరుకున్నాం.

రిసెప్షన్‌లో నా టెలిగ్రాం గురించి అడిగాను. వాళ్ళకి చేరిందనీ, మంచి సూట్ రిజర్వ్ చేశామని చెప్పారు. వాళ్ళ మనిషి మా సూట్ కేసులు తీసుకుని ముందు నడిచాడు.

ఏడో అంతస్తులోవుంది మా కిచ్చిన సూట్.

అంతా అధునాతనంగా దర్జాగా వుంది.

తలుపులుమూసి రాజారావు నెంబరుకు ఫోన్ చేశాను.

అవతలవేపునుండి టెలిఫోన్‌లో "హల్లో!" అని వినిపించింది.

"రాజారావు గారున్నారా?" అడిగాను హిందీలో.

"మీరెవరు?"

'నాది కలకత్తా! నాపేరు జినాబ్ మహమ్మదాలీ! అర్జంటుగా వ్యాపార విషయం మాట్లాడాలి."

"లైన్లో వుండండి కనెక్షను ఇస్తాను!" అన్నాడతను.

వెయిట్ చేస్తూ కూర్చున్నాను. రెండు క్షణాల తర్వాత "రాజారావును మాట్లాడుతున్నాను. ఎవరు మీరు?" అడిగాడు.

"నాపేరు వినలేదా? జనాబ్ మహమ్మదాలీ! కలకత్తాలో స్మగ్‌లింగ్ కింగ్‌ను. నీతో చిన్న వ్యాపారం చేద్దామని మద్రాసు వెళ్తూ దిగాను" అన్నాను.

"మీరెవరితో మాట్లాడుతున్నారో మీకు తెలుసా?"

"తెలుసు! తెలుసు! నువ్వేకదూ చిట్టివి. నీ అడ్రసు, ఫోన్ నెంబరు మా ఫ్రెండిచ్చాడు" అన్నాను.

"ఎక్కడ దిగారు మీరు?"

"హోటల్ బ్యారేజీ వ్యూలో వున్నాను. ఏడో అంతస్తులో ఆరో నెంబరు సూట్. వస్తారా? లేక నన్ను రమ్మంటావా?"

"మీరు రావద్దు! నేనే వస్తాను. రాత్రి పదింటికి" అన్నాడు.

"మీకోసం ఎదురుచూస్తూ వుంటాను" అన్నాను.

"అలాగే!" అన్నాడు చిట్టి.

ఫోన్ పెట్టేశాను.

రాణి నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నావ్?"

"నీ ధైర్యానికి. రాజారావు వచ్చినా తగిన బందోబస్తులోనే వుంటాడు. అతన్ని ఏమీ చెయ్యలేవు నువ్వు" అంది రాణి.

"చూస్తావుగా? ఈలోగా నాకు నువ్వో పనిచేసి పెట్టాలి. నీకో అడ్రసు ఇస్తాను. అక్కడికి వెళ్లు. కాంతమ్మనే ముసలావిడ వుంటుంది. ఆమెను ఎలాగైనా ఒప్పించి ఇక్కడకు తీసుకురావాలి!" అన్నాను.

"ఎందుకు?"

"ఇప్పుడు చెప్పి లాభంలేదు. నువ్వే చూద్దువుగాని" అన్నాడు.

"అలాగే! ప్రయత్నం చేస్తాను" అంది రాణి.

ఆమెకు కాగితంపైన అడ్రసు రాసిచ్చాను. అది తీసుకొని చదువుకొంది.

"ఆ ప్రాంతాలు తెలుసా నీకు?" అడిగాను.

"తెలుసు! కానీ ఆమె నావెంట రానంటుందేమో?"

"డి. యస్. పి. రంగనాథంగా రఘ్బాయి పిల్చుకు రమ్మన్నాడని చెప్పు. ఆమె కాదనకుండా వస్తుంది."

"సరే!" అంది.

సూట్ కేసులోంచి కాసెట్ టేప్ రికార్డర్ తీసి, కిటికీలు వున్న క్రోటన్సుమధ్య పడేశాను. దాన్ని స్విచ్ కు కనెక్టు చేశాను. లోంఫైనిముపాలు తిరిగే టేపు క్రొత్తది దాంట్లో బిగించాను.

హైద్రాబాదులోవున్న ఐ. జి. ఆఫ్ పోలీసుకు ఫోన్ చేసి, డి. యస్. పి. రంగనాథాన్ని ఎనిమిది సంవత్సరాల క్రితం హత్యచేసిన హంతకుడి శవాన్ని స్వాధీనం చేసుకో దలచుకుంటే రాత్రి పదిన్నరకల్లా బ్యారేజీవ్యూకు రమ్మన్నాను. ఆయన యస్. పికి ఫోన్ చేస్తానన్నాడు. నాకు ఇక్కడి పోలీసులపైన నమ్మకంలేదనీ, వాళ్లు హంతకుడితో కుమ్మక్కయి వున్నారనీ, అందువల్లే ఇన్నేళ్ళూ, హంతకుడు చట్టాన్ని తప్పించుకుని తిరుగుతున్నాడనీ చెప్పాను.

నా మాటలు విని, హైద్రాబాద్ నుంచి సి. ఐ. పార్టీని పంపుతానన్నాడు. "థాంక్స్" అని చెప్పాను.

రాణి వెళ్ళిపోయింది.

శాంతమ్మ భర్త కొన్నాళ్లు 'చిట్టి' ముఠాలో వుండి రకరకాల నేరాలు చేశాడు. మా నాన్నగారు అతన్ని పట్టుకొన్నాడు దొంగతనం కేసులో. అప్పుడు కొద్దిగా బుద్ధి చెప్పారు. దాంతో అతను తన పద్ధతి మార్చుకున్నాడు. చిట్టి ముఠా అతన్ని తాము చెప్పినట్లు విని అంతకుముందులాగా నేరాలు చెయ్యకుంటే చంపుతామని బెదిరించారు.

ఆ రాత్రి కూడా నాన్నగారు అతన్ని రక్షించడం కోసమే వెళ్ళారు. ఆమాట అమ్మచెప్పింది నాకు. శాంతమ్మ

నాన్నగారి కాళ్లు పట్టుకుని ఎలాగైనా అతన్ని రక్షించమని ప్రాధేయపడిందట, అంతకుముందు ఇంటికొచ్చి.

శాంతమ్మ కళ్ళముందే ఆమె భర్తనూ నాన్నగార్ని రాజారావు ముఠాతో వచ్చి హత్య చేశాడట. ఆమెను కూడా చంపాలని ప్రయత్నించారట. కానీ శాంతమ్మ వంటగదిలో దూరి తలుపు గొళ్లెం పెట్టుకుందట.

ఆ తర్వాత పోలీసులకు ఆమె చెప్పిందట. కానీ ఎవ్వరూ ఆమె సాక్ష్యం ఖాతరు చెయ్యలేదట.అప్పట్నుంచి ఆమె ఇక్కడే వుంటుందనీ, నేనుచేసిన విచారణలవల్ల తెలిసింది.

మా నాన్నగార్ని హత్యచేసిన హంతకుణ్ణి పట్టివ్వగల ప్రత్యక్ష సాక్షి శాంతమ్మ ఒక్కతే! అందుకే ఆమె కోసం రాణిని పురమాయించాను.

రాణి వెళ్ళిపోయింది వెలుపలికి.

బెడ్ క్రింద వుంచిన రివాల్వరుతీసి శుభ్రంగా తుడుచుకున్నాను. అప్పుడే నాకు అనుమానం వచ్చింది అంతకు ముందోసారి హోటల్ నుంచి ఫోన్ చేస్తే అసలు పోలీసులకు ఆ కాల్ పోనివ్వకుండా మధ్యలోనే టాప్ చేసి, పోలీసుల వేషంలో వచ్చి నన్ను మోసంచేశారు. ఈ హోటల్ లో గూడా అలాగే జరిగితే, నా ప్రయత్నం అంతా వృధా అవుతుంది. అసలు నా కాల్ హైద్రాబాదుకు వెళ్ళిందీ లేనిదీ తెలుసుకోవడం ఆవశ్యం అనుకున్నాను.

గదిలో సామానంతా సర్దేసి చకచక వెలుపలపడ్డాను. హెడ్ పోస్టాఫీసుకు వెళ్ళాను. చుట్టూ ఎవరన్నా ఉన్నారేమోనని చూశాను. నన్నెవరూ అనుసరించడం లేదని నిర్ధారణ చేసుకున్నాను.

ఐ. జి. పీకి ట్రంకాల్ బుక్ చేశాను. మైక్రోవేవ్ ఉండటంవల్ల వెంటనే కనెక్షను దొరికింది.

అంతకుముందు ట్రంకాల్ చేసిన వివరం చెప్పాను. ఆయన తానెవరితోను విజయవాడలో మాట్లాడలేదని చెప్పాడు. నా అనుమానం నిర్ధారణ చేసుకొన్నాను. అసలు విషయం అంతా చెప్పి, జరిగిన మోసంగురించి కూడా చెప్పాను. తానే స్వయంగా వస్తానని ప్రామిస్ చేశాడు ఐ. జి. పి. నాకు ధైర్యంతోపాటు ఆనందం కూడా కలిగింది. పోస్టాఫీసునుంచి వెలుపలికొచ్చి, ఆటో ఎక్కి హోటల్ కు వచ్చేశాను.

జనాబ్ మహమ్మదాలీ ఎవరో చిట్టికి తెలిసిపోయింది.

మధ్యాహ్నం రెండింటికి రాణి వచ్చింది శాంతమ్మతో. నన్ను చూడగానే "బాబూ! బాగున్నావా?" అంటూ కౌగలించుకుని ఏడ్చింది శాంతమ్మ. ఆమెను ఓదార్చాను.

"మీ నాన్నను నేనే పొట్టన పెట్టుకున్నాను బాబూ! ఆ చిట్టిగాడు అసాధ్యుడు. వాడితో తలపడటం మంచిది కాదు! పదికాలాలపాటు బ్రతకవలసినవాడివి. జరిగింది మర్చిపో! నీ దోవన వెళ్ళిపో బాబూ!" అంది ఆప్యాయంగా.

ఆమె అనుమానాలు, భయాలు, అధైర్యానికి కారణాలు నాకు తెలిసినా, శాంతమ్మగారితో "నాకేం భయంలేదు. వాణ్ణి ఉరికంబం ఎక్కించేందుకు అవసరమైన ఏర్పాట్లు అన్నీ చేశాను. మీరేం కంగారుపడకండి. జరగబోయేది చూస్తూ వుండండి!" అన్నాను.

ఆమె మరేం మాట్లాడలేక మౌనంగా వుండిపోయింది.

# 9

తొమ్మిదిగంటల ప్రాంతంలో ఎవరో తలుపు తట్టారు. వెళ్ళి తీశాను.

సూట్ లోవున్న మనిషి కనుపించాడు.

"ఎవరు కావాలి?" అడిగాను.

"మహమ్మదాలీ మీరేనా?"

"అవును!"

"ఐ. జి. గారు పంపించారు. సి. ఐ. డి. ఆఫీసర్ని. నా వెంట నలుగురు మఫ్టీలో వున్నారు. మీరేం కంగారు పడకండి. ఆ హంతకుడు లోనికి రాగానే, బజర్ నొక్కండి వచ్చి అరెస్టు చేస్తాను!" అన్నాడు.

"థాంక్స్! చెప్పగానే మిమ్మల్ని పంపినందుకు కృతజ్ఞుణ్ణి. మీరు చెప్పినట్లే చేస్తాను!" అన్నాను. అతన్ని చూడగానే నాకు చిట్టి ముఠా మనిషని అర్థమయింది.

"నా పనిలో నేనుంటాను." అన్నాడు సెలవు తీసుకుంటూ.

తలుపులు మూసుకున్నాను.

రాణికి జరిగిన విషయం చెప్పాను. ఆమె బెంబేలు పడింది. గడియారం కేసి చూస్తూ కూర్చున్నాను.

సరిగ్గా పదయింది.

తలుపులు తట్టారు.

వెళ్ళి తీశాను.

ఎదురుగా రాజారావు సిల్కు లాల్చీ, ధోవతిలో గోల్డ్ ఫ్రేమ్ కళ్ళద్దాలతో నిగనిగ మెరిసిపోతున్నాడు.

"నేనే చిట్టిని!" అన్నాడు.

"లోనికి రండి!" దారితీస్తూ ఆహ్వానించాను.

ఇద్దరం వెళ్ళి కూర్చున్నాం సోఫాల్లో.

"ఏం వ్యాపారం చేస్తారు మీరు!!" అడిగాడు చిట్టి.

"గంజాయి వ్యాపారం!" అన్నాను.

"లోకల్ గానా, ఫారిన్ కా?"

"ఇక్కడేం ధరలు లేవు. ఫారిన్‌కు ఎక్స్‌పోర్టు చేస్తుంటాను. మీదగ్గర సరుకు బాగా దొరుకుతుందని చెప్పారు" అంటూ, "బేగమ్! జల్దీ కాఫీలానా?" అన్నాను.

రెండు నిముషాల్లో శాంతమ్మ రెండు కప్పుల కాఫీ తెచ్చి పెట్టింది టేబుల్ పైన.

"ఎవరూ? నువ్వా శాంతమ్మా?" అన్నాడు చిట్టి ఆశ్చర్యంగా ఆమెనే చూస్తూ.

"అవును! నేనే!"

"ఇక్కడున్నావేం?"

"ఈయన దగ్గర పని చేస్తున్నాను" అంది శాంతమ్మ.

"ఈమెను మీకు తెలుసా?"

"తెలుసు! ఈమె భర్త నాతో పాటు పనిచేసేవాడు. ఓ మారు మోసం చెయ్యబోయాడు. తెలుసుకుని తెలివిగా స్వర్గానికి పంపించాను!" అన్నాడు చిట్టి నిర్భయంగా.

"నీ క్రింద ఎంతోమంది వున్నారుగా? నువ్వే ఎందుకు చెయ్యవలసి వచ్చింది?"

"డి. యస్. పి. ఒకడుండేవాడు. వాడి పేరు రంగనాథమనుకుంటాను. వాడు ఈమె మొగుడికి అండగా వుండేవాడు. అందరూ భయపడ్డారు. ముఠా నాయకుడిగా నేనే అతన్ని చంపే పని నెత్తినేసుకున్నాను. ఇద్దర్నీ చంపేశాను."

"ఎలా? ఇద్దర్నీ నువ్వొకడివే చంపగలిగావా?"

"డి. యస్. పి. దగ్గరున్న రివాల్వారుతో ఈమె భర్తను కాల్చాను. ఆ తర్వాత అతన్ని గొంతుకు తాడు బిగించి లాగి చంపాను."

"అయితే అసాధ్యుడివే?" అన్నాను.

"అనే అనుకున్నాను. కానీ తర్వాతే నేను చేసిన

పొరపాటు అర్థమయింది. ఆ డి. యస్. పి. కి ఒక కుమారుడుండేవాడు. వాణ్ణి వదిలేశాను. ఇప్పుడు వాడితో పెద్ద తలనొప్పి అయిపోయింది. అతన్నీ పంపిస్తున్నాను," అన్నాడు చిట్టి.

"ఎక్కడికి?"

"స్వర్గానికి!"

"అతను అంత తెలివి తక్కువవాడా?"

"కాదు! అతన్ని మించిన తెలివి తేటలు నాకున్నాయి. నన్నేదో పోలీసులకు పట్టివ్వాలని పథకం వేశాడు. దానికి ఎదురు పథకం వేశాను నేను." అన్నాడు.

"ఏమిటి?"

"చెప్తే అర్థంకాదు! చూపిస్తా! చూస్తావా?"అడిగాడు.

"నీకది సరదాగా వుంటే పోనీ అలాగే చూపించు చూస్తాను!" అన్నాను.

లేచి వెళ్ళి తలుపులు తెరిచాడు.

నలుగురు మనుషులు లోనికి దూరారు. లోపల్నుంచే తలుపులు మూశారు. అప్పటికే రివాల్వరు తీసి వొళ్ళో పెట్టుకున్నాను.అంతకుముందు ఐ. జి. పీ పంపిన సి. ఐ. డి. ఆఫీసర్నని చెప్పిన మనిషి కూడా వున్నాడు వాళ్ళలో.

"నన్ను ఐ. జి. పీ పంపాడనగానే నమ్మాడు పిల్ల సన్నాసి!" అన్నాడతను నన్ను చూసి నవ్వుతూ.

"మీ సంగతి నాకు తెలుసు! మిమ్మల్ని బోల్తాకొట్టించాలనే అలా చేశాను. ఐ. జీ. పితో కూడా మాట్లాడాను. అతని మనుషులు ఈ పాటికి హోటల్ నిండా వున్నారు. మీరు బోన్‌లో చిక్కారు. ఇక్కడినుంచి తప్పుకోవడం మీ వల్ల కాదు!" అన్నాను.

"పట్టుకున్నా మమ్మల్నేమీ చెయ్యలేరు!" అన్నాడు.

"నువ్వు చెప్పిందంతా టేప్ మీద రికార్డు చేశాను. అది చాలు!" అన్నాను.

"చూస్తారేం? చంపి పారెయ్యండి అందర్నీ!" అన్నాడు చిట్టి.

నేను రివాల్వరుతీసి పైకిపేల్చాను.

"దగ్గరకు వచ్చినా, అడుగు ముందుకు కదిపినా మిమ్మల్ను నల్లుల్ని కాల్చినట్లు కాల్చేస్తాను. జాగ్రత్త!" అన్నాను. రివాల్వరుంటుందని వాళ్లు ఊహించలేదు. దాన్ని చూడగానే వెనుకంజవేశారు.

విండో గ్లాసుకు గురిపెట్టి మూడుసార్లు కాల్చాను.

పోలీసు బలగం తలుపులు త్రోసుకుని లోనికొచ్చింది. చిట్టినీ, అతని మనుషుల్ని సంకెళ్లువేసి బంధించారు పోలీసులు.

ఐ. జీ. పీ. నన్ను కౌగలించుకున్నాడు ఆప్యాయంగా.

"తండ్రికి తగ్గ తనయుడివి!" అన్నాడు.

"కాదు సార్! ఈ పగ చల్లార్చుకునేందుకు దొంగగా, త్రాగుబోతుగా, బ్రతికాను. ఇక్కడి పోలీస్ డిపార్టు మెంటు చిట్టితో చేతులు కలిపారు. అందువల్లే అంతదారుణం జరిగింది" అన్నాను.

"నాకు అర్థమయింది. తగిన చర్యలు తీసుకుంటాను" అన్నాడు.

ఆ తర్వాత శాంతమ్మను, రాణిని వెంటబెట్టుకొని హైద్రాబాద్ వెళ్ళాను.

నా కేసు గవర్నమెంటుకు పంపి, నాపైనున్న నేరాల్ని కొట్టివేయించి, ఇన్స్పెక్టర్‌గా పోలీసు డిపార్టు మెంటులో ఉద్యోగం ఇప్పించారు ఐ. జీ. పి.

రాణి, శాంతమ్మ నా దగ్గరే వుండిపోయారు.

—: ఐపోయింది :—

# ప్రాణాలు దక్కితే చాలు

## జీజ్

సిగరెట్ అంటించి, సోఫాలో జారగిలబడి, పరిశోధన ఎక్కణ్ణించి ప్రారంభించాలో ఎలా ప్రారంభించాలో తీవ్రంగా ఆలోచిస్తున్నాను.

బాత్ రూంలో నా అసిస్టెంట్ సార్జంట్ డేవిడ్ స్నానం చేస్తున్నట్టు నీళ్ళశబ్దం వినిపిస్తోంది.

అది బంగ్లాదేశ్ రాజధాని ఢాకాలోని, రాహెజన్నత్ అనే పెద్ద హోటల్లోని గది! అత్యంత ప్రమాదకరమైన ఒక మిషన్ మీద భారత స్పెషల్ బ్రాంచ్ తరఫున మేమక్కడికి పంపబడ్డాం.

వంగబంధు షేక్ ముజీబుర్రహమాన్ కుటుంబాన్ని కిరాతకంగా హత్యచేసిన మేజర్ దలీమ్ కూటమి, బాంకాక్

పారిపోయి, బంగ్లాదేశ్ కొత్త ప్రభుత్వం ఏర్పడ్డాక మళ్ళీ తిరిగి వచ్చింది. ఆ కిరాతకులకి భారతదేశం మీద ద్వేషభావం, పాకిస్థాన్ పట్ల సానుభూతి ఉన్నాయని అందరికీ తెలిసిందే.

కొత్తగా ఏర్పడ్డ బంగ్లాదేశ్ ప్రభుత్వానికూ్కడా మనపట్ల అట్టే సద్భావం ఉన్నట్టు కనిపించదు. అక్కడి రాచరికం మనకి విరుద్ధంగా ఎప్పుడే నిర్ణయం తీసుకుంటుందో ఎవ్వరూ ఊహించలేకుండా ఉన్నారు.

ఆ కొత్త ప్రభుత్వానికి మనపట్ల లోలోన ఉన్న నిజమైన ఆలోచనలూ, నిర్ణయాలూ ఎటువంటివో రహస్యంగా కూపీతీసి రావడానికి, నాలుగు నెలల క్రితం కొమ్ములు తిరిగిన ఒక సి. బి. ఐ. ఏజెంట్‌ను ఢాకా పంపింది భారతదేశం. అతని పేరు ఆకాశ్!

భారతదేశంలో తయారైన రకరకాల గాజు సామగ్రిని బంగ్లాదేశ్‌లో అమ్మడానికి వచ్చిన వ్యాపారిగా కలకత్తా నించి స్టీమర్ ద్వారా చిట్టగాంగ్ జేరుకున్నాడు ఆకాశ్. తను నిజంగా ఒక వ్యాపారినని నమ్మించడానికి, తనవెంట తెచ్చిన గాజుసామగ్రిని ఢాకాలో ఉన్న ముస్తఫా గ్లాస్ ఎంపోరియం అనే కంపెనీకి అప్పజెప్పి, ఢాకాలో తిష్ట వేసేడు.

మూడు నెలలవరకూ తను క్షేమంగానే ఉన్నట్టు భారతదేశానికి సమాచారం అందింది. నెలరోజులనించీ అతనివద్దనించి ఎటువంటి సమాచారంలేదు. దాంతో సి. బి. ఐకి అతనిపట్ల తీవ్రమైన ఆందోళన బయలుదేరింది. ఎంత ప్రయత్నించినా అతనిగురించి ఏమీ తెలియలేదు. బంగ్లాదేశ్‌లో ఆకాశ్ సజీవంగా ఉన్నాడో లేదో కూడా

చిక్కలేదు.

ద్రాసు క్రయింబ్రాంచిలో పనిజేస్తున్న మమ్మల్ని
కాలికంగా సి. బి. ఐలో సర్వీస్ ట్రాన్స్‌ఫర్ జేసి,
త్తుగా అంతర్ధానమైపోయిన ఆకాశ్ కూపీ తియ్యా
కి బంగ్లాదేశ్ పంపించారు.

సాయంత్రం నాలుగ్గంటల ప్రాంతంలో సామాన్య
త యాత్రీకుల్లా ఢాకా ఏర్‌పోర్ట్‌లో దిగి, ఈ హోటల్
కున్నాం మేము.

తలుపు తెరిచిన చప్పుడు విని వెనక్కి చూసేను.

సార్జంట్ డేవిడ్ స్నానం ముగించి బైటికి వస్తున్నాడు.
తో కలిసి ఎన్నో కేసుల్లో పనిజేసేడు డేవిడ్. మద్రాసు
యింబ్రాంచి శాఖలో మమ్మల్ని ట్విన్ టైగర్స్ అని
ుస్తారు. డేవిడ్ పట్ల నాకు పూర్తి విశ్వాసం ఉంది.

ఆకాశ్ అన్వేషణ ముస్తాఫా గ్లాస్ ఎంపోరియంనించి
ప్రారంభించాలని నిశ్చయించుకున్నాను. బంగ్లాదేశ్‌లో
సే ప్రతి అడుగూ, ఎంతో జాగ్రత్తగా తూచి తూచి
వెయ్యాలి. గూఢచర్యం జరుపుతున్నట్టు ఇక్కడి ప్రభు
త్వానికి ఏమాత్రం అనుమానం వేసినా మమ్మల్ని కుక్కలని
చంపినట్టు కాల్చి చంపవచ్చు. సార్జంట్, నేనూ కలిసి
కట్టుగా కాక విడివిడిగా పని ప్రారంభించాలి.

భోజనం ముగించి, డేవిడ్‌ని అక్కడే ఉండి నాకోసం
వెయిట్ జెయ్యమని చెప్పి సమయం వస్తే నన్ను నేను
రక్షించుకోడానికి కావలసిన వస్తువులు కోటులోపలి
జేబులో వేసుకుని, కదిలొంచి బైటపడ్డాను.

హోటల్ మెయిన్ గేటు దాటుతూ రిస్టువాచీ చూసు
కున్నాను, రాత్రి ఏడుగంటలు. రోడ్డుమీద ఫ్లోరోసెంట్

లైట్లు వెలుగుతున్నాయి. పార్కింగ్ ప్లేస్‌లో ఆగివున్న ఓ టాక్సీవేపు నడిచేను. డ్రైవింగ్ సీట్లో కూర్చుని బీడీ కాలుస్తున్న డ్రైవర్ నన్ను చూడగానే తలుపు తెరిచి, "కొథే జాబేన్ సాబ్?" (ఎక్కడికి వెళ్ళాలి సార్?) అడిగేడు బెంగాలీలో.

"గ్లాస్‌తో తయారైన కొన్ని వస్తువులు కొనాలి. ఏదైనా మంచి గ్లాస్ ఎంపోరియం తెలుసా నీకు?" అడిగేను బెంగాలీలోనే.

డ్రైవర్ తలూపేడు. "తెలుసు! ముస్తాఫా గ్లాస్ ఎంపోరియం. అక్కడ దొరకని గాజు వస్తువంటూ ఉండదు. కూర్చోండి!" అన్నాడు బాక్ డోర్ తెరిచి పట్టుకుని.

టాక్సీ ఎక్కేను. పావుగంటలో ఆ షాప్‌ముందు ఆపేడు.

మీటర్ బిల్ పేజేసి లోనికి నడిచేను. క్షణం కళ్ళు జిగేల్‌మన్నాయి. షాప్ నిండా ఎటుచూసినా, రకరకాల రంగురంగుల గాజు వస్తువులు. చాలా పెద్ద షాపు అది. వచ్చేపోయే కస్టమర్స్‌తో సందడిగా ఉంది.

ఓ మూల ముగ్గురు యువతులు గ్యాస్ స్టవ్ మీద గాజు కడ్డీలు వేడిచేసి వాటికి చిత్రవిచిత్ర రూపాలు ఇస్తున్నారు. అటునడిచి వారి పనితనం చూస్తూ నిల్చున్నాను. వారిలో గుండ్రంగా, అందంగా దోర జాంపండులా వున్న ఓ అమ్మాయి తలెత్తి, నన్ను కాస్త పరీక్షగా చూసి, తిరిగి తన పనిలో మునిగిపోయింది.

ఇంతలో బ్లూ సూట్ లోవున్న నలభైఏళ్ళ ఓ లావుపాటి వ్యక్తి వాళ్ళ దగ్గరికివచ్చి, బెంగాలీలో ఏవేవో ఇన్‌స్ట్రక్షన్ ఇవ్వసాగేడు. ఆ అమ్మాయిలు ముగ్గురూ అతను చెప్పేది

గా వినయంగా తలలూపడాన్నిబట్టి, బహుశా అతనే
ాప్ యజమాని అయుంటాడని ఊహించేను.
అతను చెప్పడం ఆపి, నావైపుచూసి, "వీరి పనితనం
సి ఆనందిస్తున్నారా?" అడిగేడు నవ్వుతూ.

తలూపేను. "నా అంచనా సరైనదైతే ముస్తఫా
రేకదూ?" అడిగేను.
అతను క్షణం నన్ను పరీక్షగాచూసి తలూపి, "ఔను!
పరిచయం?" అన్నాడు చెయ్యి ముందుకి చాపుతూ.
"రాజారెడ్డి అంటారు. భారత యాత్రీకుణ్ణి. మిమ్మల్ని
ుసుకోడానికే ఇలా వచ్చేను" అన్నాను అతనికి షేక్
ండ్ ఇస్తూ.
"చాలా సంతోషం! చెప్పండి. నావల్ల ఎటువంటి
హాయం కావాలి?"
"నాలుగు నెలలక్రితం ఆకాశ్ అనే భారత వ్యాపారి,
ా దేశంలో తయారైన గాజు వస్తువులు తెచ్చి మీకు
మ్మేడుకదూ?" అడిగేను.

"ఔను! ఏం?"
"అతను వ్యాపారరీత్యా ఈ దేశం వచ్చి, కొన్నా
ళ్ళక్కడే ఉండి, వెళ్ళాలని నిశ్చయించేడుట. మూడు
నెలలవరకూ భారతదేశంలోని అతని బంధుమిత్రులకి
ఉత్తరాలు రాసేవాడుట. నెలరోజులనించీ, అతని ఉత్తర
ప్రత్యుత్తరాలు ఆగిపోయేయి. అతను ఏమైపోయాడో
తెలియక అతని భార్య అక్కడ తీవ్రంగా ఆందోళన
పడుతోంది.

నేనెలాగూ బంగ్లాదేశ్ యాత్రకోసం వెళుతున్నాను
గనుక, అలాగే తన భర్త విషయం కనుక్కురమ్మని మరీ
మరీ వేడుకుంది. ఆకాశ్ విషయం మీకేమైనా తెలుసేమో

నని ఇలా వచ్చేను'' అన్నాను జేబులోంచి సిగరెట్ కేస్ తీస్తూ.

ముస్తఫా కాసేపు నన్ను పరీక్షగాచూసి, తలూపేడు. ''ఆకాశ్ తెచ్చిన గాజు సామగ్రి ఎంతో నాణ్యమైనది. నా దగ్గిర క్షణాల్లో అమ్ముడుపోయింది. ఈసారి కాస్త ఎక్కువ మోతాదులో, కొత్త డిజైన్‌లో తయారైన ఐటమ్స్ తీసుకురమ్మని చెప్పేనుకూడా. ఆ తరవాత అతను మళ్ళీ కనిపించలేదు. మీరు చెప్పేది వింటుంటే నాకూ ఆశ్చర్యంగానే ఉంది!'' అన్నాడు.

''అతను ఢాకాలో ఎక్కడ మకాం జేశాడో తెలుసా మీకు?''

ముస్తఫా పెదవి విరిచి, ''సారీ! తెలీదు!'' అన్నాడు.

నాకు భరించలేని నిరాశ కలిగింది. ఆదిలోనే హంస పాదు అన్నట్టు ఆకాశ్ ఆచూకీ తెలిపే ఒకేఒక ఆధారం కూడా నిరాధారమైపోయింది.

''థాంక్స్! వస్తాను!'' అని అతనికి షేక్‌హాండ్ ఇచ్చి బైటపడ్డాను.

షాప్ మెట్లుదిగి, తీవ్రంగా యోచిస్తూ పేవ్‌మెంట్ మీద నడవసాగేను. అరఫర్లాంగు వెళ్ళానో లేదో, వెనక ఎవ్వరో స్త్రీ దగ్గినట్టు విని చటుక్కున వెనుదిరిగేను.

ముస్తఫా గ్లాస్ ఎంపోరియంలో చూసిన, ఆ అందమైన యువతి!

ఆశ్చర్యంతో నా కళ్ళు విప్పారేయి.

ఆ యువతి నోరు విప్పకుండా, పిడికిట్లోంచి ఓ కాగితపు ఉండని కిందపడేసి, చటుక్కున వెనుదిరిగి గబగబ వెళ్ళిపోయింది.

నేను ఓరకంటితో అటూ ఇటూ చూసి, ఎవ్వరూ గమనించడంలేదని నిశ్చయించుకుని, మెరుపులా వంగి ఆ కాగితపు ఉండ అందుకుని మామూలుగా ముందుకి నడిచేను.

ఆ యువతి ప్రవర్తనా, ఆ కాగితంలో ఏం ఉందో తెలుసుకోవాలన్న క్యూరియాసిటీతో నా గుండె వేగంగా కొట్టుకోసాగింది. తలవంచుకుని ఫర్లాంగుదూరం నడిచి ఓ లైటు స్తంభం కింద ఆగేను. సిగరెట్ అంటించి ఆ కాగితం ఉండ తీసేను. మడతవిప్పి పరీక్షగా చూసేను.

ఇంగ్లీష్‌లో ఒకేఒక వాక్యం ఉంది.

"రాత్రి పదిగంటలకి తార్ పోర్ గలీలో నాకోసం ఎదురుచూడండి!"

## 2

దట్టంగా సిగరెట్ దమ్ములాగుతూ ముందుకి నడిచేను. బుర్ర చురుగ్గా పనిజేస్తోంది.

తార్ పోర్ గలీ ఎక్కడుంది? ఆ యువతి నన్నక్కడికి దేనికి ఆహ్వానిస్తోంది? కొంపదీసి ఆ అమ్మాయి పార్ట్ టైంలో పడుపువృత్తి జేసుకుబ్రతికే కాల్ గర్ల్ కాదుకదా? షాప్ లో వాళ్ళని తదేకంగా చూస్తూ నిల్చున్నందుకు వేరే అర్థం తీసుకుని ఇలా రాసిందా?

హ్యూమన్ సైకాలజీ అంతో ఇంతో స్టడీజేసిన నాకు, ఆ అమ్మాయి అమాయకమైన మొహం పదేపదే మదిలో మెదిలేసరికి నా అంచనా పొరపాటేమో అనిపించింది.

వెళ్ళాలి! ఒక్కసారి వెళ్ళి ఆమెని కలుసుకుంటే పోయిందేమిటి?

టైం చూసేను. ఎనిమిదిన్నర.

రోడ్డుపక్క ఆగివున్న టాక్సీవేపు వడివడిగా అడుగులు వేసేను.

బాక్ డోర్ తెరిచి, లోనదూరుతూ "తార్ పోర్ గలీ!" అన్నాను డ్రైవర్ తో.

టాక్సీ కదిలింది. చీకటి ఎక్కువవుతున్నకొద్దీ వచ్చే పోయే జనంతో రోడ్డు రద్దీ కాసాగింది. డ్రైవర్ టాక్సీని చాలా మెల్లగా నడుపుతున్నాడు. కొన్ని రోడ్స్ కట్ చేసేక, ఎందుకో నా డౌట్ ఫుల్ మైండ్, ఇరవై గజాల వెనకవస్తున్న ఓ స్కై బ్లూ ఆస్టిన్ కారు మమ్మల్ని వెంబడిస్తున్నట్టు అనుమానించింది. మరో రెండు టర్నింగ్స్ తిరిగేక, నా అనుమానం వట్టి అనుమానం కాదని తేలి పోయింది.

తన చాకచాక్యంతో టాక్సీని ఆ కారు దృష్టినించి తప్పించమని డ్రైవర్ కి చెప్పేలోపలే, రోడ్డు కడంపక్క టాక్సీ ఆపేడు డ్రైవర్.

"తార్ పోర్ గలీ వచ్చేసిందా?" అడిగేను ఆశ్చర్యంగా.

డ్రైవర్ తలూపి, "అదే!" అన్నాడు కుడివేపు చూపిస్తూ.

చటుక్కున వెనక్కి చూసేను. ఏభైగజాల దూరంలో ఓ లైటు స్తంభంకింద ఆగివుంది ఆస్టిన్! డోర్ తెరిచి దిగేను. అదొక విశాలమైన రోడ్డు. ఇరుపక్కలా ఇళ్ళూ, దుకాణాలూ. అట్టే జనసంచారం లేదు. ఆ రోడ్డుకి కుడి పక్క ఓ ఇరుకైన సందు. రిక్షా తప్పితే అందులో మరో వాహనం వెళ్ళే అవకాశంలేదు. సందు కిరుపక్కలా ఆకాశాన్నంటే ఎత్తైన మేడలు. అదే తార్ పోర్ గలీ!

"మీటర్ చూసి బిల్ చెప్పూ!" అన్నాను డ్రైవర్ తో.

"ఛాటాకా (ఆరు రూపాయలు)" అన్నాడు.

డబ్బివ్వగానే టాక్సీ వెనుదిరిగి వెళ్ళిపోయింది. పాంటు

జేబుల్లో చేతులు పెట్టుకుని వాకింగ్ స్టెప్స్ వేస్తూ ఆస్టిన్ కారు ఆగివున్న వేపు నడిచేను. కారు సమీపించేక ఓర కంటితో డ్రైవింగ్ సీటువేపు చూసేను.

తలమీద ఫెల్ట్ హాట్. బ్రౌను సూటు. డ్రైవింగ్ సీట్లో ఒకేఒక వ్యక్తి కూర్చునున్నాడు. అంతవరకూ తదేకంగా నన్నే గమనిస్తున్నవాడల్లా చటుక్కున తల అటు తిప్పుకున్నాడు.

నా ఆశ్చర్యానికి అంతూ, అవధులూ లేకపోయింది. ధాకా చేరిన అంత తక్కువ వ్యవధిలో, అంత జాగ్రత్తగా మసలుతున్నా, మామీద ఎవ్వరికి అనుమానం కలిగింది? ఎవ్వరతను? దేనికి వెంబడిస్తున్నాడు?

కారు దాటి ఫర్లాంగుదూరం వెళ్ళి మళ్ళీ వెనుదిరిగేను. రోడ్డుమీద జనసంచారం సన్నగిల్లుతోంది. దుకాణాలు మూసి వేస్తున్నారు. ఆ వ్యక్తి ఇప్పుడు కారుదిగి, కేబినెట్ కవర్ తెరిచి ఇంజన్‌లో ఏదో చెక్ చేస్తున్నాడు. అది నటన!

తార్ పోర్ గలీ సమీపించి టైం చూసేను. పావు తక్కువ పది. తలవంచుకుని సందులో ప్రవేశించేను. ఊర కుక్కలు తప్ప సందులో జనసంచారం లేదు. ఇళ్ళ తలుపులు మూసివున్నాయి. మసక చీకటి. కొద్దిదూరం నడిచి ఆగి సిగరెట్ అంటించేను. ఏ బీట్ కానిస్టేబులైనా ఆ వైపువస్తే, నన్ను అలా ఒంటరిగా పచార్లుజేస్తూ చూస్తే లేనిపోని లంపలాటం!

దూరంగా ఎక్కడో టవర్ క్లాక్ పదిగంటలు కొడుతోంది. సరిగ్గా అదేసమయంలో ఎవ్వరో మెయిన్ రోడ్డు లోంచి సందులోకి వస్తున్న అడుగుల శబ్దం విని చటుక్కున అటు తిరిగేను.

సిగరెట్ ఆఖరి దమ్ములాగి కిందపడేసి బూటుతో నలిపేను. చీకట్లో సిగరెట్ మెరుపుచూసి నన్ను సమీపించింది ఆ ఆకారం. ఆమె ఎవ్వరో కాదు. ఆ అమ్మాయే!

"భారతదేశంనించి మీరు ఆకాశ్ కోసమే వచ్చేరు కదూ?" రహస్యం మాట్లాడుతున్నట్టు తగ్గు స్వరంతో అడిగింది.

నా గుండె వేగం అందుకుంది. "ఔను! అతనిగురించి నీకేమైనా తెలుసా?" అడిగేను ఆత్రంగా.

"తెలుసు! ముందు మీగురించి చెప్పండి. మీపట్ల నాకు పూర్తి విశ్వాసం కుదరాలి. అప్పుడు చెబుతాను ఆకాశ్ గురించి!" అంది నన్ను పరీక్షగా చూస్తూ.

చిన్నగా నవ్వేను. "మన ఇద్దరి పరిస్థితీ ఒక్కటే. నాకు నీపట్ల విశ్వాసం కుదరాలి., అప్పుడు చెబుతాను నా గురించి. నీ పేరేమిటి?"

"జరీనా తాజ్!"

"నన్ను రాజారెడ్డి అంటారు. ఒకేఒక వాక్యంలో చెబుతాను. నేను ఆకాశ్ శత్రువునిమాత్రం కాను. దీనికి నాదగ్గిర ప్రత్యేకమైన నిదర్శనమంటూ లేదు. నీవు నా నోటిమాట నమ్మాలి. అంతే!"

ఆ యువతి అటూ ఇటూ చూసి, "ఆకాశ్ ప్రమాదంలో ఉన్నాడు. అతన్ని ఎలాగైనా రక్షించి ఈ దేశం నించి తీసికెళ్ళండి. లేకుంటే వాళ్ళతన్ని దయనీయంగా చంపేస్తారు..."

ఆమెమాట పూర్తికాకముందే అడిగేను. "ఎవ్వరు వాళ్ళు? ఆకాశ్ ఇప్పుడెక్కడున్నాడు?"

ఆ యువతి ఇంకాస్త నాకు దగ్గిరగా జరిగి, "ముజఫర్

స్ట్రీట్, 145-20-422..." ఆమె ఇంకా ఏదో చెప్ప బోతూనే ఉంది.

ఇంతలో ఎవ్వరో సందులో ప్రవేశించిన బూట్సుల శబ్దం విని, చటుక్కున నన్ను దాటి ముందుకు నడిచింది.

అటు చూసేను. మసక చీకట్లో ఇటే వస్తోంది ఓ ఆకారం, ఫుల్ సూటు. తలమీద ఫెల్ట్ హేట్. అతనే! నాలో రక్తం వేగం పుంజుకుంది. అతను వడివడిగా నా ముందునించి వెళుతున్నవాడల్లా నన్నుచూసి ఆగి- "ఎక్స్ క్యూజ్ మీ! మీదగ్గిర మాచ్ బాక్స్ ఉందా?" అడిగేడు.

తలూపి, పాంటుజేబులో చెయ్యిపెట్టేను. పిస్తోలు పిడిమీద నా పిడికిలి బిగుసుకుంది. నా చెయ్యి బైటికి రాకముందే, పడింది దెబ్బ! పిడికిలి బిగించి శక్తికొద్దీ నాభి మీద గుద్దేడు! క్షణం ఊపిరి ఆగినట్టూ, కడుపులోని పేగులు ఉండచుట్టుకుపోయినట్టు మూలిగేను.

ఆ మూమెంట్ లోనే తలవంచి, పొటేలులా అతని మొహాన్ని ఢీకొన్నాను. ఊహించని ఆ దెబ్బకి అదిరి రెండు గజాలు వెనక్కి జరిగేడు. నేను తలెత్తేలోగా, ఆ రెప్పపాటు వ్యవధిలో కణతమీద పడింది దెబ్బ. ముష్టి యుద్ధంలో నన్ను మించిన అతని మెరుపులాంటి మెళకువకి ఆశ్చర్యపోయేను. కళ్ళల్లో చుక్కలు గిరగిర తిరిగేయి. నేనింకా తేరుకోకముందే బుర్రమీద మరో దెబ్బపడింది. ఈసారి అది పిడికిలి దెబ్బకాదు. ఏదో చిన్న ఇనప వస్తువుతో కొట్టేడు. ముందే చీకటి. కళ్ళల్లో పూర్తిగా చీకట్లు కమ్మేయి.

సరిగ్గా అదేసమయంలో దూరాన ఆ యువతి గావు కేకలుపెడుతూ సందులోపడి పరిగెత్తడం, ఆ వ్యక్తి

నన్ను వదిలి బాణంలా అటు దౌడుతియ్యడం లీలగా వినిపించింది.

అంతే! తరవాత ఏంజరిగిందో నాకు తెలీదు!

# 3

చిన్నగా మూలుగుతూ కళ్లు తెరిచేను.

రెండు ఆకారాలు నా మీదికి వంగి పరీక్షగా చూస్తున్నట్టు మసకమసకగా కనిపించింది. లేచి కూర్చున్నాను. తలలో సూదిపోటు. ఇంకా ఆ సందులోనే పడున్నాను. కళ్ళు చిట్లిస్తూ ఆ ఇద్దర్నీ పరీక్షగా చూసేను.

ఇరవైఏళ్ళ అందమైన యువతి! ముప్పైఏళ్ళ స్మార్ట్ యువకుడు.

"ఎవరు మీరు? ఏంజరిగింది?" అంటూ చెయ్యి ముందుకి చాచేడతను.

అతని చెయ్యి అందుకుని లేచి నిల్చున్నాను. "చీకట్లో ఇలా వస్తుండగా, ఇద్దరు రౌడీలు అటకాయించి డబ్బివ్వమన్నారు. నేను తిరగబడేసరికి ఇనపకడ్డీతో స్పృహపోగొట్టేరు. తరవాత ఏం జరిగిందో నాకు తెలీదు", అన్నాను.

"ఇది రౌడీలకి, గుండాలకీ, పేరుమోసిన సిటీ! జేబులూ, అవీ చూసుకోండి. బహుశా ఖాళీ అయుంటాయి. అందుకే ఇక్కడ రాత్రి పదిగంటల తరవాత ఒంటరిగా ఎవ్వరూ తిరగరు" అన్నాడతను సానుభూతిగా.

జేబులు తడుముకుని. "నిజమే! రాస్కెల్స్ ఏమీ వదల్లేదు" అన్నాను నీరసం నటిస్తూ.

"డోంట్ వర్రీ! ఇంతకీ మీరీ నగరానికి కొత్తా?"

తలూపేను. "భారతీయుణ్ణి. బంగ్లాదేశ్ పర్యటించాలని వచ్చేను."

"ఎక్కడ దిగేరు?"

"హోటల్లో!"

అతను జేబులోంచి పర్సుతీసి, ఓ పదిటూకాల నోటు లాగి, "ఏమీ అనుకోకండి. మీరు హోటల్ జేరడానికి టాక్సీ బాడుగకూడా ఉండివుండదు. ప్లీజ్! ఇది తీసుకోండి" అన్నాడు మర్యాదకి.

నోటు అందుకుని, "థాంక్యూ వెరీమచ్!" అన్నాను.

"నాపేరు మునీర్! ఈమె నా సోదరి ఫరీదా! ఇద్దరం ఈ దారిన వస్తుండగా కనిపించేరు. మొదట ఎవ్వరో తాగుబోతు తాగి పడున్నాడనుకున్నాం. టార్చి వెలుగులో, మీ తలమీది బొప్పిచూసి ఆగిపోయాం. మీ గురించి తెలుసుకోవచ్చా?"

తలూపేను. "నా పేరు రాజారెడ్డి. మీవంటి సానుభూతి పరులని కలుసుకున్నందుకు చాలా సంతోషం. రేపు మీకీ డబ్బు రిటర్న్ జెయ్యాలి. మీ ఎడ్రస్ చెప్పండి."

అతను నవ్వి, "మాది ఈ ఊరు కాదు. వ్యాపారరీత్యా అప్పుడప్పుడూ ఇక్కడికి వస్తూ పోతుంటాం! ప్రస్తుతం హోటల్ రాహెజన్నత్ లో మకాం జేశాం" అన్నాడు.

నేనూ అదే హోటల్లో దిగేను. ఆ సంగతి వాళ్ళకి తెలిస్తే, కలిసి వెళదాం, రమ్మనవచ్చు. నేను సాధ్యమైనంత త్వరలో జరీనాతాజ్ చెప్పిన చిరునామా కనుక్కు తీరాలి. జాగుజేస్తే ఎప్పుడేం జరుగుతుందో ఊహించడం కష్టం.

నా భావాలు వాళ్ళకి తెలీనివ్వకుండా నవ్వి, "మీ సహాయానికి మెనీథాంక్స్! ఉదయం మళ్ళీ కలుద్దాం. ఇక సెలవు తీసుకోవచ్చా?" అడిగేను చెయ్యి ముందుకి చాపుతూ.

అతను తలూపి, "ఓ. కే. గుడ్ నైట్!" అన్నాడు షేక్ హేండ్ ఇస్తూ.

"గుడ్ నైట్!" అంది ఆ యువతి చెయ్యి ఊపుతూ.

అంతవరకూ నేనామె విషయం గమనించనే లేదు. మొదటిసారి విన్న ఆమె కంఠం, ఆ నవ్వూ నన్ను నిజంగా ముగుణి జేసేయి.

సెలవు తీసుకున్నాక, ఇద్దరూ వడివడిగా నడుస్తూ సందు చివరివైపు వెళ్ళసాగేరు. తీవ్రంగా ఆలోచిస్తూ మెయిన్ రోడ్డు వేపు అడుగులు వేసేను. జరీనా తాజ్ ఏమైంది? ఆ వ్యక్తి ఆమెని వెంబడించి పట్టుకున్నాడా? పట్టుకుని ఏం జేసేడు? ఆమెకూ ఆకాశ్ కూ ఏమిటి సంబంధం? జరీనా తాజ్ చెప్పిన చిరునామా, ఆమె స్వంత చిరునామా? లేక ఆకాశ్ చిరునామా? ఏదిఏమైనా ఆకాశ్ వున్నాడు. ఆ ఊహే నాలో కొత్త జీవం పోస్తోంది.

ఇంకా నయం, జరీనా తాజ్ పారిపోతుందన్న హడావుడిలో ఆ వ్యక్తి నన్ను చంపకుండా స్పృహపోగొట్టి పారిపోయేడు. భగవంతుడికి నామీద దయవుంది.

మెయిన్ రోడ్డు జేరుకున్నాను. అదృష్టవశాత్తూ అదే సమయంలో ఓ ఆటోరిక్షా పోతూ కనిపించింది. డ్రైవర్ని కేకేసి ఆపేను.

"ఎక్కడికి?" అడిగేడు.

"ముజఫర్ స్ట్రీట్!"

"ఎక్కడ ఆపాలి?"

లోన కూర్చుని, "వీధి మలుపులో!" అన్నాను.

ఆటో కదిలింది. రెండు మూడు రోడ్స్ కట్ జేసేక ఓ వీధిలోకి తిప్పేడు డ్రైవర్.

మీటర్ బిల్ పే జేసి ముందుకి కదిలేను. రోడ్డుపక్క నునికిపాట్లు పసుతూ వెలుగుతున్నాయి లైట్లు. అప్పు డప్పుడూ రిక్షాలోనో, సైకిల్ మీదో, కాలి నడకనో ఒకరిద్దరు వస్తూ పోతున్నారు.

జాగ్రత్తగా డోర్ నెంబర్స్ చెక్ జేస్తూ నడుస్తున్నాను. జరీనా తాజ్ చెప్పిన హౌస్ నెంబర్ కనుక్కోడానికి అరగంట పట్టింది.

సామాన్యమైన ఇల్లు అది. తలుపు మూసివుంది. ఓమారు అటూ ఇటూ చూసి ఇంటి అరుగు ఎక్కేను. లోపల ఎటువంటి అలికిడిలేదు. పిడికిలి బిగించి తలుపుమీద టకటక వాయించబోయేను. చెయ్యిపడ్డ మరుక్షణం తలుపు కిర్రు మంటూ తెరుచుకోడంతో ఆశ్చర్యపోయేను. పాంటు జేబులోంచి పిస్తోలు బైటికితీసి, సెఫ్టీకాచ్ లాగి తలుపు పూర్తిగా తోసేను.

లోపల చీకటి! చిమ్మ చీకటి!

ఏంజరిగినా ఎదుర్కోడానికి రెడీ అవుతూ లోన అడుగుపెట్టేను. ఇంట్లో సూదిపడితే వినిపించే నిశ్శబ్దం. ఎడంచేత్తో కోటుజేబులోంచి లైటర్ తీసి వెలిగించేను.

ఎటువంటి వస్తువూ లేని ఖాళీ గది అది! చీపురు స్పర్శకి నోచుకుని ఎన్నాళ్ళయిందో? ఆ గది కెదురుగా కుడిపక్క మరో రెండు గదులు. వాటి తలుపులూ మూసివున్నాయి. అడుగులో అడుగువేసుకుంటూ కుడిపక్కవున్న గదివైపు నడిచేను. తలుపుముందు ఆగి మెల్లగా తోసేను. తెరుచు కుంది. ట్రిగ్గర్ మీద వేలు రెడీగా వుంచి లోన అడుగు పెట్టేను. ఎవ్వరూ లేరు! గోడవారగా ఓ మంచం. మంచం మీద ఒకేఒక దుప్పటీ, దిండూ అస్తవ్యస్తంగా పడు

న్నాయి. మంచం పక్కనే చిన్న చెక్క టేబిల్, దాని మీద తెరిచివున్న ఓ సూట్ కేస్. ఓ నీళ్ళకూజా, పగిలిన గాజు గ్లాసూ, చిన్న అద్దం, దువ్వెన, హేరాయిల్ షేవింగ్ బాక్స్ ఉన్నాయి. కొన్ని మందు బాటిల్స్, కేప్సూల్స్ చిందరవందరగా పడున్నాయి. అంతే! అంతకి మించి మరేమీ లేవు.

సూట్ కేస్ లో కెలికివున్న వస్తువుల్ని పరిశీలించేను. కొన్ని పాంట్లూ, షర్ట్లూ తప్ప మరేమీ లేవు. సందేహం లేదు. ఆ గదిలో ఎవ్వరో మగాడు నివసించేవాడు. టేబిల్ మీద పడున్న ఆ మందు సీసాలూ, టాబ్ లెట్స్ నిబట్టి అతనేదో జబ్బుతో బాధపడుతున్నట్టు తెలుస్తోంది. ఎవ్వరతను! ఆకాశా? ఇంటికి తాళంకూడా వెయ్యకుండా ఎక్కడికెళ్ళాడు.

గదివున్న తీరుచూస్తుంటే, నేను రాకముందే ఎవ్వరో ఇంట్లో ప్రవేశించి దేనికోసమో వెదికినట్టు తెలుస్తోంది. తీవ్రంగా ఆలోచిస్తూ గదిలోంచి బైటికివచ్చి, మూసివున్న మరో గదివైపు నడిచేను. తలుపుముందు ఆగి మెల్లిగా తోసేను. కిర్రుమంటూ తెరుచుకుంది.

చిమ్మ చీకటి! లోన అడుగుపెట్టిన వాణ్ణలా షాక్ తగిలినట్టు అడుగు వెనక్కి తీసుకున్నాను. నా గుండెజేనే దడదడ నాకే స్పష్టంగా వినిపిస్తోంది. లైటర్ వెలుగులో నేలమీద ఓ స్త్రీ ముడుచుకు పడుంది! ఎవ్వరు? చెప్పలేని ఆత్రంతో వంగి, ఆమెని వెల్లికిలా తిప్పేను. ఆమె ఎవ్వరో కాదు.

జరీనా తాజ్!

చటుక్కున చెయ్యి అందుకుని పల్స్ చూసేను. గుండె ఝల్లుమంది! అది చెయ్యికాదు. ఐస్ ముద్ద! కొన్ని గంటల

క్రితం నన్ను కలుసుకున్న వ్యక్తి, నాకు ఎంతో విలువైన సమాచారం అందించిన వ్యక్తి, ఇప్పుడీ లోకాన్ని విడిచి పెట్టింది. శాశ్వతంగా విడిచిపెట్టింది. అది కలో నిజమో, నమ్మాలో వద్దో అంతుపట్టక, కొన్నిక్షణాలు రెప్పవెయ్యకుండా శవాన్ని చూస్తూండిపోయేను.

ఆ విధంగా అక్కడే కాలయాపన చెయ్యడం ప్రమాదం! బరువెక్కిన హృదయంతో భారంగా అడుగులు వేస్తూ వీధి గుమ్మంవేపు నడిచేను. గుమ్మందగ్గిర ఆగి, జాగ్రత్తగా వీధిలోకి తొంగిచూసేను. ఎవ్వరూ లేరు. చటుక్కున ఇంట్లోంచి బైటపడి తలుపు దగ్గరగా చేరవేసి మెట్లు దిగేను.

సందేహం లేదు. ఆకాశ్ ఆ ఇంట్లోనే ఉండేవాడు. జబ్బుతో ఉండేవాడు. నేను ముస్తఫా ఎంపోరియంలో ఆకాశ్ గురించి అడిగేసరికి ఆ యువతి నన్ను తార్‌పోర్ గలీకి ఆహ్వానించింది. నన్ను వెంబడిస్తూ ఓ వ్యక్తి అక్కడికి చేరుకున్నాడు. ధారాలో అడుగుపెట్టిన ఈరోజే నామీద ఎవ్వరికి అనుమానం కలిగింది?

ఆ సందులో జరీనాతాజ్, ఆకాశ్ గురించి నాకు చెబుతున్న సమయంలోనే ఆ వ్యక్తి నాతో కలియబడి మూర్ఛపోగొట్టి జరీనా వెనక పరిగెత్తేడు. ఆమెని పట్టుకుని హింసించి ఉంటాడు. విధిలేక అతన్ని ఆకాశ్ వున్న చోటికి తీసికెళ్ళి ఉంటుంది. ఊహాకందని విషయం ఇక్కడే ఉంది. ఆ ఇంట్లో ఉండే ఆకాశ్ కట్టుబట్టలతో ఏమైపోయాడు? పట్టుబడ్డాడా? లేక, ఆ వ్యక్తి కళ్ళల్లో దుమ్ముకొట్టి పారిపోయేడా?

ఆలోచిస్తూ దొరికిన టాక్సీ ఎక్కి హోటల్ చేరుకున్నాను.

# 4

"డేవిడ్! మనదగ్గిర వ్యవధి చాలా తక్కువ ఉంది. ఆకాశ్ ప్రమాదంలో ఉన్నాడు. అతన్ని కాపాడే కర్తవ్యం మనమీదే ఉంది. నీవు వెంటనే ముస్తఫా గ్లాస్ ఎంపోరియం బయలుదేరు. అక్కడ జరీనాతాజ్‌తో బాటు మరో ఇద్దరు అమ్మాయిలు పనిజేసేవారు. వాళ్ళని కలుసుకుని మాటలు కలిపి జరీనాతాజ్ ఇంటి చిరునామా కనుక్కురావాలి. నీ చాకచక్యంమీదే పరిశోధన ముందుకు సాగుతుంది. నీకోసం కోటికళ్ళతో వెయిట్ జేస్తుంటాను" అంటూ రిస్టువాచీ చూసుకున్నాను. ఉదయం ఎనిమిది గంటలు.

ఇద్దరం నిద్రలేచి తయారై, బ్రేక్‌ఫాస్ట్ ముగించేము. రాత్రి జరిగిన సంఘటనలన్నీ డేవిడ్‌కి క్షుణ్ణంగా వివరించేను.

నా ఇన్‌స్ట్రక్షన్స్ తీసుకుని డేవిడ్ వెళ్ళిపోయేడు.

అప్పుడు జ్ఞాపకం వచ్చేరు, రాత్రి నాపట్ల సానుభూతి చూపించిన తోబుట్టువులు. ఇద్దరూ ఈ హోటల్లోనే ఉన్నట్టు చెప్పేరు. కలుసుకోవాలి.

కాలింగ్‌బెల్ వత్తి వెయిటర్ని పిలిచి, వారి గది నెంబర్ అడిగేను.

"డబుల్‌రూం, థర్డ్‌ఫ్లోర్ 36 సార్!" అన్నాడు.

గది లాక్‌జేసి లిఫ్ట్‌లో మూడో అంతస్తు జేరుకున్నాను. నడవా కిరుప్రక్కలా ఉన్న డోర్‌నెంబర్స్ చెక్‌జేస్తూ ముందుకి నడిచేను. అదే రూం నెంబర్ 36.

తలుపు ముందు ఆగి, టకటక వాయించేను.

"ఎస్! కమిన్!" లోపలినించి తియ్యని కంఠం పలికింది.

రాత్రి నన్ను విపరీతంగా ఆకర్షించింది ఆ కంఠమే. మెల్లగా తలుపుతోసి లోన అడుగుపెట్టేను.

"మీరా! ఎవ్వరో అనుకున్నాను. ప్లీజ్, కమిన్!" అంది నవ్వుతూ.

ఆ నవ్వూ, నవ్వేడప్పుడు తళతళ మెరిసే ఆమె కళ్ళూ నా గుండె గతిని అధికం చేసాయి. సాధారణంగా స్త్రీల పట్ల అట్టే ఆసక్తి చూపని నేను, ఈ యువతి విషయంలో ఇలా ఆకర్షితుణ్ణవుతున్నానంటే, ఆమెలో ఎటువంటి అయస్కాంత శక్తి ఉందో వేరే చెప్పనవసరం లేదు.

గులాబీరంగు పంజాబీ డ్రెస్‌లో, ఆమె పుష్టికరమైన పచ్చని శరీరం మరీ అందంగా కనిపిస్తోంది.

"గుడ్ మార్నింగ్!" అంటూ వెళ్ళి ఆమె కెదురుగా కూర్చున్నాను.

"వెరీ గుడ్ మార్నింగ్! ఇప్పుడు ఒంట్లో ఎలా వుంది?" అడిగింది ఫ్లాస్కులోంచి కాఫీ కప్పుల్లో పోస్తూ.

"నా అయామ్ క్వైట్ ఓ. కే. రాత్రి చెప్పడం మరిచేను. నేనూ ఈ హోటల్లోనే మకాం చేశాను. గది చేరగానే కాస్త విస్కీ లాగించి పడుకున్నాను. బాగానే నిదరపట్టింది. మీ అన్నయ్య ఎక్కడ?" అడిగేను కాఫీ ముగించి.

"పనిమీద బైటకెళ్ళాడు. అతని కెప్పుడూ బిజినెస్ ధ్యాసే! చిట్టగాంగ్‌లో మాకు ఓ గ్లాస్ ఫ్యాక్టరీ ఉంది? అన్నట్టు మీరు భారతీయులన్నారు కదూ? గ్లాస్ బిజినెస్ మీద కొన్నాళ్ళక్రితం ఇక్కడికి వచ్చిన ఆకాశ్ తెలుసా మీకు?" ఊహించని విధంగా ఆమె నోటినించి ఆకాశ్ పేరు వినగానే నా గుండె క్షణం ఆగి తిరిగి కొట్టుకో సాగింది.

"తెలుసు! అతనిప్పుడెక్కడున్నాడు?" అడిగేను నా ఆత్రం వ్యక్తం కానివ్వకుండా.

"చిట్టగాంగ్‌లో! అక్కడ అద్దెకి ఓ ఇల్లు తీసుకుని ఉంటున్నాడు. ఇక్కడి ముస్తఫా గ్లాస్ ఎంపోరియం వారు మా ఫ్యాక్టరీలో తయారైన గాజు సామగ్రికి సోల్ డిస్ట్రిబ్యూటర్స్. ఆ పనిమీద అప్పుడప్పుడూ అన్నయ్యా, నేనూ ఇక్కడికి వస్తుంటాం. ఆకాశ్ ఇక్కడే కలిసేడు మాకు. భారతదేశంనించి అతను తెచ్చిన గాజు సామగ్రి నిజంగా మెచ్చుకో తగ్గది. మాతోబాటే అతనూ చిట్టగాంగ్ వచ్చేడు. ఒకటి రెండుసార్లు అక్కడ అతనుండే ఇంటికి ఆహ్వానించేడు కూడా!"

"అతన్ని ఓసారి కలుసుకోవాలి! చిట్టగాంగ్‌లో అతని ఎడ్రస్ ఏమిటి?"

"హార్బర్ రోడ్! హెచ్. నెంబర్ 24-39/3."

"చిట్టగాంగ్ వెళ్ళడానికి ట్రెయిన్ ఉంది కదూ?"

ఫరీదా తలూపింది.

"థాంక్స్! వీలుచూసుకుని ఎప్పుడైనా వెళతాను!" అంటూ ఏదో అర్జంటు పని జ్ఞాపకం వచ్చినట్టు రిస్టువాచీ చూసుకుని, "ఇక సెలవు తీసుకోవచ్చా?" అన్నాను.

"ఏం ఎక్కడికైనా వెళ్ళాలా?" అడిగింది నేను పోవడం ఇష్టంలేనట్టు.

తలూపి, "ఇక్కడే ఉన్నాం కదా, మళ్ళీ వస్తాను!" అన్నాను షేక్‌హేండ్ కోసం చెయ్యిచాపుతూ.

ఆమె చెయ్యి నా చేతిలోకి రాగానే నరాల్లో ఏదో విద్యుత్తు ప్రవహించినట్టు వళ్ళు ఝల్లుమంది. సున్నగా మెత్తగావున్న ఆమె చేతిని చటుక్కున ఎత్తి ముద్దుపెట్టుకున్నాను.

ఛీ! ఏమిటిది? అరుస్తాను. వదులు! ఇలాటివేమీ జర క్కుండా, ఆమె మత్తుగా నవ్వడంతో నాలో కొండంత ధైర్యం పుంజుకుంది. మనసు దూదిపింజగా మారి నీలి గగనంలో తేలిపోతున్నట్టు అనుభూతి కలిగింది.

సెలవు తీసుకుని, నా గదిలోకి వచ్చి, దేవిడ్ కోసం ఎదురుచూడసాగేను.

సరిగ్గా పదిన్నరకి గదిలో అడుగుపెట్టేడు.

"ఏమైనా తెలిసిందా?" అడిగేను ఆత్రంగా.

తలూపి, తలుపుమూసి సోఫాలో కూర్చున్నాడు. "నేను ముస్తఫా గ్లాస్ ఎంపోరియం చేరడానికి పది నిమిషాలముందు అక్కడికి పోలీసులు వచ్చి వెళ్ళేరుట. రాత్రి జరీనాతాజ్ హత్యజెయ్యబడిందిట. ఆమె ఎక్కడ నివసించేదో కనుక్కున్నాను. ముజీబ్ నగర్‌లోని ఓ అద్దె ఇంట్లో తన తండ్రితో నివసించేదిట. ఆమె తండ్రి పేరు అజ్మద్ ఖాన్!"

"ముజీజ్ నగర్‌లో ఆ ఇల్లు ఎలా కనుక్కోవాలి?"

"ఆ అమ్మాయికి జరీనాతాజ్ ఇంటి నెంబర్ తెలీదుట. ఆచూకీ చెప్పింది. ముజీజ్ నగర్‌లో స్కైలైన్ అనే చిన్న రెస్టారెంట్ ఉంది. దానికి అరఫర్లాంగు దూరంలో రోడ్డు పక్క ఓ వేపచెట్టు ఉంటుంది. ఆ చెట్టు కెదురుగా కనిపించేదే జరీనా ఇల్లు!"

సాలోచనగా తలూపేను. "ఆకాశ్ గురించి మరో సమాచారం తెలిసింది. నీవు తక్షణం ఢాకా ఏర్‌పోర్ట్‌కి ఫోన్ జేసి చిట్టగాంగ్ వెళ్ళే ఫ్లైట్ టైమింగ్స్ కనుక్కో. సాధ్యమైనంత త్వరలో చిట్టగాంగ్ జేరి, అక్కడ హార్బర్ రోడ్‌లో వున్న 24-49/3 ఇల్లు వాకబ్

జెయ్యాలి. అది ఆకాశ్ తీసుకున్న అద్దె ఇల్లు. అక్కడ అతనిగురించి మరికొన్ని విషయాలు తెలియవచ్చు. నేను జరీనాతాజ్ ఇంటికెళ్ళి ఆమె తండ్రిని కలుసుకుంటాను'' అంటూ లేచి టేబిల్ మీది బ్రీఫ్ కేస్ తెరిచేను.

దాంట్లోంచి మేకప్ లెదర్ బాక్స్ తీసి, చకచక మేకప్ జేసుకోసాగేను.

అరగంటలో అంతా ముగించి, ఫైనల్ టచింగ్ కోసం అద్దంలో పరీక్షగా చూసుకున్నాను. నల్లని గెడ్డం. అందంగా కట్ జేసిన మీసాలు. తలమీద జిన్నా టోపి. కళ్ళకి సన్నగా గీసుకున్న సుర్మా! అచ్చు ముస్లిమ్‌లా ఉన్నాను.

నుదురు చూసుకున్నప్పుడు జ్ఞాపకం వచ్చింది. సాధారణంగా ఐదు వేళలా నమాజు చేసే మహమ్మదీయులకి, నమాజు చేసేటప్పుడు మోకాళ్ళమీద వంగి నుదురు నేలని తాకిస్తారు కనక రాపిడికి నుదుటి చర్మం కాస్త నల్లబారుతుంది.

ఈ ఆలోచన రాగానే, ఐబ్రోపెన్సిల్ అందుకుని కనీ కనిపించనట్టు నుదిటిమీద బ్లాక్ టచింగ్ ఇచ్చేను. రాత్రి చూసిన వ్యక్తులు ఇప్పుడు నన్ను చూస్తే గుర్తించడం దుర్లభం!

ఈలోగా డేవిడ్ ఏర్ పోర్ట్ కి ఫోన్ జేసికనుక్కున్నాడు. చిట్టగాంగ్ వెళ్ళే ప్లేన్ సాయంత్రం నాలుగ్గంటలకి వుంది. అంతవరకూ డేవిడ్ ఇక్కడ గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోడంకంటే, నాతోబాటు రావడం మంచిదనిపించింది.

గది లాక్ జేసి, టాక్సీలో ఇద్దరం ముజీబ్ నగర్ బయలు దేరాం!

# 5

స్కైలైన్ రెస్టారెంట్ కనుక్కోడం ఏమంత కష్టం కాలేదు. డేవిడ్‌ని రెస్టారెంట్ దగ్గిరే ఉండమని చెప్పి నేను ముందుకి నడిచేను. దూరంగా కనిపిస్తోంది వేపచెట్టు. చెట్టుని సమీపించగానే కాళ్ళకి బ్రేకులు పడ్డట్టు ఆగి పోయేను. చెట్టుకింద కారు! స్కైబ్లూ ఆస్టిన్ కారు. రాత్రి నన్ను తార్‌పోర్ కలీవరకూ వెంబడించిన కారు అదే! డ్రైవింగ్ సీట్లో ఎవ్వరో కూర్చున్నట్టు వెనకనించి సగం వీపు కనిపిస్తోంది. ఎవ్వరు?

నడక మార్చి ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ దారినపోయే దానయ్యలా ముందుకి నడిచేను. కారు దాటి కొద్దిదూరం వెళ్ళి ఏదో జ్ఞాపకం వచ్చినట్టు ఆగి, జేబులు తడుముకుని ఏదో మరిచిపోయినట్టు వెనక్కి తిరిగేను. కారు సమీపించ గానే చూసీ చూడనట్టు ఓరగా డ్రైవింగ్ సీట్లోకి చూసేను.

అతనే?! రాత్రి నాతో కలియబడి జరీనా వెనక పరిగెత్తిన వ్యక్తి. ఇప్పుడు ఫుల్‌సూట్‌లో లేడు. కళ్ళకి కూలింగ్‌గ్లాసెస్ పెట్టుకున్నాడు. సిగరెట్ కాలుస్తూ అప్పుడప్పుడూ చెట్టు కెదురుగా వున్న ఇంటివేపు చూస్తున్నాడు. అది జరీనాతాజ్ ఇల్లు!

సందేహం లేదు. అతను ఆ ఇంటిని కాపలా కాస్తున్నాడు. వడివడిగా రెస్టారెంట్ వేపు అడుగులు వేసేను. డేవిడ్ నాకోసమే ఎదురు చూస్తున్నాడు.

చేతులూ కళ్ళూ తిప్పకుండా ఏదో సామాన్య విషయం మాట్లాడుతున్నట్టు డేవిడ్‌కి చెప్పేను. "ఆ వేపచెట్టుకింద ఓ నీలిరంగు ఆస్టిన్ ఆగివుంది చూడు. దాంట్లో కూర్చున్న వ్యక్తి జరీనా ఇంటిమీద నిఘావేసి ఉన్నాడు. నేను

ఆ ఇంట్లోకి వెళ్ళి జరీనాతాజ్ తండ్రిని కలుసుకుంటాను. నీవు ఇక్కడే వుండి ఆ వ్యక్తిని గమనించాలి. ఒకవేళ అతను కారు తీసుకుని ఎక్కడికైనా బయలుదేరితే, టాక్సీలో వెంబడించు. నీవు తిరిగి వచ్చేవరకూ నేను ఆ ఇంట్లోనే ఉంటాను!''

దేవిడ్ తలూపేడు!

వెనుదిరిగేను. అటూ ఇటూ చూడకుండా తలవంచుకుని ఆ ఇంటివేపు నడిచేను. తలుపుమూసి వుంది. మునివేళ్ళతో తట్టేను. జవాబులేదు.

కాసేపాగి మళ్ళీ తట్టేను.

''ఎవ్వరు?'' లోపలినించి మగ కంఠం వినిపించింది.

బదులివ్వకుండా మళ్ళీ తట్టేను.

కాసేపటికి తెరుచుకుంది!

అతని మొహం చూడగానే అర్థమయింది, కూతురి దుర్మరణం అతనికి తెలిసిపోయినట్టు.

''అమ్జద్ ఖాన్ మీరే కదూ?'' అడిగేను.

అతను తలూపి, ''ఎవ్వరు మీరు?'' అన్నాడు.

''చెబుతాను. ముందు లోనికి నడవండి. మనం అపరిచితులమైనట్టు ఇలా గుమ్మంలో నిల్చుని మాట్లాడుకోడం ప్రమాదం! నేను మీ శ్రేయోభిలాషిని. బైట మీ ఇంటి మీద నిఘా వుంది. మీ అమ్మాయిని ఎవ్వరు చంపేరో, దేనికి చంపేరో నాకు తెలుసు. పదండి!'' అన్నాను తగ్గు స్వరంతో.

అతను క్షణం ఆలోచించి, ''రండి!'' అన్నాడు తలుపు కడ్డం తొలుగుతూ.

నేను లోన అడుగుపెట్టగానే తలుపు ముయ్యబోయేడు

"వద్దు! తలుపు మూస్తే, బైటవున్న వ్యక్తికి అనుమానం కలగవచ్చు. గుప్పిట తెరిచి వుంచితేనే ఎదుటి వ్యక్తి మనసులో కుతూహలానికి ఆస్కారం వుండదు!" అన్నాను.

అమ్జద్ ఖాన్ సాలోచనగా తలూపి లోనకి నడిచేడు.

నలభై ఏళ్ళుంటాయతనికి. అక్కడక్కడా నెరసిన జుత్తు. యవ్వనంలో బాగా కసరత్తు జేశాడేమో, దృఢంగా, పొడుగ్గా ఉన్నాడు. కళ్ళల్లో ఆత్మవిశ్వాసం, దేనికైనా తెగించే తెగువూ ద్యోతకమౌతాయి. తెల్లని మీసాలు అతనికి ఓ ప్రత్యేకమైన గాంభీర్యాన్ని తెచ్చి పెడుతున్నాయి. చేతులు ఊపుతూ నడుస్తుంటే గమనించేను అతని ఎడమచెయ్యి మణికట్టువరకూ తెగివుండటం!

పడగ్గదిలోకి తీసికెళ్ళి "కూర్చోండి!" అన్నాడు మంచంమీద కూర్చుంటూ.

అతని కెదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాను.

"ఇప్పుడు చెప్పండి! ఎవ్వరు మీరు?" అడిగేడు.

"నేను భారతదేశంనించి వచ్చేను. ఆకాశ్ అనే పేరు ఎప్పుడైనా విన్నారా మీరు?" అడిగేను అతని కళ్ళల్లోకి.

"మీరు ఆకాశ్ తరఫు మనిషా? అతనికెలా వుంది ఇప్పుడు?" అన్నాడు అమ్జద్ ఖాన్ ఆశ్చర్యంగా.

"నేనింతవరకూ అతన్ని చూడనేలేదు. అతని ఆచూకీ తియ్యడానికే భారతదేశంనించి వచ్చేను!" అంటూ రాత్రి జరిగిన సంఘటనలన్నీ పూసగుచ్చినట్టు వివరించేను.

అమ్జద్ ఖాన్ కొన్ని నిమిషాలవరకూ పలకలేదు. ఎక్సైట్ మెంట్ తో కాబోలు అతని మొహం జేవురించి వుంది. తరవాత తలెత్తి చెప్పసాగేడు. "ఉదయం ఏడు గంటల ప్రాంతంలో పోలీసులు వచ్చేరు ఇక్కడికి, నా

కూతురు మరణవార్త విని ముందు నమ్మలేకపోయాను. అక్కడికెళ్ళి శవం చూసేకగానీ నమ్మక తప్పలేదు. వేరొకరైతే గుండె పగిలి చచ్చేవారే!

నా జీవితంలోని సగభాగం యుద్ధాల్లో గడిచిపోయింది. రెండవ ప్రపంచ యుద్ధంలో బ్రిటిష్ సైన్యంలో పని చేశాను. బంగ్లాదేశ్ విముక్తి యుద్ధంలో పాక్ కిరాతకులకి విరుద్ధంగా ముక్తిబాహినిలో పనిజేసేను. వంగ బంధు ముజీబ్ నాకు అత్యంత సన్నిహితుడు. ఆ ముక్తి పోరాటం లోనే హాండ్ గ్రనేడ్ షెల్లింగ్ తగిలి, ఇదుగో ఈ అర చెయ్యి ఎగిరి పోయింది.

మాకోసం భారతదేశం జేసిన త్యాగం అంతా ఇంతా కాదు. మీ దేశంపట్ల నాకు విపరీతమైన అభిమానం వుంది. ఎటువంటి ప్రతిఫలం ఆశించకుండా, కిరాతకమైన నియం తృత్వాంనించి ఒక దేశాన్ని విముక్తి జెయ్యడానికి ప్రాణాలని పణంగాపెట్టి మీ సైనికులు పోరాడిన తీరూ, తొంభైవేల మంది శత్రు సైనికులని ఆయుధాలుకింద పడవేయించి మోకరిల్లజేసిన తీరూ సామాన్యమైంది కాదు. చరిత్రలో ఇటువంటి సంఘటన ఇంతవరకూ జరగలేదు.

మీ ఋణం ఎన్నటికీ తీర్చలేనిది. అందుకే నేనూ, నా కూతురూ మీ ఏజెంట్ ఆకాశ్ కు ఉడతా భక్తిగా ఈ చిన్న సహాయం జేశాం.

జరీనా నాకు ఒక్కటే సంతానం. తల్లిలేని ఆ పిల్లని ప్రాణపదంగా పెంచేను. నాకు మిలిటరీ పెన్షన్ దొరుకు తోంది. జరీనా ఆ గ్లాస్ ఎంపోరియంలో పనిజేసి సంపా దించేది. మా దేశంలో రాజకీయ గతి ఊసరవెల్లిలా రంగులు మారుస్తోంది. ఎప్పుడేం జరుగుతుందో ఎవ్వరూ ఊహించ

లేకుండా వున్నారు. మా ప్రియతమ నాయకుడు ముజీబ్ కుటుంబాన్ని కిరాతకంగా చంపి పాక్ అభిమాన దళం గద్దె ఎక్కింది. ఎందరో త్యాగమూర్తుల రక్త తర్పణంతో సంపాదించిన స్వేచ్ఛ స్వాతంత్ర్యం నేలపాలయింది. రాజకీయాధికారం ఇంకా ఎన్ని దళాల చేతులు మారుతుందో ఏమైపోతుందో నేను చెప్పలేను.

ఇటువంటి తరుణంలోనే ఆకాశ్‌తో మాకు పరిచయం కలిగింది. ఒక రాత్రి జరీనాయే అతన్ని ఇక్కడికి తీసుకు వచ్చి, నాకు పరిచయం జేసింది. భారతదేశానికి విరుద్ధంగా ఈ కొత్త ప్రభుత్వం ఏదో కుతంత్రం పన్నుతున్నట్టు తనకి అనుమానం ఉందనీ, భారతదేశంపట్ల ఈ ప్రభుత్వానికి ఉన్న రహస్యమైన ఆలోచనలు ఎటువంటివో కూపీ తియ్యడానికి తను వచ్చేననీ, తనకి కావలసిన సమాచారం, సహాయం చెయ్యమనీ మమ్మల్ని అర్థించేడు. ముందే ఈ ప్రభుత్వంపట్ల మనసునిండా ద్వేషంవున్న మేము వెంటనే సమ్మతించేము.

ఆకాశ్ ఇక్కడ ఎలా మసలుకోవాలి? ఎవరెవర్ని కలుసుకోవాలి? ఇక్కడ గూఢచారి విభాగం ఎక్కడుంది? మిలిటరీ ప్లానింగ్ హెడ్‌క్వార్టర్ ఎక్కడుంది? దాంట్లో ప్రవేశించడానికి ఎటువంటి అడ్డంకులు ఎదుర్కోవాలి? ఇటువంటి ముఖ్యమైన సమాచారాలు అతనికి అందించే వాణ్ణి.

వారంరోజులక్రితం ఓ అర్ధరాత్రి హడావుడిగా వచ్చి, తను తన మిషన్‌లో సఫలమైనట్టు సైనికదృష్ట్యా ఎంతో ప్రాముఖ్యంగల కొన్ని పత్రాలు మిలిటరీ ప్లానింగ్ హెడ్‌క్వార్టర్‌నించి తస్కరించినట్టూ, గూఢచారి విభాగానికి తనమీద అనుమానం కలిగినట్టూ, వీలుచూసుకుని

సాధ్యమైనంత త్వరలో భారతదేశం చేరుకోవాలను కున్నట్టూ చెప్పేడు.

అతను సెలవు తీసుకుంటూ నాకు షేక్ హాండ్ ఇచ్చి నప్పుడు తెలిసింది. జ్వరంతో అతని శరీరం వేడిగా ఉన్నట్టు. క్లైమేట్ ఛేంజ్ అవడంవల్ల కాస్త ఫీవర్ వచ్చిందనీ, ఉదయంలోగా అదే తగ్గిపోతుందనీ చెప్పి వెళ్ళేడు.

మర్నాటి రాత్రి జరీనాను పంపించేను అతని ఆరోగ్యం ఎలా ఉందో కనుక్కురమ్మని. జ్వరం తిరగబెట్టిందనీ, మంచానపడి మూలుగుతున్నాడనీ చెప్పింది. నాకు తెలిసిన ఒక డాక్టర్ని వెంటబెట్టుకుని, ఆకాశ్ నివసించే గదికి వెళ్లేను. డాక్టర్ రాసిన మందులూ అవీ తీసికెళ్ళి ఇచ్చేను. ప్రతిరోజూ రాత్రి జరీనా, నేనూ వెళ్ళి చూసి వచ్చే వాళ్ళం. మొన్న కాస్త కోలుకున్నట్టు కనిపించేడు.

ఇలా జరుగుతుందని నేను కల్లో కూడా ఊహించలేదు. నాలోటు తీర్చలేనిది. ఎవ్వరూ పూడ్చలేనిది. ఇక నా జీవితానికి ఒక అర్థం అంటూ మిగల్లేదు. నా చిట్టితల్లిని చంపిన కిరాతకులని నరికి ముక్కలుచేసి కుక్కలకీ, నక్కలకీ వెయ్యందే నేను నిదరబోను!'' మాట్లాడుతోంటే అమ్జద్ ఖాన్ మెడనరాలు ఆవేశంలో ఉబికి వచ్చేయి.

చాలు! నాకు కావలసింది కూడా అదే. అమ్జద్ ఖాన్ వంటి ధైర్యశాలీ, అన్నీ తెలిసిన వ్యక్తి సహాయం మాకు అత్యవసరం.

నేనూ, డేవిడ్ హోటల్ గదిలో నివసిస్తూ మా కార్య కలాపాలు సాగించడం ప్రమాదం. ఎక్కడో మారుమూల ఓ ఇల్లు ఏర్పాటు చేసుకుంటే మంచిది. అమ్జద్ ఖాన్

ఇంట్లో వుండడం కూడా ప్రమాదకరం! అతని ఇంటిమీద నిఘా వుంది.

ఆ సంగతే చెప్పేను అతనికి.

కాసేపు ఆలోచించి, పరిష్కారం దొరికినట్టు తలెత్తేడు. "నా ఆప్తమిత్రుడొకడు ఈ మధ్యే మక్కా దర్శించి రావడానికి సౌదీ అరేబియా వెళ్ళేడు. అతను తిరికి రావడానికి దాదాపు నెలైనా పడుతుంది. అతను తిరిగి వచ్చే వరకూ ఇంటి బాగోగులు చూస్తుండమని తాళంచెవులు ఇచ్చి వెళ్ళేడు. అది చాలా పెద్ద ఇల్లు. మీ రందులో నివసిస్తానంటే నాకేమీ అభ్యంతరంలేదు!" అన్నాడు.

నేను వెంటనే అంగీకారం తెలిపేను.

సరిగ్గా అదే సమయంలో బైట గుమ్మందగ్గిర ఏదో అలికిడి వినిపించింది! నా చెయ్యి చటుక్కున కోటు లోపల జేబులోనికి వెళ్ళింది. మెరుపులా లేచి బైటికెళ్ళి చూసేను.

డేవిడ్!

"నువ్వా! రా లోపలికి!" అన్నాను.

డేవిడ్ మౌనంగా లోనికి వచ్చేడు. ఇంతలో అమ్జద్ ఖాన్ కూడా ఏం జరిగిందో చూడ్డానికి బైటికి వచ్చేడు. అతనికి డేవిడ్ని పరిచయం జేసేను. ముగ్గురం తిరిగి లోని కెళ్ళి కూర్చున్నాం.

డేవిడ్ తన రిపోర్ట్ ఇవ్వసాగేడు: "మీరీ ఇంట్లోకి వచ్చిన అరగంటవరకూ ఆ వ్యక్తి బైట కార్లో కూర్చున్నాడు. తరవాత కారు స్టార్ట్ జేసి మెల్లిగా వెనక్కి తిప్పేడు. అతన్ని కాస్త ముందుకి పోనిచ్చి, ఆటోరిక్షాలో చాలా జాగ్రత్తగా వెంబడించేను. ఆ కారు తిన్నగా మెహబూబ్ స్ట్రీట్లోకి తిరిగి ఓ ఇంటిముందు ఆగింది.

అతను కారు దిగి ఇంట్లోకి వెళ్లేడు. సరిగ్గా అదేసమయంలో మరో వైపునించి ఓ అష్కలర్ అంబాసిడర్ వచ్చి ఆగింది ఆ ఇంటిముందు. దాంట్లోంచి లెదర్ బాగ్ పట్టుకుని ఓ నలభైఏళ్ళ కళ్ళద్దాలు పెట్టుకున్న వ్యక్తి, మరో యువకుడూ దిగి లోనికెళ్ళారు. అంతవరకూ చూసి వచ్చేశాను!'' అన్నాడు.

అమ్జద్ ఖాన్ సాలోచనగా తలూపి, "వాళ్ళ స్థావరం అదే అయుంటుంది! ఈ రాత్రి మూడో కంటికి తెలీకుండా దాంట్లో ప్రవేశించి తాడో పేడో తేల్చిపారెయ్యాలి. ఇప్పుడోమారు అక్కడికెళ్ళి దూరంనించి ఆ ఇంటికి "రేకీ' జేసి రావడం మంచిది!'' అన్నాడు.

ముగ్గురం టాక్సీలో బయలుదేరాం. మహెబూబ్ స్ట్రీట్‌లో ఓచోట టాక్సీ ఆపించి దూరంగా కనిపిస్తున్న ఓ డాబా ఇల్లు చూపెట్టేడు డేవిడ్, తలుపుమూసి వుంది. ఆ వీధిలో ఇళ్ళు దూరదూరంగా విసిరివేసినట్టున్నాయి. నేనూ, అమ్జద్ ఖాన్ కళ్ళతోనే ఆ ఇంటినీ, దాని పరిసరాల్లో వున్న ఇళ్ళనీ, దుకాణాలనీ పరిశీలించి మస్తిష్కంలో పూర్తి మ్యాప్ సెట్ జేసుకున్నాం.

"ఇక చాలు! పదండి!'' అన్నాడు అమ్జద్ ఖాన్.

అక్కణ్ణించి తిన్నగా హోటల్‌కెళ్ళి గది ఖాళీచేసి సామానుతో అమ్జద్ ఖాన్ చెప్పిన ఇంటికి కెళ్ళాం. విశాలమైన ఇల్లు అది. ఇంటిచుట్టూ చిన్న కంపౌండ్ పెద్దహాలు. హాల్లో రకరకాల డెకొరేషన్ వస్తువులు. మేడమీద అందమైన మూడు గదులు. మాకు అన్నివిధాలా అనుకూలంగా ఉంది ఇల్లు.

ముగ్గురం కూర్చుని, జాగ్రత్తగా పథకం తయారు జెయ్యసాగాం!

# 6

"టైమ్ ఎంతవుతోంది?" అడిగేడు అమ్జద్ ఖాన్.

రిస్టువాచీ చూసుకుని, "పన్నెండుబావు!" అన్నాను.

అది మహెబూబ్ స్ట్రీట్. వీధిలో కుక్క దిక్కు లేదు. రోడ్డుపక్క మునిసిపాలిటీ లైట్లు కునికిపాట్లు పడుతున్నాయి.

నేనూ అమ్జద్ ఖాన్ చీకట్లోంచి బైటకివచ్చి, ఆ ఇంటి వేపు అడుగులు వెయ్యసాగేము. డేవిడ్ సాయంత్రం నాలుగ్గంటల విమానంలో చిట్టగాంగ్ వెళ్ళిపోయేడు. నేనింకా మారువేషంలోనే వున్నాను.

అమ్జద్ ఖాన్ చటుక్కున చెయ్యిపట్టి ఆపడంతో, కాళ్ళకి బ్రేకులు వేసినట్టు ఆగిపోయేను. సరిగ్గా అదే సమయంలో ఆ ఇంటి తలుపు తెరుచుకుంది. ఇద్దరం మెరుపులా ఓ టెలిఫోన్ పోల్ చాటున తప్పుకుని, అటు చూడసాగాం. ఆ ఇంట్లోంచి లెదర్ బాగ్ పట్టుకుని ఓ వ్యక్తి బైటికి వచ్చేడు. అతని వెనకే మరో ఇద్దరు ఇవతలికి వచ్చేరు. మసక చీకటి కావడంవల్ల వారి మొహాలు గుర్తించడం కష్టం.

ముగ్గురూ ఇంటిముందు ఆగివున్న అమ్కలర్ అంబాసిడర్‌లో కూర్చున్నారు. కారు స్టార్టయింది. వెనుదిరిగి వేగంగా దూసుకుపోయింది. వాళ్ళలా వెళ్ళగానే ఇంటి తలుపు తిరిగి మూసుకుంది. అంటే, ఇంట్లో ఇంకెవ్వరో వున్నారన్నమాట. ఎవ్వరు? ఎంతమంది?...

పదమన్నట్టు సైగ చేశాడు అమ్జద్ ఖాన్. ఇద్దరం ఇంటిని సమీపించాం!

"నేను సిద్ధంగా ఉన్నాను. మీరు తలుపు తట్టండి!" అన్నాడు అమ్జద్ ఖాన్ జేబులోంచి పిస్తోలు తీస్తూ.

ఆ ఇంట్లోకి ప్రవేశించాలంటే అదొక్కటే మార్గం! తప్పదు. మెట్లెక్కి తలుపు తట్టేను.

"కోన్ ఆచి? (ఎవ్వరు?)" వెంటనే జవాబు వచ్చింది.

"ఆమి ఆచి. ఫాటక్ట ఖోలెదోవ్ (నేను. తలుపు తెరువ్)" అన్నాను బెంగాలీలో.

అమ్జద్ ఖాన్ మెరుపులా గోడకి నక్కి నిల్చున్నాడు.

గడియతీసిన శబ్దం. తలుపు కిర్రుమంటూ తెరుచుకుంది.

మూప్పై ఏళ్ళుంటాయతనికి. మొహంమీద స్ఫోటకం మచ్చలు. నల్లగా, సామాన్యమైన ఒడ్డు పొడుగులో వున్నాడు.

"ఎవరు నువ్వు? ఏంకావాలి?" అడిగేడు కనుబొమలు ముడిచి.

"లాయర్ యూసుఫ్ సాబ్ ఇల్లు ఇదేనా?" అడిగేను కంఠంలో నమ్రత ఒలకబోస్తూ.

"కాదు!" అన్నాడు విసురుగా.

"వారి ఇల్లెక్కడో తెలుసా మీకు?"

"తెలీదు!" అంటూ తలుపు ముయ్యాబోయేడు.

డొక్కలో ఒక్కటి ఇచ్చేను. ఊపిరి ఆగినట్టు మూలిగేడు. పిడికిలి బిగించి ఒంట్లో వున్న శక్తి కొద్దీ నాభికింద ఇచ్చేను. పొట్ట పట్టుకున్నాడు. ఊహించని ఆ బలమైన దెబ్బకి పేగులు ఉండచుట్టుకు పోయుంటాయి. మోకాళ్ళ మీద కింద కూలుతూ తలుపు పట్టుకుని నిలదొక్కుకో బోయేడు. అరచేతి అంచుతో మెడమీద జూడో దెబ్బ తీసేను.

"సలీమ్!" అని గావుకేక పెడుతూ పిండిబస్తాలా కిందపడ్డాడు.

అతనిలో చలనం నశించింది. కాలితో అతన్ని లోనికి తోసి, రెప్పపాటులో ఇద్దరం హాల్లోకి దూరి తలుపు మూశాం.

లోపల నిశ్శబ్దం! ఎవ్వరూ వున్న అలికిడిలేదు. డిమ్ లైట్ వెలుగుతోంది. పైన రెండు గదులు కనిపిస్తున్నాయి. పైకి వెళ్ళడానికి హాల్లోంచి గోడవారగా చెక్క మెట్లు. తలుపు తెరిచిన వ్యక్తి, దెబ్బతిని కిందకూలుతూ సలీమ్ అని కేకేశాడు. అంటే, ఆ పేరుగల వ్యక్తి ఎవ్వరో ఇంట్లో ఎక్కడో ఉన్నాడన్నమాట. ఈ ఆలోచన రాగానే సవ్వడికాని అడుగులతో పరుగెత్తి, మెట్లవెనక దాగేము.

పైన గది తలుపు తెరుచుకున్న శబ్దం, ఎవ్వరో నడవా లోకి వచ్చిన బూట్సుల సవ్వడి.

ఊపిరి బిగబట్టి తయారుగా నిల్చున్నాం.

"అక్తర్!" పైనించి వినిపించింది మగ కంఠం.

బహుశా అది ఆ స్ఫోటకం మచ్చల వ్యక్తి పేరే అయ్యుంటుంది. హాల్లోంచి ఎటువంటి జవాబు రాక పోడంతో అతనికి అనుమానం వేసివుంటుంది. ఒక్కొక్క మెట్టే దిగుతూ కిందికి వస్తున్నాడు. అంతవరకూ నాపక్క నిల్చుని పొంచి చూస్తున్న అమ్జద్ ఖాన్ పిల్లిలా నక్కుతూ మెల్లిగా మొదటి మెట్టువేపు జరగసాగేడు.

సలీమ్ అనబడే ఆ వ్యక్తి, చివరిమెట్టు దిగి హాల్లోకి అడుగుపెట్టడం. అమ్జద్ ఖాన్ చిరుతలా లంఘించి తన మొండిచేత్తో అతని డొక్కలో పొడవడం, ఆ హఠాత్సంఘటనకి అతను గావుకేక పెట్టడం, లిప్తపాటులో జరిగిపోయేయి. ఆ దెబ్బనించి అతను కోలుకోకముందే

అమ్జద్ ఖాన్ మోకాలు మడిచి అతని తొడలమధ్య కుమ్మేడు.

ఈలోగా నేనూ అక్కడికి చేరుకున్నాను.

అమ్జద్ ఖాన్ అతన్ని ఊపిరి తీసుకోనివ్వకుండా, నిల దొక్కుకోనివ్వకుండా పంజాలేని మొండిచేతో ఇష్టం వచ్చినట్టు పొడవసాగేడు. అవి సామాన్యమైన దెబ్బలు కావు.

కొద్దిక్షణాల్లోనే సలీమ్ నిస్సత్తువతో ఆకుకూర కాడలా అష్టవంకర్లు తిరుగుతూ నేల కరిచేడు.

"సమయం విలువైనది. క్షణం వృధా జెయ్యకూడదు. కమాన్! క్విక్!" అంటూ మెట్లగుండా మీదికి పరుగు తీసేడు అమ్జద్ ఖాన్.

అతని వెనకే రెండంగల్లో మేడమీదికి జేరుకున్నాను. పైన రెండు గదులు! తలుపులు మూసివున్నాయి. ఎడం చేత్తో సెఫ్టీకాచ్ లాగి రివాల్వర్ రెడీగా పట్టుకుని తలుపు తోసేను. భళ్ళున తెరుచుకుంది.

గది ఖాళీ! ఎవ్వరూలేరు!!

రెండవ గదివేపు నడిచి, మెల్లిగా తలుపు తోసేను. ఆ నిశ్శబ్ద వాతావరణంలో తలుపు జేసిన కిర్రుమనే చప్పుడు చాలా విచిత్రంగా వినిపించింది. గదిలోకి చూసిన నా గుండెగతి వేగం అందుకుంది. ఓ గోడవారగా మంచం! మంచంమీద ముసుగుతన్ని ఎవ్వరో పడుకున్నారు.

అమ్జద్ ఖాన్ని వెనక రమ్మన్నట్టు సైగజేసి అడుగులో అడుగువేసుకుంటూ మంచంవేపు నడిచేను. మంచందగ్గిర నిల్చుని వంగి, దుప్పటి తొలగించేను.

ఆకాశ్!

ప్రాణాలకు తెగించి, నేను వెతుకుతున్న, నాకు కావలసిన ఆకాశ్ అతనే!!

కళ్ళు మూతలు పడుతున్నాయి. నుదుటిమీద నీటితో తడిపిన బట్ట. చటుక్కున చెయ్యి అందుకుని పల్స్ చూసేను. ప్రాణం ఉంది! ఫీవర్‌తో కాబోలు వళ్ళు కాలి పోతోంది. చాలా మెల్లిగా శ్వాస పీలుస్తున్నాడు.

మంచం పక్క టీపాయ్‌మీద మందుసీసాలూ, టాబ్లెట్సూ, థర్మామీటర్, ఐస్‌బాగ్ కనిపిస్తున్నాయి.

"ప్రాణం వుందా?" అడిగేడు అమ్జద్‌ఖాన్ ఆతృతగా.

"ఉంది! కాని పల్స్ వీక్‌గా కొట్టుకుంటోంది!" అన్నాను.

"అర్థమైంది. మనం బైట వున్నప్పుడు, చేతిలో లెదర్ బాగ్ పట్టుకుని ఈ ఇంట్లోంచి బైటికివచ్చి కార్లో వెళ్ళిన వ్యక్తి డాక్టర్ అయ్యుంటాడు. వాళ్ళు ఆకాశ్‌కు డాక్టర్ ట్రీట్‌మెంట్ ఇప్పిస్తున్నారు. ఇందులో ఏదో మర్మం వుంది. ఆ డాక్టర్ వెంటవెళ్ళిన మిగతా ఇద్దరూ కార్లో డాక్టర్ని వదిలి ఏ సమయంలోనైనా తిరిగిరావచ్చు. సాధ్యమైనంత త్వరగా ఆకాశ్‌ని లేపి, మాట్లాడించడం మంచిది!" అన్నాడు అమ్జద్‌ఖాన్.

జ్వర తీవ్రతతో మూలుగుతున్నాడు ఆకాశ్. మంచం మీద కూర్చుని అతని భుజంపట్టి మెల్లిగా కుదుపుతూ, "ఆకాశ్!" అన్నాను.

అతను పలకలేదు. కళ్ళు తెరవలేదు.

రెండు మూడుసార్లు ప్రయత్నించేక మూలుగుతూ మెల్లిగా కళ్ళు తెరిచేడు. నిమిషంపాటు నన్ను రెప్పవేయకుండా చూసి, మెల్లిగా తల తిప్పేడు. అమ్జద్‌ఖాన్‌మీద దృష్టిపడంగానే "మీరా!" అన్నాడు నీరసంగా.

నా మనసు కుదుటపడింది.

ఖాన్ కళ్ళు తళతళ మెరిసేయి. "ఔను మిస్టర్ ఆకాశ్! నిన్ను వెదుక్కుంటూ ఇలా వచ్చేము. వీరు మిస్టర్ రాజారెడ్డి. భారత స్పెషల్ బ్రాంచ్ తరఫునించి మీ విషయం కనుక్కోడానికి పంపించబడ్డారు" అంటూ నన్ను ఆకాశ్ కి పరిచయం జేసేడు.

"గ్లాడ్ టు మీట్ యూ మిస్టర్ ఆకాశ్! నా పేరు ఎర్రసముద్రం!" అన్నాను పెట్టుకున్న గెడ్డాన్ని కుడి చెంపనించి కొద్దిగా తీసి చూపిస్తూ.

ఎర్రసముద్రం అన్నది భారత ఏజెంట్లు ఒకర్ని ఒకరు గుర్తించుకోడానికి ఏర్పరచిన సెక్యూరిటీ వర్డ్! అంతవరకూ నీరసంతో, నిస్సత్తువతో నిర్జీవంగా వున్న ఆకాశ్ మొహంలో కోటి జ్యోతులు వెలిగినట్టు తోచింది. ఏదో చెప్పడానికి నోరు తెరిచేడు. పెదాలు కదులుతున్నాయి గాని. మాట బైటికి రావడం లేదు. కళ్ళు బరువుగా మూతలు పడుతున్నాయి.

చెప్పలేని ఆరాటంతో అతని చెయ్యి అందుకుని పల్స్ చూసేను. మొదటికంటే మరీ వీక్ గా కొట్టుకుంటోంది.

"మిస్టర్ ఆకాశ్! ఏం చెప్పదలచుకున్నారో, దయ చేసి త్వరగా చెప్పడానికి ప్రయత్నించండి!" అన్నాను భుజం తడుతూ.

అతి కష్టంమీద కళ్ళు తెరిచేడు. నన్ను ఇంకా స్త దగ్గరికి రమ్మన్నట్టు సైగ జేసేడు.

అతని మొహందగ్గిర వంగి చెవులు రిక్కించుకున్నాను.

ఆకాశ్ నోటినించి రెండే రెండు వాక్యాలు వెలు వడ్డాయి. "పీరాన్ ఘాట్... కాథలిక్ చర్చ్..."

అంతే! అతని తల పక్కకి వాలిపోయింది.

నమ్మనట్లు, విశ్వాసం రానట్లు రెప్పవెయ్యకుండా అతన్ని చూస్తుండిపోయేను. రెండు క్షణాలక్రితం, జీవం వున్న వ్యక్తి, నాతో మాట్లాడిన వ్యక్తి ఇప్పుడు లేదు. ఎక్కడికో, దేనికో ప్రయాణం కట్టేడు.

బ్రతుకు క్షణభంగురమనీ, ఎప్పుడు ఎవ్వరు ఎలా అరి షోతారో చెప్పడం దుర్లభమనీ తెలిసివుండీ, మానవుడు దేనికి సాటిమనిషిపట్ల ద్వేషం, కలుషితం పెంచుకుంటు న్నాడు? మానవుడు వీటికి అతీతుడై ఉండివుంటే యుద్ధాలు జరిగేవా? ఇన్ని మారణాయుధాలు సృష్టించ బడేవా? ఈనాడు ఆకాశ్, దేశంకాని దేశంలో ఇలా దిక్కులేని చావు చచ్చేవాడా?

అమ్జద్ ఖాన్ చెయ్యి భుజంమీద పడడంతో ఆలో చనలు చెదిరిపోయాయి. సజల నయనాలతో అతనివేపు చూసేను.

"లీవిట్ మిస్టర్ రాజారెడ్డీ! కాస్త ముందూ వెనకా, అందరం చేరే గమ్యం ఒక్కటే. ఆకాశ్ అమరుడు! అతని త్యాగం మరవలేనిది. పోయినవాళ్ళకోసం ఖేద పడుతూ కూర్చోడానికిది సమయంకాదు. ఆకాశ్ కన్ను మూస్తూ, వీరాన్ ఘాట్, కాథలిక్ చర్చ్ అన్నాడు. ఇంకా స్త వివరంగా చెప్పివుంటే మన పని సులువై వుండేది. ఫరవాలేదు. ఇందులో ఏదో మర్మం వుంది. వీరాన్ ఘాట్ నగర పొలిమేరల్లో వుంది. అక్కడే బ్రిటిష్ కాలంలో కట్టిన, ఇప్పుడు శిథిలావస్థల్లో ఉన్న ఓ చర్చ్ వుంది. ఆకాశ్, ఆ చర్చిలోనే ఎక్కడో ఏదో దాచిపెట్టి వుంటాడు. అదేమిటో వెదికి మన హస్తగతం జేసుకోవాలి. గెటప్. క్విక్!" అన్నాడు అమ్జద్ ఖాన్.

ఆకాశ్ శవంమీద తలవరకూ దుప్పటికప్పి లేచేను.

ఇద్దరం గదిలోంచి బైటపడి, మెట్లుదిగి హాల్లోకి వెళ్ళాం.

ఇంట్లో స్మశానంవంటి నిశ్శబ్దం ఆవరించి వుంది. ఆ ఇద్దరూ ఇంకా అలానే నేలమీద పడున్నారు. హాలు తలుపు ఓరగా తెరిచి, వీధిలో అటూ ఇటూ చూసేను. ఎవ్వరూ లేరు. ఇద్దరం ఇంట్లోంచి బైటపడి తలుపు బిగించి వీధిలోపడి గబగబ నడవసాగేము.

"ఈ సమయంలో వీరాన్ ఘాట్ వెళ్ళి ఆ చర్చి శిథిలాల్లో ఆకాశ్ ఏం దాచిపెట్టేడో వెతకడం అసంభవం!" అన్నాడు అమ్జద్ ఖాన్.

"ఏం?" అడిగేను నిరుత్సాహంగా.

"ఈ వేళ అక్కడ భయంకరమైన చీకటి ఉంటుంది' అన్నీ శిథిలమైన కట్టడాలు. టార్చిలైట్సుకూడా లేకుండా ఆ రాళ్ళల్లో, రప్పల్లో ఎలా వెదికేది?"

"పగలు వెళ్ళి చూస్తే?"

"నొ.నొ.పగలు ఆ ప్రదేశానికి వెళ్ళడం మరీ ప్రమాదం!"

"దేనికి?"

"పగలు ఆ ప్రదేశమంతా అలగా జనంతో గందరగోళంగా వుంటుంది. కల్లూ, సారా అనబడే చవకబారు మత్తు పానీయాలు కుండల్లో పెట్టుకుని అక్కడే అమ్ముతారు. ఉదయంనించీ రాత్రి పదిగంటలవరకూ అక్కడ థర్డ్‌క్లాస్ జనం తిరుగుతూనే వుంటారు. పగలు మీరా ప్రదేశాన్ని ఓమారు చుట్టి, అక్కడి పరిస్థితినీ, వాతావరణాన్ని స్టడీచేసి, రేపు అర్ధరాత్రి అన్ని ఏర్పాట్లతో వెళ్ళి వెతకడం ఉత్తమం!" అన్నాడు అమ్జద్ ఖాన్.

నేను పలకలేదు. తీవ్రంగా ఆలోచిస్తూ సాలోచనగా తలూపేను.

# 7

"ఇక్కడ ఆపు!" అన్నాడు అమ్జద్ ఖాన్.

డ్రైవర్ బ్రేక్ వేసేడు.

ఇద్దరం టాక్సీ దిగాం. మీటర్ బిల్ పేజేశాం. టాక్సీ వెనుదిరిగి వెళ్ళిపోయింది. ఆ ప్రదేశంలో దూరదూరంగా విసిరివేసినట్టు కట్టివున్నాయి ఇళ్ళు. అక్కడక్కడ స్ట్రీట్ లైట్స్ వెలుగుతున్నాయి. అక్కణ్ణించి వీరాన్ ఘాట్ జేరాలంటే రెండు ఫర్లాంగులు నడవాలి.

టాక్సీలో అక్కడివరకూ వెళ్ళి, చీకట్లో ఆ నిర్జన ప్రదేశంలో టాక్సీ దిగితే, డ్రైవర్‌కి అనుమానం వేస్తుంది. అందుకే, అక్కడే టాక్సీ ఆపి దిగాం.

"ఇక వెళదామా?" అడిగేడు అమ్జద్ ఖాన్.

రిస్టువాచీ చూసుకుంటూ తలూపేను. రాత్రి ఒంటి గంట!

ఓమారు చుట్టూ పరిశీలించి నడక సాగించాం. ఊర కుక్కలు తప్ప చుట్టుపక్కల మనిషిమాత్రుడు లేడు. క్రమక్రమంగా చీకట్లో కలిసిపోతున్నాం. వెనక ఇళ్ళూ, స్ట్రీట్ లైట్లూ దూరదూరమవుతున్నాయి. అది తారు రోడ్డు. చుక్కల వెలుగులో పరిసరాలు మసకమసకగా కనిపిస్తున్నాయి. చెదురు మొదురుగా గుండెల్ని జలదరింప జేసే నక్కల ఊళలు.

పావుగంటలో గమ్యం జేరుకున్నాం. అదే వీరాన్ ఘాట్.

చీకట్లో శిథిలమైన కట్టడాలు మసకమసకగా కనిపిస్తున్నాయి. కొన్ని మొండిగోడలూ, మట్టిదిబ్బలూ దాటి కాథలిక్ చర్చిని సమీపించాం. శిథిలావస్థలో వున్న చర్చి

అది. ఏ బ్రిటిష్‌కాలంలో కట్టేరో తెలీదు. మెయింటినెన్స్ లేక గోడల ప్లాస్టర్ పూర్తిగా రాలిపోయింది. గోడల నిండా నాచూ, రావిమొక్కలూ మొలిచేయి. కప్పు ఇంకా పూర్తిగా కూలిపోలేదు.

ఇద్దరం టార్చిలైట్లుతీసి వెలిగించాం!

శిథిలమైన సింహద్వారంగుండా చర్చిలో ప్రవేశించాం. ఎటుచూసినా, పెద్దపెద్ద సాలెగూళ్ళు. దుమ్మూ, ధూళీ. అక్కడక్కడా విరిగిపడ్డ రాతి స్థూపాలు.

"చాలా జాగ్రత్తగా వెతకవలసి వుంటుంది. నేనా కుడివైపునించి ప్రారంభిస్తాను.మీరీ ఎడంవైపు వెతకండి!" అన్నాడు అమ్జద్‌ఖాన్.

సిగరెట్ అంటించి తలూపేను. ఇద్దరం చర్చిని రెండు భాగాలుగా విభజించుకుని ప్రారంభించాం! నేను ఎడం వైపునించి అంగుళం వదలకుండా చాలా జాగ్రత్తగా సెర్చి ప్రారంభించేను. ఏ రాయీ, రప్పా కనిపించినా, సూక్ష్మంగా పరిశీలిస్తూ ముందుకి సాగేను. నా టార్చిలైటు నించి పడుతున్న వలయకాంతి తప్ప అంతా అంధకారం!

ఆ నిశ్శబ్దాన్ని ఛేధిస్తూ హఠాత్తుగా వెనక ఏదో చప్పుడు కావడంతో ఊపిరి బిగబట్టి చటుక్కున వెను దిరిగేను.

నక్క!

టార్చిలైటు కాంతి పడగానే భయంకరంగా ఊళ పెడుతూ ద్వారం వేపు పరుగుతీసింది. తేలిగ్గా శ్వాస విడిచేను. అప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఆ చుట్టుప్రక్కల పగ లంతా మత్తుపానీయాలూ, వేపుడు మాంసాలూ అమ్ము తారు. కిందపడ్డ ఎముకలూ అవీ ఏరుకు తినడానికి నక్కలూ తోడేళ్ళూ ఈ ప్రాంతంలో తిరుగుతుంటాయని.

ఆలోచిస్తూ తలెత్తేను. నా దృష్టి, ఎదురుగా నేలలో పాతిన ఓ మూడడుగుల రాతి స్తంభంమీద నిలిచింది. రాతితో చెక్కిన తామరపువ్వుతో సహా నున్నగా, గుండ్రంగావున్న ఆ రాతి స్తంభం నేలలో నిటారుగా పాతివుంది.

అటు నడిచేను. టార్చికాంతిలో పరీక్షగా చూసేను. తామరరేకులు అక్కడక్కడా విరిగి ఉన్నాయి. పువ్వు మధ్య కాంతి వేసి చూసేను. డొల్లగా తొలిచి వుంది. గులకరాళ్ళూ విరిగిన ఇటుక ముక్కలూ కనిస్తున్నాయి.

దేనికైనా మంచిదని ఒక్కొక్కటేతీసి కింద పడెయ్య సాగేను. రాళ్ళు తీస్తున్నకొద్దీ చెయ్యి లోనికి దూరుతూనే ఉంది. చెయ్యి భుజంవరకూ దిగేసరికి ఏదో కాగితంలాటిది తగిలినట్టు తోచింది. చెయ్యి బైటికిలాగి, టార్చి ఫోకస్ వేసి చూసేను.

పాకెట్! ఆకుపచ్చ కేన్వాస్ కాగితంలో చుట్టివున్న ప్యాకెట్!

పరవళ్ళు తొక్కుతున్న మనసుని అదుపులో పెట్టుకుంటూ చెయ్యిదూర్చి దాన్ని బైటికి తీసేను. అక్కడక్కడా కాగితం చెదలుపట్టింది. వేళ్ళతో వత్తిచూసేను. చిన్నసైజు అట్టపెట్టె. పైన నాలుగువైపులా ఎర్ర రిబ్బన్ చుట్టి వుంది.

వెనుదిరిగి, అమ్జద్ ఖాన్ కేకేసేను.

జవాబు లేదు!

టార్చి ఫోకస్, చీకట్లో నాలుగువైపులా వేస్తూ మళ్ళీ పిలిచేను.

నిశ్శబ్దం!

ఆశ్చర్యం వేసింది. అతను వెళ్ళినవైపు అడుగులు వేస్తూ "అమ్జద్ ఖాన్! ఎక్కడున్నావ్?" అన్నాను శాస్త్ర గట్టిగా.

అంతకీ జవాబులేదు! సూదిపడితే వినిపించే నిశ్శబ్దం!!

ఏమయ్యేడు? చెప్పా చెయ్యకుండా ఎక్కడికి వెళ్ళేడు? చెదురుమొదురుగా పడున్న శిథిలాలని దాటుకుంటూ చీకట్లో అతను వెళ్ళిన దిక్కు నడిచేను. ఆ వైపు గోడ మధ్య ఓ విశాలమైన కిటికీ ఉంది. ఆ కిటికీకి కాస్త ఇవతల విరిగిపడున్న ఓ స్తంభం ఉంది. బహుశా అతను ఆ కిటికీ గుండా బైటికి దూకి వెతుకుతున్నాడేమో అనుకుంటూ అటు నడిచేను.

కిందపడున్న స్తంభాన్ని దాటి కిటికీవైపు అడుగు వెయ్యబోతూ కాళ్ళకి బ్రేకులు వేసినట్టు ఆగిపోయేను. గుండె వేగం అందుకుంది. కింద నేలమీద, విరిగిపడున్న స్తంభానికి సోఫాలా వీపు ఆనించి ఎవ్వరో కూర్చున్నట్టు మసకమసకగా కనిపించింది.

చటుక్కున టార్చి ఫోకస్ అటు వేసేను.

అమ్జద్ ఖాన్!

కాళ్ళు బార్లా జాపి, చేతులు వదులుగా జారవేసి, వీపు విరిగిపడ్డ స్తంభానికి ఆనించి కూర్చునున్నాడు. సరిగ్గా గుండెలో, పిడివరకూ దిగిన కత్తి! ఆ గాయంనించి ధారగా కారి అతను వేసుకున్న తెల్లషర్టుని ఎర్రగా చిక్కగా మార్చిన రక్తం! కళ్ళు తెరిచి ఉన్నాయి. నోరు సగం తెరిచి ఉంది.

చటుక్కున వంగి అతని చెయ్యి అందుకున్నాను. నా గుండె ఝల్లుమంది!

అమ్జద్ ఖాన్ మరణించేడు!!

అది కలో, నిజమో ఎటూ పాలుపోవడం లేదు. అతన్ని ఎవ్వరు పొడిచేరు? ఎలా పొడిచేరు? చీకట్లో నిశ్శబ్దంగా, నాకు తెలీకుండా నా ఆ ప్రాణి ఎవ్వరు చంపేరు? మమ్మల్ని వెంబడిస్తూ ఎవ్వరైనా ఇక్కడికి వచ్చేరా? ఎలా?

బుర్ర గిరగిర తిరగసాగింది.

సరిగ్గా అదేసమయంలో పిస్తోలు పేలడం, సుయ్‌మనే చప్పుడుతో నా చెవిపక్కనించి ఏదో దూసుకుపోవడం లిప్తపాటులో జరిగిపోయేయి.

రెప్ప వేసి తెరిచేలోగా, మెరుపులా నేలమీదికి దొర్లి టార్చి ఆర్పేను. దొర్లుతూనే కోటు జేబులోంచి పిస్తోలు బైటికి లాగేను.

చీకటి! ఎక్కడ ఏముందో అంచనా వెయ్యలేని కటిక చీకటి!

బోర్లా పడుకుని, మోచేతులు నేలమీద ఆనించి నిశ్శబ్దంగా వెనక్కి జరగసాగేను. ఆ వ్యక్తి ఎక్కడున్నాడు? ఒక్కడా? ఇద్దరా? ఎంతమంది?

నావల్ల ఏ చిన్న శబ్దమైనా ప్రమాదం! చాలా మెల్లిగా వెనక్కి జరుగుతున్నాను. నా ఊపిరి నాకే స్పష్టంగా వినిపిస్తోంది.

దురదృష్టవశాత్తు వెనక కాళ్ళకి ఏదో రాయి తగిలి గరగర చప్పుడయింది. అంతే!

"ఢాం!" దిక్కులు పిక్కటిల్లేయి.

ఆ కటిక చీకట్లో, ఏ వేటగాడూ కాల్చలేడు. అదే జరిగింది. అతని గురి తప్పింది. కానీ, అతను ఎక్కడ నక్కి పిస్తోలు పేల్చేడో నాకు కనిపించింది. ఆ అంధకారంలో సింహద్వారం గడపకి ఆనుక్కుని, నిప్పురవ్వ మెరిసింది.

ఊపిరి బిగబట్టి, మెల్లిగా అంతకిముందు కాలికి తగిలిన రాయి అందుకున్నాను. చెయ్యి ఎత్తి రాయిని ఓ మూలకి విసిరేను.

"ధాం! ధాం!" రెండు గుళ్ళు అటు దూసుకు పోయేయి.

ఆ అవకాశాన్ని జారవదలకుండా, మెరుపులా నేల మీంచి లేచి అంతక్రితం చూసిన కిటికీవేపు గెంతేను. కన్నుమూసి తెర్చేలోగా ఎగిరి అవతలకి దూకేను. కాళ్ళకి నల్లని కేన్వాస్ బూట్సు వుండటంవల్ల అట్టే శబ్దం కాలేదు. క్షణం అలాగే కూర్చుని చెవులు రిక్కించుకున్నాను.

నిశ్శబ్దం!

అతనికి, నేను వేసిన ఎత్తు తోచలేదు కాబోలు. లోపలినించి ఎటువంటి అలికిడీ అవలేదు. నేనింకా లోపలే వున్నాననుకుంటున్నాడు కాబోలు.

నేలమీంచి లేచి, డొంకల్లోపడి రోడ్డువేపు దౌడు తీసేను. పరిగెత్తుతూ కోటు లోపలి జేబులో పెట్టుకున్న ఆ పాకెట్‌ని తడిమి చూసేను. ఉంది. నా ప్రాణాలని పణంగా పెట్టి దాన్ని దక్కించుకోవాలి. సురక్షితంగా ఢిల్లీ తీసికెళ్ళి అధికారులకి అప్పగించాలి. నా ధ్యేయం, లక్ష్యం అదే!

రోడ్డుమీదికి చేరుకుని వెనుదిరిగి చూసేను. ఎవ్వరూ వస్తున్న అలికిడిలేదు. మసక చీకట్లో దూరాన శిథిలమైన ఆ చర్చి ప్రేతంలా కనిపిస్తోంది. రిలాక్సింగ్ స్టెప్స్ వేస్తూ నగరంవేపు పరిగెత్తసాగేను. కొద్దిదూరంలో రోడ్డుకి కుడి పక్క ఏదో కారు ఆగివుండటం మసకమసకగా కనిపించ డంతో తక్కున ఆగిపోయేను.

నా అనుమతి లేకుండానే నా చెయ్యి పాంటు జేబు లోకి వెళ్ళి, పిస్తోలు బైటికి తీసింది. ఆ కారువేపే చూస్తూ కుడిపక్క రోడ్డు దిగేను. కుడిపక్క రోడ్డు కిరువైపులా పిచ్చిమొక్కలూ, పొదలూ మొలిచి వున్నాయి. పిస్తోలు రెడీగా పట్టుకుని సవ్వడికానిఅడుగులతో కారు వున్న వేపు నడిచేను. అది నా జాగ్రత్త. కారు ఖాళీగా ఉందో, దాంట్లో ఎవరైనా వున్నారో తెలీదు. చర్చిలో అమ్జద్ ఖాన్ను చంపిన వ్యక్తి బహుశా ఈ కారులోనే వచ్చి ఉంటాడు.

ఆలోచిస్తూ కారుని సమీపించి, రోడ్డు ఎక్కి పిల్లిలా కారు వెనక్కి వెళ్ళేను. కదలకుండా నిల్చుని చెవులు రిక్కించేను. కార్లోంచి ఎటువంటి అలికిడీ లేదు.

ట్రిగ్గర్ మీద వేలువుంచి, టార్చిలైటు తీసేను. రెప్ప మూసి తెరిచినట్టు టార్చి వెలిగించి ఆర్పేను. ఆ ఒక్క క్షణం వెలుగులో కారు ఖాళీగా వున్నట్టు తెలిసిపోయింది.

థాంక్ గాడ్! తేలిగ్గా ఊపిరి తీసుకుని డ్రైవింగ్ సీటు వేపు అడుగు వేసేను. డోర్ తెరిచి, వేళ్ళతో ఇగ్నిషియన్ కీ ఉండే చోట తడిమేను. లేదు! క్షణం వృధా చెయ్యకుండా డ్రైవింగ్ సీట్లో కూర్చుని, బేటరీ కనెక్షన్, ఇచ్చి, సెల్ఫ్ స్టార్టర్ కనెక్షన్ వైర్లని తెంపి, రెంటినీ కలిపి డైరెక్ట్ కనెక్షన్ ఇచ్చి, సెల్ఫ్ స్టార్టర్ లాగేను.

ఇంజన్ స్టార్టయింది. హెడ్లైట్స్ వెలిగించకుండా కారు వెనక్కి తిప్పేను.

సరిగ్గా ఆ దే క్షణంలో చర్చి వేపునించి ఎవ్వరో పరిగెత్తుకు వస్తున్నట్టు బూట్సుల శబ్దం పెద్దగా వినిపించసాగింది. క్లచ్ వదులుతూ ఏక్సిలేటర్ నొక్కేను. కారు ముందుకు

దూసుకుపోసాగింది. ఓ చేత్తో స్టీరింగ్ కంట్రోల్ జేస్తూ, మరో చేత్తో బటన్ లాగి హెడ్ లైట్స్ వెలిగించేను.

"ఢాం! ఢాం! ఢాం!" వెనకనించి పిస్తోలు పేలుస్తున్న శబ్దం.

అప్పటికే కారు పిస్టల్ రేంజ్ కు అందని దూరం చేరుకుంది.

# 8

వీధి మొదట్లో, చీకట్లో ఓ టెలిఫోన్ పోల్ కింద కారాపి దిగేను.

వీధిలో మనిషిమాత్రుడు లేడు. వాతావరణం చలిగా ఉంది. చేతులు పాంటు జేబుల్లో పెట్టుకుని అమ్జద్ ఖాన్ మాకోసం ఏర్పాటుజేసిన ఇంటివేపు వడివడిగా నడవసాగేను. ఇక ఆ ఇంటితో మాకు పనిలేదు. చిట్టగాంగ్ నించి డేవిడ్ రాగానే సాధ్యమైనంత త్వరగా ఈ దేశం విడిచి, భారత సరిహద్దు జేరుకోవాలి. సజీవంగా జేరుకుంటామో, లేదో తెలీదు. ఏదిఏమైనా చేజిక్కిన ఆ పాకెట్ ని వదులుకోకూడదు.

ఆలోచిస్తూ ఇంటిని సమీపించేను. కాంపౌండ్ గేట్ మూసి వుంది. కొక్కెంతీసి తోసేను. కిర్రుమంటూ తెరుచుకుంది. కాంపౌండ్ లో ప్రవేశించేను. సింహద్వారానికి వేళాడుతున్న తాళంతీసి తలుపు తెరిచేను. హాల్లో చీకటి! లోనికెళ్ళి టార్చి వెలిగించేను ఫోకస్ గోడమీద వేసి. లైటు వెలిగింది. తలుపుమూసి, మేడ మెట్లవేపు నడిచేను.

నా దృష్టి అప్పుడు పడింది, హాలుమధ్య షో కోసం టీపాయ్ మీద వుంచిన ఇత్తడి పూలకుండీమీద! దాని నిండా రంగురంగుల ప్లాస్టిక్ పూలు అమర్చి వున్నాయి.

అటు నడిచేను. కోటు లోపల జేబులో భద్రంగా వున్న ఆ పాకెట్ తీసి పూలకుండీలో పడేసి, అది కనిపించకుండా పైన పూలు సర్దేను.

ఎప్పుడే సంఘటన జరుగుతుందో ఊహించడం కష్టం! విలువైన వస్తువులు ఇటువంటి సామాన్యమైన స్థానంలో దాచిపెడితే ఇతర్లు అంత సులువుగా కనుక్కోడం కష్టం. ఇలాటి వస్తువులమీద సాధారణంగా ఎవ్వరి దృష్టి పోదు.

ఇంట్లో చీమ చిటుక్కుమన్నా వినిపించే నిశ్శబ్దం ఆవరించి వుంది. అమ్జద్ ఖాన్ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా గుండెని ఎవ్వరో పిండుతున్నట్టు దుఃఖం ముంచుకువస్తోంది. ఆ తండ్రీ కూతుళ్ళు మాకోసం జేసిన త్యాగం మరవలేనిది. మనసులోనే వారికి జోహార్లు అర్పిస్తూ మేడమెట్లవైపు నడిచేను.

కొన్ని ఇళ్ళు పగలు బాగానేవున్నా, చీకటిపడ్డాక బిక్కుబిక్కుమంటున్నాయి. ఒంటరిగా ఉన్నప్పుడు ఆ ఇంట్లో గోడలు కరవడానికి మీదికి వస్తున్నట్టే తోస్తుంది. ఈ ఇల్లూ అదే కోవకి చెందుతుంది. నేను గనక సరిపోయింది. వేరొకరైతే ఈ భయంకర నిశ్శబ్దాన్ని తట్టుకోలేక బైటికి పరుగు లంకించేవారే.

ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ మేడమీదికి జేరుకున్నాను. పైన మూడు గదులున్నాయి. తలుపులు మూసివున్నాయి. మధ్య గదిని పడుకోడానికి ఏర్పాటుజేసివుంచేము. తలుపుముందు ఆగి, గడియలాగి మెల్లిగా తోసేను. చిన్న శబ్దంజేస్తూ తెరుచుకుంది. లోన అడుగుపెట్టేను.

చీకటి! చిమ్మ చీకటి!! తలుపు పక్కనే లైటు స్విచ్ వున్నట్టు జ్ఞాపకం. వేళ్ళతో తడిమి స్విచ్ వత్తేను.

"వెల్‌కమ్ మిస్టర్ రాజారెడ్డీ!" అన్న కంఠం విని ఉలిక్కిపడ్డాను.

గదిమధ్య సోఫాలో కూర్చుని నవ్వుతున్న వ్యక్తిని చూడగానే నిర్ఘాంతబోయేను.

అతను మునీర్! ఫరీదా అన్న మునీర్!!

చేతిలోని పిస్తోలు వేళ్ళమధ్య గిరగిర తిప్పుతూ నవ్వుతున్నాడు.

అతని వెనక, చేతిలో రివాల్వర్ పట్టుకుని నిన్నరాత్రి ఆకాశ్‌ని బంధించి వుంచిన ఇంట్లో మేము మూర్ఛపోగొట్టిన స్ఫోటకం మచ్చలుగల వ్యక్తి నిల్చునున్నాడు.

అర్థమైంది. మునీర్ ఈ దేశపు గూఢచారి విభాగానికి చెందిన వ్యక్తి అని స్పష్టంగా తెలిసిపోయింది. భయపడీ, ధైర్యాన్ని జారవిడుచుకునీ లాభంలేదు. అతనిలాగే నేనూ చిన్నగా నవ్వి, "హలో మిస్టర్ మునీర్! హౌవ్ ఆర్ యూ?" అన్నాను సోఫావేపు నడుస్తూ.

"కదలక! అడుగు ముందుకు వేసినా, ఏ చిన్న పొరపాటు జేసినా మా ఇద్దరి పిస్టల్స్‌లో మొత్తం పన్నెండు గుళ్ళున్నాయి. అవి నీ శరీరాన్ని జల్లెడజేస్తాయి జాగ్రత్త!" అంటూ సోఫాలోంచి లేచేడు.

తలూపి, "తెలుసు!" అన్నాను కాళ్ళకి బ్రేకువేస్తూ.

"వెరీగుడ్! చెప్పినట్టు వినేవాళ్ళంటే నాకు చాలా ఇష్టం. అలా కూర్చో!" అన్నాడు మునీర్ సోఫావేపు సైగజేసి.

సోఫాలో కూర్చుంటూ, "నీ చెల్లెలు ఫరీదా ఎలా ఉంది?" అడిగేను పరామర్శిస్తున్నట్టు.

మునీర్ నవ్వేడు. విరగబడి నవ్వేడు. "మిస్టర్ రాజా రెడ్డీ! నీవు ఫూల్ వి. నెంబర్ వన్ ఫూల్ వి. ఢాకాలో అడుగుపెట్టినప్పటినుంచీ, ఇప్పటివరకూ నీవు ఎలా పప్పీ కొడుతున్నావో వివరంగా చెబుతా విను!

ఢాకా జేరగానే నీవుజేసిన మొదటి తప్పు, ముస్తఫా గ్లాస్ ఎంపోరియంకు వెళ్ళి ఆకాశ్ గురించి వాకబ్ జెయ్యడం! ముస్తఫా ఎవ్వరోకాదు. మాకు సన్నిహితుడు. నీవు అతన్ని కలుసుకుని, బైటికెళ్ళగానే, అతను మా హెడ్ క్వార్టర్స్ కి ఫోన్ జేసి నీ గురించి చెప్పేడు.

అక్కడినించీ నీ వెనక నీడలా వేట ప్రారంభమయింది. మా దేశపు మిలిటరీ ప్రాముఖ్యంగల కొన్ని రహస్య పత్రాలు చేజిక్కించుకుని అదృశ్యమైన ఆకాశ్ కోసం దేశమంతా వలపన్ని వుంచేను. ఐనా, అతను మాకు చిక్క లేదు. అతనిగురించి వాకబ్ జేస్తూ నీవు రావడంతో మా ధ్యాస నీ మీదికి మళ్ళింది.

నిన్ను నీడలా ఓ కంట కనిపెట్టడానికి లియాఖత్ అనే మా ఏజెంట్ ను నియమించాం. నీవు టాక్సీలో తార్ పోర్ గలీ కెళ్ళి అక్కడ ఎవ్వరికోసమో ఎదురుచూస్తూ తారట్లాడటం, ముస్తఫా గ్లాస్ ఎంపోరియంలో పనిజేసే జరీనాతాజ్ వచ్చి ఆ సందులో నిన్ను కలుసుకోడంతో లియాఖత్ కి ఆమెమీద అనుమానం వేసింది.

తార్ పోర్ గలీలో మీ రిద్దరూ కలుసుకుని మాట్లాడు కుంటున్న సమయంలో లియాఖత్ నీమీద దాడి జరిపి మూర్ఛపోగొట్టేడు. ఆ అదును చూసుకుని జరీనాతాజ్ పారిపోయింది. లియాఖత్ ఆమెని నీడలా వెంబడించేడు. జరీనా సరాసరి ఆకాశ్ రహస్యంగా నివసిస్తున్న ఇంట్లో ప్రవేశించింది. లియాఖత్ తన చాకచక్యంతో ఆ ఇంట్లో

ప్రవేశించి, జరీనాతాజ్‌ను చంపి, జ్వరంతో శక్తిహీనంగా పడున్న ఆకాశ్‌ని మా నివాస స్థావరానికి చేర్చాడు.

నీతో పరిచయం చేసుకుని, నీకు మరింత దగ్గరగా వుండి నీ కార్యకలాపాలు గమనించాలని, మా ఏజెంట్ ఫరీదాను వెంటబెట్టుకుని అన్నా చెల్లెళ్ళుగా తార్‌పోర్ గలీలో నీతో పరిచయం చేసుకున్నాను.

మా స్థావరం మీకెలా తెలిసిందో నాకు తెలీదు. నిన్న రాత్రి నీవూ, అమ్జద్‌ఖాన్ మా స్థావరంలో ప్రవేశించి ఆకాశ్‌ని కాపలా కాస్తున్న మా ఇద్దరు మనుషుల్ని మూర్ఛపోగొట్టేరు. ఆ సమయంలో నేనూ, నా సహచరుడు లియాఖత్ డాక్టర్ని అతని ఇంట్లో వదిలి రావడాని కెళ్ళాము.

అదృష్టవశాత్తూ, డాక్టర్ని వదిలి మేము తిరిగివస్తుండగా, నీవూ, అమ్జద్‌ఖాన్ మా స్థావరంలోంచి బయటికి రావడం కనిపించింది. మిమ్మల్ని వెంబడించమని లియాఖత్‌ను పంపి, నేను ఇంట్లోకి వెళ్ళిచూస్తే మా ఇద్దరు మనుషులు మూర్ఛపోయి ఉండటం, ఆకాశ్ మరణించి వుండటం కనిపించింది. ఆకాశ్ తన రహస్యం బయటపెట్టకుండా అతన్ని మీరే చంపారో, లేక సహజంగానే మరణించేడో నాకు తెలీదు. ఏదిఏమైనా, ఆకాశ్ మాత్రం ఆ రహస్య పత్రాలు ఎక్కడ దాచిపెట్టాడో మీకు చెప్పి ఉంటాడని నా కనుమానం వేసింది.

ఇంతలో లియాఖత్ తిరిగివచ్చి, మీరిద్దరూ ఈ ఇంట్లోకి ప్రవేశించి తలుపు మూసుకున్నారని చెప్పేడు. ఈ ఇంటి మీద ఓ కన్నువేసి ఉంచమని అతన్ని మళ్ళీ పంపించేను. మా ప్రయాస ఫలించింది. ఈ రోజు రాత్రి పది గంటలకు

నీవూ, అమ్జద్ ఖాన్ ఈ యింట్లోంచి బయటికి వచ్చి టాక్సీ ఎక్కి బయలుదేరినట్టూ, ఫియట్ కార్లో తనూ మిమ్మల్ని వెంబడిస్తున్నట్టూ, మీ రిద్దరూ పీరాన్ ఘాట్ కి కొద్ది దూరంలో టాక్సీ దిగి చీకట్లో కాలినడకన పీరాన్ ఘాట్ వేపు బయలుదేరినట్టూ లియాఖత్ వైర్లెస్ మెసేజ్ పంపేడు.

దాంతో ఆకాశ్ ఆ పీరాన్ ఘాట్ శిధిలాల్లోనే ఆ రహస్యపత్రాలు దాచిపెట్టి వుంటాడని నా కనుమానం వేసింది. మిమ్మల్ని వదలకుండా వెంబడించమనీ, వీలు చిక్కితే అమ్జద్ ఖాన్ ని చంపివెయ్యమనీ లియాఖత్ కు ఆదేశం జారీచేసి, ఇతన్ని వెంటబెట్టుకుని, నీకు స్వాగతం చెప్పడానికి ఈ ఇంటికి వచ్చేను.

వెంటిలేటర్ గుండా ఇద్దరం ఇంట్లో దూరి, ఈ రూంలో తిష్ట వేశాం. పీరాన్ ఘాట్ శిధిలాల్లోంచి తెచ్చిన ఆ పత్రాలు నీవు ఎక్కడ దాచేవో నాకు తెలుసు!'' అన్నాడు మునీర్ చిన్నగా నవ్వుతూ.

గుండె గుభిల్లుమంది! నా ఆరాటాన్ని కంఠంలోంచి తొణకనివ్వకుండా, ''ఎక్కడ దాచేను?'' అడిగాను.

''చూపిస్తాను పద!'' అన్నాడు మునీర్ నన్ను లేవమన్నట్టు పిస్తోలు కిందికీ మీదికీ ఊపుతూ.

సరిగ్గా అదే క్షణంలో కింద హాల్లోంచి ఎవ్వరో మెట్లెక్కుతూ పైకి వస్తున్న బూట్సుల టకటక శబ్దం వినిపించింది.

మునీర్ సహచరుడు మెరుపులా బైటికి ఉరికేడు. మిగతా ఇద్దరం ఊపిరి బిగపట్టి తలుపు వేపు చూడసాగాం. కాసేపటికి అతను తిరిగివచ్చి, ''లియాఖత్!'' అన్నాడు.

అప్పటికే లియాఖత్ చెమటలు కక్కుతూ గదిలో

అడుగు పెట్టేడు. అతని దృష్టి నామీద పడగానే వాడి వున్న మొహం వికసించింది.

"అమ్జద్ ఖాన్ ఏమయ్యేడు?" అడిగేడు మునీర్.

లియాఖత్ నవ్వి, "యమలోకం జేరుకున్నాడు. ఈ బాస్టర్డ్ నా కళ్ళల్లో దుమ్ముకొట్టి, చర్చిలోంచి జారుకుని కారెక్కి పారిపోయి వచ్చేడు. అదృష్టవశాత్తూ నాకు ఓ లారీ దొరికింది గనక సరిపోయింది. ఇంతకీ వీడి దగ్గర్నించి ఆ పాకెట్ సంపాదించేరా, లేదా?" అడిగేడు.

"ఇప్పుడే సంపాదిస్తాను!" అంటూ నావేపు తిరిగి, "లే!" అన్నాడు మునీర్.

చెప్పలేని క్యూరియాసిటీతో సోఫాలోంచి లేచేను. తలుపువేపు నడవమన్నట్టు పిస్తోలుతో సైగ చేసేడు మునీర్. బుద్ధిగా తలుపువేపు నడిచేను. నా వెనకే ముగ్గురూ బైటికి వచ్చేరు. ఒక్కొక్క మెట్టే దిగుతూ హాల్లో అడుగు పెట్టేను.

మునీర్ వడివడిగా, హాలుమధ్య టీపాయ్‌మీదున్న పూలకుండీవేపు నడవసాగేడు. నా గుండెవేగం అందు కుంది. ఒంట్లో సన్నసన్నగా చమట పేరుకోసాగింది. రెప్పవెయ్యకుండా ఆటే చూడసాగేను.

పూలకుండీలోని ప్లాస్టిక్ పూలన్నీ కిందపడేసి కుండీలో చెయ్యిపెట్టేడు మునీర్. అతని కనుబొమలు ముడివడ్డాయి. చటుక్కున కుండీ ఎత్తి బోర్లించేడు.

పూలకుండీ ఖాళీ!

ఆశ్చర్యంతో, దిగ్భ్రాంతితో నా కళ్ళు పెద్దవయ్యేయి. స్వయంగా నా చేతులతో కుండీలో వేసిన ఆ పాకెట్ ఏమయింది? ఎవరు తీసేరు? నేను దాంట్లో పాకెట్ దాచి నట్టు మునీర్ కెలా తెలిసింది?

చేతిలోని కుండీ టీపాయ్‌మీద పడేసి, చటుక్కున నావేపు తిరిగేడు మునీర్.

"ఏం జరిగింది బాస్?" అడిగేడు లియాఖత్ అర్థం కానట్టు.

"వీడు ఇంట్లోకి రాగానే ఈ పూలకుండీవేపు వచ్చి, జేబులోంచి ఆ పాకెట్ తీసి దీంట్లో పడెయ్యడం, పైన గదిలో ఉండి తలుపు కన్నంలోంచి నా కళ్ళారా చూసేను. ఇంతలోకే ఎలా మాయమయింది?" అన్నాడు మునీర్ విస్మయంతో.

"వీడు నక్క! జిత్తులమారి నక్క!! పాకెట్ కుండీలో వేసినట్టువేసి నిర్ణయం మార్చుకుని మళ్ళీ జేబులో వేసుకు నుంటాడు! జేబులు వెతకండి" అన్నాడు లియాఖత్.

స్ఫోటకం మచ్చల వ్యక్తి నన్ను సమీపించేడు.

వాళ్ళు ట్రేన్డ్ గూఢచారులు, తెగించి ఆ ముగ్గుర్నీ లొంగదీయడం సామాన్య విషయంకాదు. అందుకే, కిమ్మన కుండా నిల్చున్నాను.

అతను నా ఒళ్ళంతా తడిమి, "నథింగ్!" అన్నాడు.

నా వేపు అడుగులు వేస్తూ అన్నాడు మునీర్—"మిస్టర్ రాజారెడ్డీ! అనుభవం ఉన్న గూఢచారులు తమ ప్రత్యర్థి నోటి నించి రహస్యాలు ఎలా వెళ్ళగక్కిస్తారో గూఢ చారివి గనక నీకు బాగా తెలుసు. మేము వాడే పద్ధతులు చాలా క్రూరమైనవి. హీనమైనవి. ఆ దుర్భరమైన బాధ భరించడం నీవల్ల కాదు. ఆ పరిస్థితి రాకముందే చెప్పేయ్, ఆ పాకెట్ ఎక్కడ దాచావ్?"

"ఇంట్లోకి రాగానే దాన్ని ఆ పూలకుండీలలోనే వేసేను..." అంటూ సడన్‌గా ఏదో జ్ఞాపకం వచ్చి ఆగేను.

పూలకుండీలోంచి ఆ పాకెట్ దానంతటది మాయం కావడం అసంభవం! దాన్ని కుండీలో దాచి నేను పైకి వెళ్ళేక, లియాఖత్ ఇంట్లోకి వచ్చేడు. కొంపదీసి వాడే దాన్ని కాజెయ్య లేదు కదా!

ఈ ఆలోచన రాగానే లియాఖత్ ని చూపిస్తూ—"నేను ఇంట్లోకి వచ్చి, పూలకుండీలో ఆ పాకెట్ దాచి పైకెళ్ళాక, ఇతనే ఇంట్లోకి వచ్చేడు. నాకు పూర్తి నమ్మకం ఉంది. ఇతనే పాకెట్ తీసి ఉంటాడు!" అన్నాను ఖచ్చితంగా.

లియాఖత్ మొహం కోపంతో జేవురించింది.

"రాస్కెల్! మా మధ్య పేచీలు తెచ్చి, మా కోపరేషన్ని భగ్నం జెయ్యడానికి ప్రయత్నిస్తావా?" పళ్ళు పటపట కొరుకుతూ నా వైపు అడుగు వేసేడు లియాఖత్.

"ఢాం! ఢాం! ఢాం!" మూడు ప్రేలుళ్ళతో హాలు మారు మోగింది.

దానితో బాటు ఆ ముగ్గురి కేకలూ గాలిలో గింగురుమన్నాయి. వాళ్ళ చేతుల్లో ఉన్న రివాల్వర్స్ రెక్కలు తెగిన పక్షుల్లా కిందపడ్డాయి. ముగ్గురు అరచేతులు పట్టుకుని మూలగసాగేరు.

ఊహించని ఆ హఠాత్సంఘటనతో నోరు తెరచి, ఆ శబ్దం వచ్చిన వైపు చూసేను. ఓ గోడవారగా నిలబెట్టి ఉన్న గోడ్రెజ్ బీరువాలోంచి బైటికి వస్తున్న సార్జంట్ డేవిడ్ కనిపించే సరికి అది కలో నిజమో అన్న మీమాంసతో రెప్ప వెయ్యకుండా అలాగే చూస్తుండిపోయేను.

సరిగ్గా అదే క్షణంలో మునీర్ ఎడం చేత్తో కింద పడున్న పిస్తోలు అందుకోవడానికి వంగడంతో నాలో చలనం వచ్చింది. మెరుపులా అటు ఉరికి బూటుకాలితో

ఊడ్చి అతని డొక్కలో తన్నేను. నెప్పికి మెలికలు తిరుగుతూ కింద కూలేడు. కింద పడ్డ మూడు పిస్టల్స్ అందుకుని, మునీర్ వెనక కాలర్ పట్టి లేపి, హాలు పక్క గది వేపు నడవమన్నట్టు మోకాలితో కుమ్మేను.

డేవిడ్ మిగతా ఇద్దర్ని తన పిస్తోలుతో కవర్ జేస్తూ ఆ గది వేపు తీసుకు వచ్చేడు. ముగ్గుర్నీ లోనికి తోసి గదిలో అడుగు పెట్టేను. గదిలో ఒకే ఒక కిటికీ ఉంది. వెంటిలేటర్స్ లేవు. కిటికీ ఫ్రేం కడ్డంగా లావుపాటి ఇనప కడ్డీలు బిగించి ఉన్నాయి. ఆ గదిలోంచి వాళ్ళెంత త్వరగా తప్పించుకునే అవకాశం లేదన్న నమ్మకం కుదిరేక బైటికి వచ్చి తలుపు మూసి ఇవతల గడియ లాగేను.

"డేవిడ్! ఎప్పుడో ఏ జన్మలోనో నీవు నాకు ఋణపడి ఉంటావు. ఆ ఋణాన్ని ఈ విధంగా ఈ జన్మలో తీర్చుకుంటున్నావు. ఇప్పుడే కాదు, ఇంతకి ముందు అనేక సార్లు మృత్యువుకీ నాకూ వెంట్రుకవాసి దూరం ఉండగా నన్ను ఆదుకున్నావు. నిన్ను అభినందించడానికి మాటలు రావడం లేదు. ఇంతకీ ఊహించని విధంగా ఇక్కడెలా ప్రత్యక్షమయ్యావ్?" అడిగేను అతని భుజం తడుతూ.

"ఇది కేవలం కాకతాళీయమే అనుకోవాలి! నేను చిట్టగాంగ్ వెళ్ళి మీరు చెప్పిన చిరునామామీద వాకబ్ జేశాను. అంతా అబద్ధం అని తేలింది. మనల్ని తప్పుదారి పట్టించాలనీ, మనం ఈ సిటీ వదిలి వెళ్ళిపోవాలనీ ఫరీదా ఆ దొంగ చిరునామా చెప్పి వుంటుంది.

ఈ ఆలోచన రాగానే, తక్షణం ప్లేన్ ఎక్కి కొన్ని గంటలక్రితం ఢాకాలో దిగేను. ఏర్‌పోర్ట్‌నించి టాక్సీలో ఈ వీధి చేరేసరికి, సరిగ్గా అదేసమయంలో గేటు తోసుకుంటూ మునీర్, అతని సహచరుడూ ఈ ఇంటి కాంపౌండ్‌లో

ప్రవేశిస్తూ కనిపించేరు. టాక్సీని దూరంగా ఆపించి, డ్రైవర్ని పంపి వాళ్ళ దృష్టిలో పడకుండా కాంపౌండ్ గోడ చాటున నక్కి చూడసాగేను.

వాళ్ళిద్దరూ చీకట్లో మేడ వెనక భాగంవేపు వెళ్ళేరు. నేనూ గోడదూకి, పిల్లిలా వాళ్ళని ఫాలో జేసేను. ఇద్దరూ వాటర్ పైప్ గుండా డాబామీదికి ఎక్కేరు. తరవాత పైనించి వెంటలేటర్ అద్దాలు పగిలిన శబ్దం వినిపించింది.

అరగంట వేచివుండి, నేనూ వాటర్ పైప్ ద్వారా పైకి వెళ్ళేను. ఇంట్లోకి తొంగిచూసేను. వాళ్ళిద్దరూ హాల్లోని మెట్లగుండా పైకివెళ్ళి ఓ గదిలో ప్రవేశించి తలుపు మూసుకోడం కనిపించింది.

ఆ వెంటిలేటర్ కింద గోడకి ఆనించి ఓ గోడ్రెజ్ బీరువా వుంది. వెంటిలేటర్లోంచి దూరి ఆ బీరువామీద నిల్చోవచ్చు. పావుగంట తరవాత ఏ చిన్న శబ్దం కానివ్వకుండా వెంటిలేటర్లోంచి దూరి, బీరువామీద కాలుపెట్టేను. తరవాత బీరువామీదినించి జారి హాల్లోకి జేరుకున్నాను.

మీరు ఇంట్లో లేరనీ, ఏదో జరగబోతుందనీ నాకు తెలును. సమయం వచ్చేవరకూ తొందరపడకూడదని, బీరువా తెరిచి నిల్చుని చూడసాగేను. కాసేపటికి బైటి నించి ఎవ్వరో హాలు తలుపు తాళం తెరుస్తున్న చప్పుడు వినిపించింది. బీరువా తలుపు కొద్దిగా తెరిచి చూడసాగేను. మీరు లోనికి వచ్చేరు. హాలుమధ్య వున్న పూలకుండీలో ఏదో పాకెట్ వేసి పైకి వెళ్ళేరు. కాసేపటికి మునీర్ మాటలూ, మీ మాటలూ వినిపించసాగేయి.

క్షణం వృథాజెయ్యకుండా బీరువాలోంచి బైటపడి, పూలకుండీలో మీరు దాచిన ఆ పాకెట్ తీసి జేబులో

వేసుకుని తిరిగి బీరువాలో దూరేను. కాసేపయ్యాక, వెంటి లేటర్ గుండా ఎవ్వరో బీరువా పైభాగాన దిగినట్టు బూట్సుల శబ్దం వినిపించింది. ఊపిరి బిగబట్టి వినసాగేను. అతను బీరువామీంచి కిందికి దూకేడు. తరువాత మెల్లెక్కుతున్న శబ్దం విని, బీరువా తలుపు కొద్దిగా తెరిచి చూసేను. అతను లియాఖత్!

తరవాత మీరందరూ పైనించి హాల్లోకి రావడంతో నా పిస్తోలుకి పని తగిలింది!'' అన్నాడు డేవిడ్ జేబులోంచి మా ప్రాణాలకంటే విలువైన ఆ పాకెట్ తీస్తూ.

ఆనందంతో, ఆశ్చర్యంతో నా మనసు ఉరకలు వేసింది. ''డియర్ డేవిడ్! నీవుజేసిన పనికి నిజంగా నిన్ను పద్మశ్రీ బిరుదుతో సత్కరించి కృతజ్ఞత తెలుపుకోవాలి!'' అన్నాను పాకెట్ అందుకుంటూ.

''అంతా కాకతాళీయం! అంతే. నా కర్తవ్యం నేను నెరవేర్చేను!'' అన్నాడు డేవిడ్.

''థాంక్యూ వెరీమచ్! మనదగ్గిర వ్యవధి చాలా తక్కువ వుంది. మన విధిలో దాదాపు సక్సెస్ అయ్యాం. ఇహా ఈ పాకెట్‌ని సురక్షితంగా సరిహద్దువరకూ చేరవెయ్యాడమే మిగిలింది. మనిద్దర్లో ఏ ఒక్కరం బ్రతికి బైటపడి సరిహద్దు దాటినా, ఈ మిషన్ గ్రాండ్ సక్సెస్ అయినట్టే. పద. క్విక్!'' అన్నాను మేడ మెట్లవైపు నడుస్తూ.

ఇద్దరం మేడమీద సామాన్లు వున్న గదిలోకి వెళ్ళి, సూట్‌కేస్‌లు తెరిచాం. వాటిలోంచి సైనికులు యుద్ధాల్లో అత్యవసర సామాన్లు వేసుకుని వీపుకి తగిలించుకునే రెండు ఎబర్ సెర్స్ తీసేను. డ్రై టిఫిన్ పాకెట్స్, బ్రెడ్, జామ్ టిన్స్, బులెట్స్, మొదలైన అత్యవసర సామాన్లు వాటిలో

పక్కా బక్కుల్స్ బిగించేను. మా ప్రయాణానికి ఎంతో ముఖ్యమైన మ్యాప్ తీసి జేబులో వేసుకున్నాను.

"డేవిడ్! ఇక్కణ్ణించి మనం తిన్నగా పాల్క్ నది జేరాలి. మన ప్రయాణం అక్కణ్ణించి ప్రారంభమవుతుంది. భారత సరిహద్దులు జేరడానికి బహుశా రెండు రోజులు పట్టవచ్చు!" అన్నాను. అతనికో ఏబర్ సెక్స్ ఇస్తూ.

ఇద్దరం గబగబ కిందికి వెళ్ళి, హాల్లోంచి బైటపడ్డాం! హాలు తలుపుమూసి ఇవతల తాళం బిగించి వడివడిగా నడక సాగించేము.

## 9

అదే పాల్క్ నది.

ధారా దక్షిణ దిశనించి ఉత్తర దిశవైపు అతిమెల్లగా ప్రవహించే విశాలమైన నది అది.

నది ఒడ్డున అక్కడక్కడా లంగర్లువేసి తేలుతున్న చిన్నా పెద్దా పడవలూ, మోటర్ బోట్లూ మసక చీకట్లో లీలగా కనిపిస్తున్నాయి.

"డేవిడ్! ఎలాగైనా మంచి మోటార్ బోట్ ఒకటి చేజిక్కించుకోవాలి. తెలతెలవారేలోగా మనం, ఇక్కణ్ణించి అరవై కిలోమీటర్ల దూరంవున్న బ్రాహ్మణవారియా గ్రామతీరం జేరాలి. అక్కడికెళ్ళాక చెబుతాను తరవాతి ప్రోగ్రాం!" అన్నాను ఒడ్డుని సమీపిస్తూ.

ఓ మోటర్ బోట్ నన్నాకర్షించింది. డేవిడ్ భుజం తట్టి దాన్ని చూపించేను.

"డ్రైవర్ కేబిన్ లో పడుకునుంటాడు!" అన్నాడు డేవిడ్.

"కిమ్మనకుండా వాణ్ణి లాంగదీసుకోవాలి!" అన్నాను శబ్దంకాని అడుగులతో బోట్ వేపు నడుస్తూ.

రాడ్స్ పట్టుకుని బోట్ డెక్ మీద ఎక్కేము. మా బరువుకి బేలెన్స్ తప్పి బోట్ అటూ ఇటూ ఊగింది. నా గుండె దడదడ కొట్టుకోసాగింది. ఖర్మకాలి డ్రైవర్ నిద్ర చెదిరితే, మమ్మల్ని చూస్తే కేకలు పెట్టవచ్చు. మిగతా బోట్సుల్లో, నావల్లో పడుకున్న నావికులు లేవవచ్చు. అందరూ చుట్టిముట్టి మమ్మల్ని పట్టుకోవచ్చు.

రెండు నిమిషాలు కదలకుండా నిల్చున్నాం. బోట్ ఊగడం ఆపి మామూలు స్థితికి వచ్చింది. అడుగులో అడుగు వేసుకుంటూ కేబిన్ వేపు నడిచేను. కేబిన్ తలుపు దగ్గర ఆగి చూసేను. లోపల చీకటి! కళ్ళు చిట్లించి పరీక్షగా చూసేను. నేలమీది కంబళీ ముసుగుతన్ని ఎవ్వరో పడుకున్నట్టు లీలగా కనిపిస్తోంది. డ్రైవర్ అయుంటాడు.

పిల్లిలా లోన అడుగుపెట్టేను. ఊపిరి బిగబట్టి వంగి కొద్దిగా కంబళీ తొలగించేను. కొందరికి చీమ చిటుక్కుమన్నా నిదర మేల్కొంటుంది. మరికొందరి చెవిదగ్గర గొట్టపెట్టి గాండ్రించినా కదిలితే ఒట్టు!

వీడెవడోగానీ మొదటి కోవకి చెందుతాడు. కంబళి తొలగించిన మరుక్షణం దిగ్గున లేచి కూర్చుని, "ఎవ్వరు?" అన్నాడు బెదిరిన కంఠంతో.

చీకట్లో మీదికి వంగివున్న నా మహాకాయాన్ని చూడగానే గుండెలవిసి గావుకేక పెట్టడానిక్కాబోలు నోరు తెరిచేడు. అంతే! అరచేతి అంచుతో మెడవెనక ఒక్కటి ఇచ్చేను. వాడి అరుపు బైటికి వస్తూ వస్తూ తిరిగి లోనికెళ్ళిపోయింది. అదే మోషన్‌లో మరోటి ఇచ్చేను గట్టిగా. చేతులు వేళాడేసి వెల్లికిలా పడిపోయేడు.

"డేవిడ్! క్విక్!" అన్నాను వాడి భుజాలు పట్టుకుంటూ.

ఇద్దరం వాణ్ణి లేపి ఇవతలికి తెచ్చి, ఒడ్డున పడేశాం. గబగబ వాడి జేబులు వెదికి బోట్ ఇంజన్ ఇగ్నిషియన్ కీ తీసుకున్నాను. మరో గంటకిగాని వాడికి స్పృహ రాదు.

ఒడ్డునించి బోట్ ని వేరుజేసి తిరిగి కాబిన్ లో దూరేము. డేష్ బోర్డ్ లైట్ వెలిగించి ఆ వెలుగులో ఇగ్నిషియన్ కీ హోల్ చూసి, కీ దాంట్లో దూర్చేను. ఆ భయంకరమైన చలిలో ఇంజన్ అంత త్వరగా సెల్ఫ్ ఎత్తదు. తొందర పడితే బేటరీ డౌన్ అయే ప్రమాదముంది. అందుకే నిదానంగా, సెల్ఫ్ స్టార్టర్ని పూర్తిగా లాగకుండా, సగం లాగి పట్టుకున్నాను.

ఐదు నిమిషాల్లో హీటర్ ప్లగ్ వేడెక్కి ఎర్రబారింది. ఆ వేడి ఇంజన్ వర్కూ పాకుతుంది. ఇక భయంలేదు. సెల్ఫ్ స్టార్టర్ పూర్తిగా లాగేను. ఇంజన్ రయ్ మంటూ స్టార్టయింది. థ్రోటల్ తిప్పి ఏక్సిలేటర్ ఇవ్వగానే నీటిమీద బాణంలా దూసుకుపోసాగింది.

"డేవిడ్! ఒక సమస్య తీరింది. ఓ సిగరెట్ అంటించి ఇవ్వు!" అన్నాను బోట్ ని ఉత్తరం వేపు తిప్పుతూ.

డేవిడ్ సిగరెట్ అంటించి నా నోట్లో ఇరికించేడు' ఓ దమ్ములాగేసరికి కాస్త రిలీఫ్ దొరికినట్టు తోచింది. ఆ నిశ్శబ్ద నిశీధిలో బోట్ ఇంజన్ జేస్తున్న శబ్దం చాలా పెద్దగా వినిపిస్తోంది. చుక్కల వెలుగులో ముందుకి చూస్తూ క్షణక్షణానికీ స్పీడ్ ఎక్కువ జెయ్యసాగేను. విరామం లేక నిదరతో కళ్ళు మండిపోతున్నాయి.

గంట గడిచింది!

బ్రాహ్మణవారియా ఇహ రెండు మైళ్ళు వుంటుంది. ఇంతలో హఠాత్తుగా మా బోట్ ఇంజన్ శబ్దంకాక,

వెనక ఇంకేదో ఇంజన్ శబ్దం లీలగా వినిపిస్తున్నట్టు అనుమానంవేసి చటుక్కున వెనుదిరిగి చూసేను.

సరిగ్గా అదేసమయంలో వెనక దూరాన, తారాజువ్వ లాటి కాంతి రివ్వున ఆకాశంలోకి లేచి, టప్ మనే శబ్దంతో పగిలి, పెద్ద జ్వాలగా మారి, మెల్లిగా కిందికి దూసుకు రాసాగింది. సందేహంలేదు. అది సిగ్నల్ పిస్టల్ కాంతి! యుద్ధాల్లో రాత్రివేళ శత్రువు ఆచూకీ తెలుసుకోడానికి ఆకాశంవేపు ఆ పిస్టల్ పేలుస్తారు.

"డేవిడ్! బహుశా బోట్ డ్రైవర్‌కి స్పృహవచ్చి పోలీస్ హెడ్‌క్వార్టర్‌కి ఫోన్ జేసి మన విషయం చెప్పి ఉంటాడు. వెనక మనల్ని పోలీసులు వెంబడిస్తున్నారు. ఏబర్ సెక్ వీపుకి తగిలించుకుని రెడీగా ఉండు!" అన్నాను ఏక్సిలేటర్ పూర్తిగా నొక్కుతూ.

నా ప్రయత్నం విఫలమయింది. వెనకవస్తున్న బోట్ అంతకంతకీ దగ్గిరవసాగింది. ఏంజెయ్యాలో ఇంకా ఆలోచిస్తూనే వున్నాను. ఇంతలో, "ఢాం! ఢాం!" అనే శబ్దంతో పరిసరాలు మారుమోగేయి.

"రయ్! రయ్!" మనే శబ్దంతో గాలిని చీల్చు కుంటూ మాకు అతి చేరువనించి గుళ్ళు దూసుకుపోయేయి.

ఇక లాభంలేదు. వాళ్ళ బోట్ ఇంజన్, శక్తివంత మైంది. ఏ క్షణంలోనైనా మమ్మల్ని చుట్టుముట్టవచ్చు. జాగుజేస్తే ప్రమాదం!

"డేవిడ్! నిశ్శబ్దంగా నీటిలో దూకి, కుడిపక్క ఒడ్డు వేపు ఈదుకువెళ్ళు. క్విక్!" అన్నాను.

డేవిడ్ క్షణం వృథాజెయ్యకుండా, డెక్ అంచుమీద చేతులు ఆనించి నీటిలోదిగేడు. బుడుగ్ మనే చిన్న శబ్దం అయింది. అంతే!

ఏక్సిలేటర్ మీాంచి నా కాలుతీస్తే బోట్ ఇంజన్‌కి పెట్రోలు అందక స్పీడ్ స్లో అవుతుంది. అరనిమిషంలో వెనకవస్తున్న బోట్ సమీపిస్తుంది. ఏంచెయ్యాలి? కుడి చేత్తో స్టీరింగ్ పట్టుకుని, ఎడంచేత్తో కింద తడిమి చూసేను. లావుపాటి ఇనప హుక్ తగిలింది. దాన్ని ఎత్తి ఏక్సిలేటర్ వెనక్కి రాకుండా దానిమీాద ఆనించేను.

ఇహ టాంక్‌లో పెట్రోలు ముగిసేవరకూ బోట్ అలా దూసుకుపోతూనే వుంటుంది.

వీపుమీాది ఏబర్‌సెక్ సరిచేసుకుని, డేవిడ్‌లా మెల్లిగా నీటిలో దిగేను. పది అడుగుల లోతు నీటిలో మునిగి, కుడి పక్క ఒడ్డువేపు వేగంగా ఈదసాగేను.

నేను దిగిన బోట్, అలా దూసుకుపోతూండటంవల్ల, వెనకవస్తున్న వాళ్ళకి మేము నీటిలో దిగేమన్న అనుమానం వచ్చే అవకాశంలేదు. ఊపిరి బిగబట్టి చేతులతో నీటిని చీల్చుతూ ముందుకి పోసాగేను. ఇహ శ్వాస ఆపలేనని పించేసరికి, మెల్లిగా నీటి తలంవేపు కదిలేను.

నీటి శబ్దం కానివ్వకుండా, మెల్లిగా తలెత్తి చూసేను. నా పథకం ఫలించింది. మేము వదిలిన ఖాళీ బోట్‌ని తరుముకుంటూ పోలీస్ బోట్ నీటిమీాద గాడు తీస్తోంది. డేవిడ్ ఈపాటికి ఒడ్డుజేరి వుంటాడు. నీటిలోపలే చేతులతో తెడ్లువేస్తూ ఒడ్డువేపు ఈదసాగేను.

పదినిమిషాల్లో ఒడ్డు జేరేను. చీకట్లో ఇరవై గజాల ఎడంగా చిన్న ఈల వినిపించింది. అది డేవిడ్ సంకేతం. ఒడ్డెక్కి వెనుదిరిగి చూసేను. బోట్ల ఇంజన్ శబ్దం దూరాన లీలగా వినిపిస్తూనే ఉంది.

మా వీపుకి వేళాడుతున్న ఏబర్‌సెక్స్ వాటర్‌ప్రూఫ్ క్లాత్‌తో జేసినవి కావడంవల్ల వాటిలోని సామాన్లు

నిక్షేపంగా ఉంటాయి. ఇంతలో డేవిడ్ నా దగ్గరికి వచ్చేడు.

"వాళ్ళు ఏ క్షణంలోనైనా ఆ ఖాళీ బోట్ ని పట్టుకో వచ్చు. ఇక్కణ్ణించి మన ప్రయాణం నార్త్ వెస్ట్ మధ్య 240 డిగ్రీలో ముందుకి సాగాలి!" అన్నాను ఒడ్డు ఎక్కుతూ.

నీటిలో తడవడంవల్ల, చలిగాలికి ఎముకలు కొరుకుడు పడుతున్నాయి. కాళ్ళు మొద్దుబారినట్టూ, బలవంతాన ముందుకి పడుతున్నట్టూ అనిపిస్తోంది. ఒళ్ళూ, దవడలూ గజగజ వణుకుతున్నాయి. సూర్యోదయం అయేవరకూ ఈ నరకం తప్పదు మరి!

రాళ్ళూ, రప్పలూ, డొంకలూ లెక్క చెయ్యకుండా సాధ్యమైనంత వేగంగా ముందుకు సాగేము.

# 10

దూరాన ఎక్కడో సన్నగా రైలుకూత వినిపించింది. అప్పుడు జ్ఞాపకం వచ్చింది నా మ్యాప్ లో అచోట ఒక రైల్వే లైన్ ఉంటుందనీ, ఆ లైన్ ద్వారా తిన్నగా ఇస్లామ్ నగర్ చేరుకోవచ్చనీ! మేము రైలుపట్టాలు చేర గానే ఓ గూడ్సు ట్రేన్ వస్తూ కనిపించింది. దాన్ని చూడగానే నా ప్రాణం లేచివచ్చింది:

"డేవిడ్! ఆ ఇంజన్ డ్రైవర్స్ దృష్టిలో పడకుండా పొదలచాటున నక్కి, ట్రేన్ చివర్న ఉండే గార్డ్ కేబిన్ని క్యాచ్ జెయ్యాలి. జాగ్రత్త! పట్టు జారకూడదు" అన్నాను.

డేవిడ్ తలూపేడు. ఇద్దరం పట్టాలకి కాస్త ఇవతల ఉన్న ఓ పొదల గుబురు వెనక నక్కి చూడసాగేము. ట్రేన్ వచ్చింది. మమ్మల్ని సగం దాటింది.

"డేవిడ్! కమాన్!" అన్నాను మెరుపులా పట్టాల వేపు కదులుతూ.

గార్డ్ కేబిన్ మమ్మల్ని సమీపించడానికి ఇంకా రెండు నిమిషాలు పడుతుంది.

ఎలాట్ అయి నిల్చున్నాం, కేబిన్ దగ్గర పడుతోంది. అదృష్టవశాత్తూ గార్డ్ బైట లేడు. చలికి లోపలే ఉండి వుంటాడు.

కేబిన్ దగ్గరికి రాగానే కొద్ది దూరం దానితో పరిగెత్తి ఛెంగున ఎగిరి ఇనపరాడ్స్ని పట్టుకున్నాం. జాగ్రత్తగా డెక్ మీద ఎక్కి గార్డు కేబిన్ వేపు చూసేను. తలుపు మూసి ఉంది. దాని పక్కనే చిన్న కిటికీ, అద్దం బిగించి ఉంది. లోపల లైటు వెలుగుతోంది.. గార్డ్ పడుకున్నాడనుకున్న నా అంచనా సరికాదు. కిటికీలోంచి అతను కుర్చీలో కూర్చొని ఏదో రాస్తుండటం స్పష్టంగా కనిపిస్తోంది. అదృష్టవశాత్తూ ఇంకా మమ్మల్ని చూడలేదు.

నలభై ఏళ్ళుంటాయతనికి, సన్నగా పొడుగ్గా ఉన్నాడు. కళ్ళకి అద్దాలు, అక్కడక్కడా నెరిసిన జుత్తు. పెంచిన గెడ్డం, ఏ క్షణంలోనైనా అతను కిటికీలోంచి బైటికి చూడవచ్చు. లేదా తలుపు తెరిచి బైటకి రావచ్చు. అందుకే జేబులోంచి పిస్తోలుతీసి రెడీగా పట్టుకున్నాను. నన్ను చూసి డేవిడ్ కూడా పిస్తోలు బైటికి తీసేడు.

నా అంచనా నిజమే అయింది. పావుగంట తరువాత అతను రాయడం ఆపి తలెత్తి కిటికీ వేపు చూసేడు. కాలయముడిలా నిలుచున్న నన్ను చూడగానే మెరుపులా, కేబిన్ మధ్య అమర్చివున్న యంత్రపు చక్రంమీద చెయ్యి వేసేడు. అతనా చక్రాన్ని గనక తిప్పాడంటే ఇంజన్

లోని స్టీమ్ లీక్ అయి ట్రేన్ ఆగిపోతుంది. మా కొంప మునిగిపోతుంది.

అతని చేతికి చలనం వచ్చేలోగా, తలుపువేపు గెంతి ఒక్క తన్ను తన్నాను. తెరుచుకుంది. మరేమీ ఆలోచించకుండా గార్డ్ మీదికి ఫ్లయింగ్ డైవ్ కొట్టేను. గావుకేక పెడుతూ వెనక్కిపడ్డాడు. ఇంకా నయం, చక్రాన్ని తిప్పలేదు. లోనికి పరిగెత్తి కిందపడ్డ అతని కాలర్ పట్టుకుని లేపేను. ఈలోగా డేవిడ్ లోనికి దూకేడు.

మా అవతారాలూ, చేతుల్లో పిస్తోళ్ళూ ఆ బిక్క ప్రాణిని భీతావహం జేసివుంటాయి. పిచ్చిగా, వెర్రిగా మమ్మల్నీ, పరిసరాలనీ చూస్తూనిదరలో మాట్లాడుతున్నట్టు పలవరించ సాగేడు. "వ...ద్దు...చంపకండి...నలుగు రాడపిల్లలు...పెళ్ళిళ్ళు జెయ్యాలి...అప్పులు తీర్చాలి... అందరూ అనాథలై పోతారు..."

అతన్ని చంపాలన్నా, ఇంకేదైనా చెయ్యాలన్నా మాకు అరక్షణం పట్టదు. అతని పరిస్థితి నన్ను కరిగించి వేసింది.

"డేవిడ్! ఇతన్ని ఓ మూల కూర్చోబెట్టి కనిపెట్టు. గూడ్స్ ట్రేన్స్ సాధారణంగా ప్రతి స్టేషన్‌లో ఆగవు. ఏదైనా స్టేషన్‌లో ఈ ట్రేన్ ఆగే సూచనలు కనిపిస్తే ఔటర్ సిగ్నల్ దగ్గరే మనం దిగిపోవాలి," అన్నాను గార్డ్‌ని డేవిడ్ వేపు తోస్తూ.

డేవిడ్ అతన్ని ఓ మూల తీసికెళ్ళి కూర్చోబెట్టేడు. ట్రేన్ శరవేగంతో దూసుకు పోతోంది.

ఎనిమిది గంటల ప్రాంతంలో ట్రేన్ స్పీడ్ స్లో అవుతున్నట్టు అనుమానం వేసి, కేబిన్‌లోంచి బైటికి వచ్చి చూసేను. దూరాన ఔటర్ సిగ్నల్, ఇళ్ళూ లీలగా

కనిపిస్తున్నాయి. ఏదో పెద్ద స్టేషన్ వస్తోంది. జేబు లోంచి మ్యాప్ తీసి జాగ్రత్తగా చూసేను. అది ఇస్లామ్ నగర్ స్టేషన్, మేము దిగవలసింది అక్కడే!

మ్యాప్ మడిచి జేబులో పెట్టుకుంటూ డేవిడ్ ని పిలిచేను. అతను బైటికి రాగానే ఇన్ స్ట్రక్షన్ ఇవ్వ సాగేను. "ఇస్లామ్ నగర్ స్టేషన్ రాబోతోంది. మనం ఔటర్ సిగ్నల్ దగ్గరే దిగి, కంచన్ పూర్ వెళ్ళే బస్ క్యాచ్ జెయ్యాలి. అక్కణ్ణించి భారత సరిహద్దు ఇరవై మైళ్ళే!"

డేవిడ్ తలూపేడు.

ఇంతలో ఔటర్ సిగ్నల్ సమీపించింది. ఒకరివెనక ఒకరం దిగిపోయేము. మమ్మల్ని వదిలిపోతున్న ట్రేన్ వేపు చూసేను. అంతవరకూ బెల్లంకొట్టిన రాయిలా మూల కూర్చున్న గార్డ్, ఇప్పుడు కేబిన్ లోంచి బైటికివచ్చి రెప్ప వెయ్యకుండా మమ్మల్ని చూస్తున్నాను.

# 11

గబగబ నడుస్తూ పావుగంటలో ఇస్లామ్ నగర్ లో ప్రవేశించాం. రాత్రి కావడంవల్ల మమ్మల్ని ఎవ్వరూ అంతగా పట్టించుకోలేదు. స్టేషన్ బస్ స్టాండ్ లో ఎంక్వైరీ జేస్తే కంచన్ పూర్ వెళ్ళే బస్ తొమ్మిదిన్నరకి ఉందని తెలిసింది. నలుగురి దృష్టి పడకుండా బస్ స్టాండ్ షెడ్ లో మసకచీకట్లో నిల్చుని చూడసాగాం. తొమ్మిదిన్నరకి బస్ వచ్చింది. ఎక్కీ, తొక్కీ లోన దూరి రెండు సీట్లు ఆక్రమించేము. కండెక్టర్ రాగానే కంచన్ పూర్ కి రెండు టికెట్స్ తీసేను. పావుగంట తరవాత బస్ కదిలింది. చూస్తూ చూస్తూనే సిటీ పొలిమేరలు దాటింది.

బస్‌లో ఉన్న మిగతా వాళ్ళు మమ్మల్ని అంతగా పట్టించుకోడంలేదు. ముందు నుందు ఏం జెయ్యాలో తీవ్రంగా ఆలోచిస్తున్నాను. నాలాగే ఎవ్వరి ధ్యాస వారిది.

ఇంతలో చిన్న కుదుపుతో బస్ ఆగడంతో నా ఆలోచనలకి బ్రేకుపడింది. కిటికీలోంచి బైటికి చూసేను. చీకటి! అది బస్‌స్టాండ్ కాదు. మరి బస్ దేనికి ఆగింది?

''దేనికి ఆపేవు?'' అడిగేడు కండక్టర్, డ్రైవర్‌ని.

డ్రైవర్ జవాబిచ్చేలోగా, ఎవ్వరో బస్‌లోకి వస్తున్నట్టు వెనక తలుపు దగ్గిర బూట్సుల టకటక వినిపించింది. చటుక్కున వెనుదిరిగి చూసేము.

మిలిటరీ పోలీస్!

మోచేత్తో డేవిడ్ డొక్కలో కుమ్మి, కళ్ళతో వెనక్కి సైగ జేసేను. డేవిడ్ వెనక్కి చూసి వేడి నిట్టూర్పు వదిలేడు.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది. ఉదయం మేము ప్రాణాలతో వదిలిపెట్టిన గూడ్స్‌ట్రేన్ గార్డ్ ఇస్లామ్ నగర్ చేరగానే అధికార్లకి మా గురించి చెప్పి ఉంటాడు వెంటనే మాకోసం వేట ప్రారంభమై ఉంటుంది.

బస్‌లోకి వచ్చిన ఆ ఇద్దరు మిలటరీ పోలీసులు, లో ఉన్న ప్రతి ఒక్కరినీ పరీక్షగా చూస్తూ మా వేప రాసాగేరు. నా గుండె వేగం అందుకుంది. మిగత పేసింజర్స్‌లాగే మేమూ వాళ్ళని నిర్లప్పగించి చూసాగేము. ఇద్దరూ మమ్మల్ని సమీపించేరు. అందులో ఒకడు ఎగాదిగా మమ్మల్ని చూసి, లేవమన్నట్టు వేలితో సైగ జేసేడు.

''దేనికి?'' అంటూ లేచి నిలుచున్నాను.

"మిమ్మల్ని సెర్చ్ జెయ్యాలి. ఆ ఏబర్ సెక్స్ ఏమిటి?" అడిగేడు కాళ్ళదగ్గిర పడున్న వాటిని చూపిస్తూ.

"మేము లేటైపోతాం!" అన్నాడు కండక్టర్ మధ్యలో.

"నువ్వు నీ బస్ తీసికెళ్ళు, మీరిద్దరూ బస్ దిగండి!" అన్నాడు మిలిటరీ పోలీస్ జేబులోంచి పిస్తోలు బైటకి తీస్తూ.

తప్పదు! కిక్కురు మనకుండా, ఏబర్ సెక్స్ ఎత్తుకుని తలుపువేపు నడిచాం. మమ్మల్ని కవర్ జేస్తూ ఆ ఇద్దరు పోలీసులు బస్ దిగేరు. రోడ్డుపక్క వాళ్ళ మోటర్ బైక్ ఆగి వుంది. మేము దిగగానే బస్ స్టార్టయి వెళ్ళిపోయింది.

అది నిర్మానుష్యమైన చీకటి ప్రదేశం!

"పిచ్చివేషాలు వెయ్యకుండా చేలులెత్తి నిల్చోండి!" అన్నాడు ఒకడు.

"ఇది దౌర్జన్యం! అన్యాయంగా మమ్మల్ని బస్ దేనికి దింపేరు? మేము జేసిన అపరాధం ఏమిటి?" అన్నాను జుత్తు గోక్కుంటూ.

అది డేవిడ్ మధ్యా, నా మధ్యా ఏర్పరుచుకున్న ఎమర్జెన్సీ సిగ్నల్. ఆ సిగ్నల్ పాస్ అయిన మరుక్షణం, మా ఇద్దరి చేతుల్లోని ఏబర్ సెక్స్ పిడుగుల్లా వారి గుప్పిళ్ళలో ఉన్న పిస్తోళ్ళమీద పడ్డాయి. ఏం జరిగింది? తెలిసేలోగా ఇద్దరి పిస్తోళ్ళూ నేలవాలాయి.

చిరుతల్లా వాళ్ళమీదికి లంఘించి, కంఠంమీదా, ముక్కుమీదా, నాభికిందా, ఇష్టం వచ్చినట్టు గుద్దసాగేము. ఆ హఠాత్సంఘటనకి వాళ్ళు ఎక్కువసేపు తట్టుకోలేకపోయేరు. ఒకరి తరువాత ఒకరు మొదలు నరికిన చెట్లలా నేలకూలేరు. మొనదేలిన బూటుకాళ్ళతో కణతలమీద

యిద్దరం ఈడ్చి తన్నసాగేము. కాసేపటికి వారిలో చలనం నశించింది. చచ్చేరో బ్రతికేరో కూడా చూడకుండా ఇద్దర్నీ రోడ్డు పక్క పొదల్లోకి ఈడ్చి, బైటికి కనిపించకుండా చెట్ల కొమ్మలు కప్పేము.

రోడ్డుమీద పడున్న వాళ్ళ పిస్తోళ్ళూ, 'ఎబర్ సెక్ లూ అందుకుని, మోటర్ బైక్ ఎక్కాం. మోటర్ బైక్ నడపడంలో దేవిడ్ ఉద్దండుడు. అది మిలిటరీ రాయలండ్ ఫీల్డ్ గనక వాయువేగంతో దూసుకు పోసాగింది.

రాత్రి పదిగంటల ప్రాంతంలో కంచన్ పూర్ జేరాం!

ఊరికి ఇవతల మోటర్ బైక్ ఆపి దిగాము. జేబులోంచి మ్యాప్ తీసి, టార్చి వెలుగులో పరిశీలించాను. కంచన్ పూర్ కు ఉత్తరదిశగా వెళ్ళాలి. ఆ వైపు రోడ్డులేదు. ఇహ కాలినడకే శరణ్యం!

అదృష్టం బావుంటే రేపు మధ్యాహ్నంకు భారత సరిహద్దు జేరుకోవచ్చు.

మోటార్ బైక్ ని రోడ్డు పక్క పొదల్లో కప్పి, మిణుకు మిణుకుమనే చుక్కల వెలుగులో నడక సాగించాం!

# 12

ఉదయం పదిగంటల ప్రాంతంలో ఓ కొండ ప్రదేశం జేరుకున్నాం. అది ఎత్తైన పొదలతో నిండిన ప్రదేశం. ఆ కొండ ఎక్కి అవలివైపు వెళితే భారత సరిహద్దు ఐదు మైళ్ళే. రాత్రి ఒంటిగంట ప్రాంతంలో ఓ చోట కునుకు తీశాంగనక, ఉదయం మిగిలిన తినుబండారాలూ అవీ ఖాళీజేశాం. గనకా ఒంట్లో కాస్త ఏక్టివిటీ ఉంది.

కొండ సగం ఎక్కామనుకుంటాను. ఇంతలో నీలి గగనంలో ఏదో శబ్దం వినిపించి, చటుక్కున తలెత్తి చూసేను.

హెలికాప్టర్!

"డేవిడ్! క్విక్ డౌన్!" అంటూ ఉన్న పళంగా బోర్లా నేలమీద పడ్డాను.

హెలికాప్టర్ మేమున్న చోట ఓ సర్కిల్ కొట్టి వెను దిరిగి వెళ్ళిపోయింది. ఆ ప్లేన్ మమ్మల్ని అంతగా కప్పి పెట్టలేదు. నేలమీద పడుకునే క్రోలింగ్ జేస్తూ ఓ పొద చాటుకి వెళ్ళాం.

బంగ్లాదేశ్ నించి భారత సరిహద్దు చేరడానికి అదే షార్ట్ వే గనక మేము తప్పకుండా ఆ దారినే ప్రయాణమై ఉంటామని ఊహించి, మునీర్ తన అనుచరులతో హెలి కాప్టర్ ద్వారా సెర్చ్ జేస్తున్నాడేమో!

ఇంతలో హెలికాప్టర్ మళ్ళీ ఆవేపు వచ్చింది. ఈ మారు ఎంత కిందికి వచ్చిందంటే దాని గాలికి మేము పడుకున్న చోట పొదల ఆకులు కదలసాగాయి. క్షణం క్షణం అలా ఎగిరి తిరిగి మీదికి వెళ్ళింది. తిన్నతిన్నగా దాని ఇంజన్ శబ్దం దూరమవసాగింది.

"డేవిడ్! సాధ్యమైనంత త్వరగా కొండెక్కి అవతలకి వెళ్ళడం మంచిది. పద!" అంటూ లేచేను.

ఇద్దరం పరిగెత్తుతున్నట్టు కొండ శిఖరం జేరుకుని, ఓ బండ చాటునదాగి, ఏబర్ సెక్ లోంచి బైనాక్యులర్స్ తీసేను. వాటిద్వారా చుట్టూ ఓమారు కలయజూసేను.

హెలికాప్టర్ కనిపించింది!

గాలిలో ఎగురుతూ కాదు. దూరాన, పొదలులేని ఓ ఖాళీ ప్రదేశంలో నేలమీద దిగి! అక్కడే ఓ పాడుపడ్డ ఇల్లూ, దాని తాలూకు శిథిలాలూ ఉన్నాయి. నా అను మానం నిజమైంది. హెలికాప్టర్ పిట్ లోంచి మునీర్

దిగుతున్నాడు. అతని వెనకే లియాఖత్, మరో నలుగురు అనుచరులూ దిగేరు. యూనిఫాంలో ఉన్నది బహుశా పైలెట్ అయుంటాడు.

లియాఖత్ మేమెక్కిన కొండవేపు చూపిస్తూ మునీర్‌తో ఏదో అంటున్నాడు. అతను తలూపి మిగతా వాళ్ళకి ఏదో చెప్పేడు. అందరూ జేబుల్లోంచి పిస్తోళ్ళు బైటికితీసి, కొండవేపు రాసాగేరు. పైలెట్ అక్కడే ఉండిపోయేడు.

"డేవిడ్! నాకో పథకం స్ఫురిస్తోంది. మనం వాళ్ళ కళ్ళుకప్పి, కొండ ఎడం పక్కనించి హెలికాప్టర్ని జేరుకోవాలి. అక్కడ పైలెట్ ఒక్కడే ఉన్నాడు. నా పథకం ఏమిటో బహుశా నీకు అర్థమై ఉంటుంది!"

డేవిడ్ తలూపేడు.

బైనాక్యులర్స్‌లోంచి మరోమారు అటు చూసేను. వాళ్ళు చెదురుగా మొదురుగా చెట్లూ పొదలూ చెక్ జేస్తూ కొండవేపు వస్తున్నారు.

ఇక పదమన్నట్టు డేవిడ్‌కి సైగ జేసి లేచేను. బండరాళ్ళ చాటున నక్కుతూ కొండ ఎడంపక్కదిగేము. జాగ్రత్తగా వాళ్ళ దృష్టిలో పడకుండా హెలికాప్టర్ వున్న ప్రదేశాన్ని సమీపించేను. పైలెట్ కాక్‌పిట్‌కు వీపు ఆనించి నిల్చుని సిగరెట్ కాలుస్తూ కొండవేపు చూస్తున్నాడు.

అతని కళ్ళుగప్పుతూ శిథిలమైవున్న ఆ ఇంటి వెనక్కి వెళ్ళేము. పిస్తోళ్ళు బైటికితీసి శబ్దంకాని అడుగులతో హెలికాప్టర్ వేపు నడిచేను. పైలెట్‌కూ, మాకూ మధ్య హెలికాప్టర్ అడ్డం ఉంది. పిస్తోలు రెడీగా పట్టుకుని, దాని ఎడం పక్కనించి వెళ్ళి పైలెట్ వైపు తిరిగేను.

నన్ను చూడగానే అతను షాక్ తగిలినట్టు ఉలిక్కి పడ్డాడు. నమ్మనట్టు గుడ్లు తేలవేసి చూస్తుండిపోయేడు.

"అరిచినా. ఏ చిన్న పొరబాటు జెయ్యడానికి ప్రయత్నించినా ఒళ్ళు జల్లెడ అవుతుంది. జాగ్రత్త! బుద్ధిగా కాక్‌పిట్‌లో వెళ్ళి కూర్చో!" అన్నాను బొటన వేలితో సేఫ్టీ కాచ్ వెనక్కి లాగుతూ.

అతనింకా ఆ హఠాత్పరిణామం నించి తేరుకోలేదు కాబోలు రాతిబొమ్మలా గుడ్లప్పగించి చూస్తున్నాడు.

"చెప్పేది నీకే!" అంటూ అతన్ని కాలితో వెనక్కి తోసేను.

మా అవతారాలు చూసి అతను నిజంగా బెదిరిపోయేడు కిక్కురుమనకుండా వెళ్ళి కాక్‌పిట్‌లో కూర్చున్నాడు.

అతని వెనకే మేమూ వెళ్ళి సెకెండ్ సీట్లో కూర్చున్నాం.

"భారత సరిహద్దుకి ఇవతల నేను చెప్పిన చోట దించాలి. ఇంజన్ స్టార్ట్ జెయ్!" అన్నాను పిస్తోలు మొనతో పైలెట్ డొక్కలో పొడుస్తూ.

అతని శరీరంతోబాటు నా చెయ్యికూడా షేక్ అవుతోంది. నోరు మెదపకుండా ఇంజన్ స్టార్ట్ జేసేడు. ఫేన గిరగిర తిరగసాగింది. హెలికాప్టర్ నేలవిడిచి పైకి లేవసాగింది.

బైనాక్యులర్స్ తీసి కొండవేపు చూసేను. మమ్మల్ని వెదుకుతూ సగం కొండెక్కిన మునీర్ దళం హెలికాప్టర్ శబ్దం విని, యిటుచూసి చేతులు వూపుతూ పరిగెత్తుకు రాసాగేరు. అప్పటికే హెలికాప్టర్ కావలసిన ఎత్తుకు వచ్చేసింది.

కిందవాళ్ళు నిప్పుతొక్కిన కోతుల్లా గెంతుతూ చేతి రుమాళ్ళు ఊపుతున్నారు. నవ్వుకున్నాను.

పైలెట్ పిరికిపందలా ఉన్నాడు. బెల్లంకొట్టిన రాయిలా కూర్చుని హెలికాప్టర్ నడుపుతున్నాడు.

గంట గడిచింది. భారత సరిహద్దు ఇంక అట్టే దూరం లేదు. ఇంకా ముందుకి వెళితే ప్రమాదం! కింద ఇటు బంగ్లా దేశ్ తాలూకు ఎయిర్ డిఫెన్స్ గన్స్, అటు భారతదేశం ఆర్టిలరీ (ఫిరంగిదళం) తాలూకు గన్స్ ఎల్లవేళలా తయారుగా ఉంటాయి. సూచన ఇవ్వకుండా, అనుమతి లేకుండా తమ రేంజ్ లోకి వచ్చిన ఏ విమానాన్నయినా కూల్చివేసే అధికారం వారికుంది!

అందుకే బైనాక్యులర్స్‌లోంచి జాగ్రత్తగా కిందికి చూస్తూ, మేము ఎక్కడ దిగితే సురక్షితంగా ఉంటామో అంచనా వెయ్యసాగేను. ఓ చోట హెలికాప్టర్ దిగడానికి అనుకూలమైన ప్రదేశం కనిపించింది.

అక్కడ దింపమని పైలెట్‌కు ఆజ్ఞాపించేను.

ఐదునిమిషాల్లో హెలికాప్టర్ ఆచోట దిగింది.

ఇంతవరకూ పైలెట్ బుద్ధిగా మాతో సహకరించేడు. అతని చంపడం చాలా అన్యాయం. ఇక అతనితో మాకు పనిలేదు. అతనిని కాళ్ళు చేతులు కట్టి పడేశాము.

స్నేహ పూర్వకంగా అతని భుజంతట్టి, "చెప్పినట్టు విని మాతో సహకరించినందుకు మెనీథాంక్స్! నామాట వినకుండా ఏ చిన్న పొరబాటుజేసి వున్నా, ఈపాటికి యమలోకంలో షికార్లు కొట్టేవాడివి. గుడ్ బై!" అన్నాను కాక్‌పిట్‌లోంచి దిగుతూ.

నా వెనకే డేవిడ్ కిందికి దూకేడు.

ఆ తర్వాత బంగ్లాదేశ్ బార్డర్ సెక్యూరిటీ ఫోర్స్ కళ్ళుగప్పి, భారతభూమిలో కాలుపెట్టడం ఏమంత కష్టం కాలేదు మాకు.

—: ఐపోయింది :—

# వందకు పదివేలు

**వసుంధర**

అర్ధరాత్రి పన్నెండు గంటల సమయంలో ఎవరో తలుపు తట్టిన చప్పుడు విని సుబ్బారావుకు మెలకువ వచ్చింది.

చేతికి అందుబాటులో వున్న పుష్‌బటన్ స్విచ్ నొక్కి దీపం వేశాడు. గదంతా వెలుతురుతో నిండింది. అతని భార్య వనజ చిరాగ్గా "హుఁ" అని మూలిగి, దుప్పటి ముఖం మీదకు లాక్కుని, ప్రక్కకు తిరిగి పడుకుంది.

సుబ్బారావు మంచం దిగాడు. వీధి తలుపు ఇంకా చప్పుడవుతూనే వుంది.

ఒక్కసారి ఒళ్ళు విరుచుకుని, గబగబా అడుగులు వేసుకుంటూ వెళ్ళి తలుపు తీసాడు. ఆగంతకుడి ముఖం పరిచయమైనదిగా తోచలేదతనికి.

"ఎవరది?" అన్నాడు సుబ్బారావు.

"సుందర్రావుగారిల్లేదా నాండీ?" అన్నాడతను అడుగు లోపలకు వేస్తూ.

"కాదు" అన్నాడు సుబ్బారావు ఇబ్బందిగా ముఖం పెట్టి.

ఆగంతకుడు ఆగలేదు. ఇంకా లోపలకు వస్తూనే, "పోనీ ఏదో చెప్పగలరా?" అనడిగాడు.

"నాకు తెలియదు" అన్నాడు సుబ్బారావు ముక్తసరిగా.

ఆగంతకుడు వెళ్ళి కుర్చీలో కూర్చుని, "పోనీ తెలును కునేదాకా నేనిక్కడుండొచ్చా?" అనడిగాడు.

ఈసారి అంత తేలిగ్గా సమాధానం దొరకలేదు సుబ్బారావుకి. విస్మయంగా అతనినే చూడసాగాడు.

ఆగంతకుడు నవ్వి, "మీరు చాలా మర్యాదస్తుల్లా కనబడుతున్నారు. కాదనలేరనే నా నమ్మకం" అన్నాడు.

సుబ్బారావు ఇబ్బందిగా నవ్వి, "మీరూ మర్యాదస్తుల్లా గానే ఉన్నారు. కాదనడం కష్టమే! కానీ ఇల్లు చిన్నది. అరుగుమీద పడుకుంటే మీ కిబ్బందిగా ఉండదను కుంటాను" అని, "అలా కూర్చునే ఉండండి. మంచం తీసుకు వస్తాను" అన్నాడు.

ఆగంతకుడు సుబ్బారావుని దగ్గరకు రమ్మనమని పిలిచాడు. సుబ్బారావు వెళ్ళాడు. స్వరం తగ్గించి, "నా దగ్గర చాలా డబ్బుంది. బయట పడుకుంటే ప్రమాదం" అన్నాడాగంతకుడు.

సుబ్బారావు గతుక్కుమన్నాడు, "మరింట్లో కాళీ లేదే!" అన్నాడు.

"ఈ గదిలో నే పడుకుంటాను" అన్నా డాగంతకుడు.

"చూడండి. ఈ ఇంటికి రెండే గదులు. దీన్నానుకు నే మా పడకగది ఉంది. మేము బాత్రూముకీ వాటికీ వసల డానికీ గదిలోంచే వెళ్ళాలి. మగవాళ్ళయితే ఇబ్బందిలేదు కానీ ఆడవాళ్ళతో కాస్త ఇరకాటమే గదా!"

"ఓహ్ కొత్త దంపతులనుకుంటాను" ఆగంతకుడు నవ్వాడు.

"మరీ కొత్తవాళ్ళంకాదులెండి. కాపురంపెట్టి ఏడాది పూర్తయింది" అన్నాడు సుబ్బారావు కాస్త విసుగ్గా.

ఆగంతకుడు కాసేపు సీరియస్‌గా ఆలోచించి తన చేతి లోని బ్రీఫ్ కేసుని సుబ్బారావు కందించాడు. "చూడండి. ఇది నా ప్రాణం. నా ప్రాణాలుపోయినా దీన్ని వదలను. ఏ పరిస్థితుల్లోనూ దీన్ని తెరవడానికి ప్రయత్నించవద్దు. నాకోసం దాచి ఉంచండి. నేను బయట పడుకుంటాను. ఇవన్నీ ఎందుకు చెబుతున్నానంటే, తెల్లవారేసరికి నేను మీ ఇంటరుగుమీద కనపడలేదనుకోండి. కంగారుపడ కండి. పెట్టెకోసం నేను మళ్ళీ వస్తానిమాత్రం గుర్తుంచు కోండి" అన్నాడు.

సుబ్బారావది అందుకున్నాడు. చాలా బరువుగా వుంది. అతని గుండెలుకూడా బరువెక్కాయి. ఊపిరికూడా బరు వుగా తీశాడు. పెట్టె సుబ్బారావు బెడ్రూంలో బీరువా లోపలకు చేరుకుంది. ఒక మంచం, దుప్పటీ, తలగడా వీధరుగుమీదకు వచ్చాయి. ఆగంతకుడు వీధిలోకి దారి తీస్తూండగా సుబ్బారావు అన్నాడు - "ఇంతకీ మీ పేరు తెలుసుకోలేదు."

"నా పేరు భయంకర్!" అన్నాడతను.

అతను సుబ్బారావు పేరడగలేదు. చెప్పడానికి సుబ్బారావుకీ భయం వేసింది.

సుబ్బారావు వీధి తలుపులు వేశాడు. పడకగదిలోకి వచ్చి పక్కలో దూరాడు. ఒకసారి చిరాగ్గా మూలిగి, చంటిపిల్లలా అతని దగ్గరగా చేరి చేయి మీద వేసుకుని పడుకుంది వనజ.

## 2

"బాబుగారూ! పాలు తీసుకొచ్చాను!"

పాలవాడి కేక విని సుబ్బారావు లేచాడు. వనజది మొద్దు నిద్ర. ఓ పట్టాన ఆమెకు మెలకువరాదు. అందులోనూ ఉదయం ఆరుగంటల ప్రాంతాలకే లేవాలంటే ఆమెకు అసాధ్యం. అందుకే పాలు పోయించుకునే డ్యూటీ రోజూ సుబ్బారావుదే. అందరిళ్ళలోనూ అమ్మగారూ అని కేకపెట్టే పాలవాడు సుబ్బారావింటికి రాగానే అప్రయత్నంగానే బాబుగారూ అంటాడు.

సుబ్బారావు తలుపు తీశాడు. పాలవాడు అతని చేతిలోని గిన్నెలో పాలుపోస్తూ, "అయ్యగారూ, అలా పక్కబట్టలూ అవీ వేసి మంచం అరుగుమీద వదిలేశారేంటండీ. ఎవరైనా ఎత్తుపోరూ" అన్నాడు.

ఉలిక్కిపడి చూశాడు సుబ్బారావు. మంచం ఖాళీగా వుంది. అతనికింకా కొద్దిపాటి నిద్రమత్తుండి వుంటే ఈ దెబ్బతో వదిలిపోయింది. పాలవాడికి సమాధానమేమీ ఇవ్వకుండా పాలగిన్నె తీసుకుని లోపలకు వెళ్ళాడు.

పాలగిన్నె వంటింటి అలమారాలో పెట్టి మళ్ళీ వీధరుగు మీదకు వచ్చాడు సుబ్బారావు. అతను పక్క పరీక్షించి చూశాడు. దానిమీద మనిషి పడుకున్న ఛాయలు కనపడుతున్నాయి.

సుబ్బారావు తలగడా ఎత్తి చూశాడు. క్రింద ఏమీ చీటీ లేదు. అతను పక్కదులిపి మడత పెట్టాడు. పక్క చుట్టను ఒక చేత్తోనూ, మంచాన్నొక చేత్తోనూ పట్టుకుని ఇంట్లోకి వెళ్ళాడు.

ముఖం కడుక్కుంటూ కూడా ఆ వ్యక్తి గురించే ఆలోచిస్తున్నాడు సుబ్బారావు. ఎవరతను? అర్ధరాత్రివేళ తనింటికి ఎందుకు వచ్చాడు? తనవద్ద పెట్టె దాచమనడం వరకూ బాగానే ఉంది. ఆ తర్వాత పెట్టె తీస్కోకుండానే ఎందుకు వెళ్ళిపోయాడు?

అప్పుడే అతనికి రాత్రి ఆ వ్యక్తి చెప్పినమాటలు గుర్తొచ్చాయి. ఉదయం లేచేసరికి తను కనపడక పోయినా కంగారు పడవద్దనీ, పెట్టెను దాచి ఉంచమనీ చెప్పాడు. తన ప్రాణాలు పోయినా పెట్టెను వదలననీ దాని గురించి మళ్ళీ వస్తాననీకూడా చెప్పాడతను. అతని పేరు భయంకర్!

ఆ పెట్టెలో ఏదో విశేషముండి ఉంటుంది. దానికోసం ఈ వ్యక్తినెవరో వెంటాడుతున్నారేమో – అతగాడికన్నుకప్పి భయంకర్ తన ఇంట్లో దూరి ఉంటాడు. పెట్టెను దాచేక అరుగుమీద పడుకున్నాక – ఏదో కొత్త పరిస్థితి ఏర్పడి ఉంటుంది. తప్పనిసరిగా అతను తన ఇల్లు వదిలి పెట్టవలసి వచ్చి ఉంటుంది. ఏమిటా అనూహ్య పరిస్థితి?

ఆలోచించిన మీదట సుబ్బారావుకి– పెట్టెపట్ల తనకూ బాధ్యత ఉన్నదనిపించింది. భయంకర్ మంచివాడో, చెడ్డవాడో తెలియదు కానీ ప్రమాదకరమైన వ్యక్తి!

తన ఇంట్లోని పెట్టె గురించి మరెవరైనా వచ్చి అడగవచ్చు. తన ఇల్లు శోధించవచ్చు. పెట్టె తన ఇంట్లోంచి మాయమైపోతే – అది అతని ప్రాణంకంటె ఎక్కువ అన్నాడు కాబట్టి, భయంకర్ తననేమైనా చేయవచ్చు.

తన్ను తను రక్షించుకోవడంకోసం పెట్టెను భద్రంగా దాచాలి. దానివల్ల తనకు కృతజ్ఞతగా ఏదైనా బహుమతి కూడా ముట్టే అవకాశం వుంటుంది.

సుబ్బారావింట్లో పెద్ద ట్రంకుపెట్టె ఉంది. దానిలో వనజ పాతబట్టలు పెడుతూంటుంది. సామాన్యంగాఎప్పుడో గాని ఆ పెట్టెను ముట్టదు. సుబ్బారావా ట్రంకు తెరిచి— భయంకర్ ఇచ్చిన బ్రీఫ్ కేసుని తెచ్చి అందులో పెట్టి పాత బట్టలన్నీ జాగ్రత్తగా సర్దాడు. ఎవరైనా ఆ పెట్టె తెరవగానే అందులో మోడ్రన్ బ్రీఫు కేసుకోసం వెతికే ఆలోచన కట్టిపెట్టి వెంటనే మూత వేసేస్తారు.

సుబ్బారావు తృప్తిగా పెట్టె మూత వేశాడు. కావాలనే దానికి తాళం వేయలేదు. అలాంటి బట్టలున్న పెట్టెకి తాళముంటే ఎవరికైనా అనుమానం రావచ్చు.

# 3

"హలో—ఎవరండీ—" అన్నాడు సుబ్బారావు రిసీవర్ ఎత్తి.

"నాపేరు భయంకర్!" కంఠం కాస్త పరిచయమైనదిగా తోచింది సుబ్బారావుకి. అతను వెంటనే ఉత్సాహంగా "నమస్కారమండీ—నేను సుబ్బారావుని మాట్లాడుతున్నాను. రాత్రి మీరు మా ఇంటికొచ్చారుకదా- మీ రిప్లై డెక్కణ్ణుంచి మాట్లాడుతున్నారు?" అన్నాడు.

"చెప్పకూడదు. మీరు ఫోన్లో నా పేరుచ్ఛరించ వద్దు. పెట్టె ప్రసక్తికూడా తీసుకురావద్దు. భద్రంగా దాచి ఉంచండి. నేనే ఎప్పుడో మీ ఇంటికి వస్తాను. దాన్ని తీసుకు వెడతాను. ఎప్పుడైనా ఎవరైనా మీ ఇంటికి వచ్చి దాని గురించి అడగవచ్చు. నేను తప్ప మరెవ్వరు వచ్చినా ఆ పెట్టె గురించి మీకేమీ తెలియదని బుకాయించండి.

నా విరోధులు చాలా జిత్తులమారి వాళ్ళు. రకరకాల మారు వేషాల్లో దానికోసం మీ ఇంటికి రావచ్చు. నా పేరుకూడా చెప్పవచ్చు. నేనువస్తే తప్ప మరెవ్వరికీ ఆ పెట్టె ఇవ్వవద్దు ఇది విన్నపమే కాదు, హెచ్చరికకూడా. మిత్రులకు ప్రాణం ఇస్తాను. మిత్రద్రోహం చేస్తే ప్రాణం తీస్తాను. మీరు నా మిత్రుల జాబితాలో చేరారు—" అన్నాడు భయంకర్.

సుబ్బారావు ఇబ్బందిగా - "బాగానే ఉంది. కానీ ఇంకా ఎన్నాళ్ళు?" అనడిగాడు.

"జవాబు నాకూ తెలియదు—" అవతల క్లిక్ మంది.

సుబ్బారావు ఫోన్ క్రేడిల్ మీద పెట్టేసి—మళ్ళీ తన సీట్లోకి వెళ్ళిపోయాడు.

ఏదో మిస్టరీలో చిక్కుకున్నానన్న భయం సుబ్బారావు నావహించింది. మిత్రద్రోహానికి ప్రాణాలు తీస్తానన్నాడు భయంకర్. భయంకర్ శత్రువులు జిత్తులమారి వాళ్ళని కూడా చెప్పాడు. తను సాధారణ వ్యక్తి. ఆ జిత్తులమారి వాళ్ళ కుయుక్తుల్ని దాటుకుని-భయంకర్ దృష్టిలో తను మిత్రద్రోహి కాకుండా ఉండగలడా?

ఆ తర్వాత అతను ఆఫీసులో ఆట్టే వర్కు చేయలేకపోయాడు. అతను ఇంటికి వెళ్ళేసరికి వనజ గుమ్మంలోనే నిలబడి ఉంది. ఆమె ముఖంలో ఆశ్చర్యం కొట్టవచ్చినట్లు కనబడుతోంది. అతను గుమ్మందగ్గరకు రాగానే— "ఏమండీ—ఈ రోజు ఒక చిత్రం జరిగింది!" అంది.

"ఊఁ" అన్నాడు సుబ్బారావు. వనజకు ఈ ప్రపంచంలో ప్రతి చిన్న విషయమూ ఆశ్చర్యంగానే కన్పిస్తుంది. ఆ కన్పించిన ప్రతీదీ భర్తకు చెప్పేదాకా ఆమెకుతోచదు.

అందుకే సుబ్బారావు ఆమె చిత్రం అంటే చలించడు.

"మీరాఫీసుకు వెళ్ళిన అరగంట తర్వాత ఒక ఆడ మనిషి మనింటికొచ్చింది. మన పనిమనిషి చుట్టాన్నని చెప్పింది. మన పనిమనిషి ఎవరిదో ఎరుపు ఉంగరం పెట్టు కొచ్చిందిట. ఇప్పుడు దానిచేతికి లేదుట. మనింట్లో ఇల్లూ డుస్తూండగా పడిపోయుంటుందని దాని అనుమానమట. తనకు కాళ్ళూ చేతులూ ఆడ్డంలేదని వెతకడానికి తన్ను పంపించిందని చెప్పింది. సరే నేను దగ్గరుండి దాన్ని ఇల్లంతా జాగ్రత్తగా మరోసారి ఊడ్చనిచ్చాను, ఇల్లూ డుస్తూ శ్రద్ధగా వెతకాలా—అందుకు బదులు—నాతో కబుర్లకు దిగిందది—" వనజ ఆగింది.

"ఏం మాట్లాడిందేమిటి?" అనడిగాడు సుబ్బారావు ఏదో అనుమానంగా. ఈ పర్యాయం కాస్త నిజమైన విశేషమే వనజ చెప్పనున్నదనిపించింది సుబ్బారావుకి.

"నిన్న అర్ధరాత్రివేళ మీ ఇంటికెవరో చుట్టాలొచ్చా రుట గదమ్మా—అనడిగిందండీ—" అంటూ నవ్వింది వనజ.

సుబ్బారావుకి నవ్వురాలేదు. అతని ముఖం సీరియస్‌గా మారింది. "ఊఁ" అన్నాడతను.

"ఎవరు చెప్పారు?" అన్నాను. అది మాట్లాడకుండా మళ్ళీ ఇల్లూడవ్వం మొదలుపెట్టింది. మళ్ళీ కాసేపుండి— 'ఆయనేమవుతారమ్మా మీకు—' అనడిగింది. 'ఎవరు?' అన్నాను చిరాగ్గా. అదే నిన్నటర్ధరాత్రొచ్చిన మనిషి— అందది. నాకిహ నవ్వాగలేదనుకోండి—" వనజ నవ్వడం ప్రారంభించింది.

సుబ్బారావు ఓపికగా ఆమె నవ్వు ముగిసేదాకా కూర్చు న్నాడు. "ఆ తర్వాతేమయిందో చెప్పు—" అన్నాడు.

"ఏమవడానికేముంది. మనింటి కెవ్వరూ రాలేదని చెప్పాను. చీమ చిటుక్కుమంటే లేస్తాను. అర్ధరాత్రి మనింటికి చుట్టమొస్తే తెలియకుండా ఉంటానా? మీరే చెప్పండి—" అంది వనజ.

వనజకు గట్టి నమ్మకం—తను చాలా మెలకువగా ఉండ గలనని. సుబ్బారావు ఎన్ని నిదర్శనాలు చూపించినా ఆమె నమ్మదు.

ఇప్పుడు సుబ్బారావుకి నవ్వొచ్చింది. "సరేలే—కానీ ఆ తర్వాతేమైంది—"

"అది ఓ పట్టాన నమ్మలేదు. లక్ష ప్రశ్న లేసింది. మీ చుట్టం తనొచ్చినట్లెవ్వరికీ చెప్పొద్దన్నాట్టగా. ఏదో పెట్టె ఇచ్చి దాచమన్నాట్టగా. అందుకే నాతో నిజం చెప్పడం లేదులెండి—అందది. నాకింక ఒళ్ళుమండి——ఏమిటీ ఎక్కువేతలు—అంత రహస్యంగా రావాల్సిన చుట్టా లెవ్వరూ మాకులేదు, మేమేమన్నా దొంగలనుకున్నావా?—అని దెబ్బలాడాను. అది తగ్గి—ఏదో పిచ్చిముండని, పిచ్చి వాగుడు వాగాను క్షమించండమ్మా—అనేసింది. దాని ఉంగరమూ దొరకలేదు. అది పెద్ద బాధపడ్డట్లూ అన్పించ లేదు."

"అంతేనా ఇంకా ఏదైనా జరిగిందా?"

"మధ్యాహ్నం మన పనిమనిషొచ్చినప్పుడడిగితే—అది ఎరువుకైతేమాత్రం ఉంగరం తెచ్చిపెట్టుకునే తాహా తెక్కడిదమ్మా నాకు—అనేసింది. జరిగింది చెబితేవిని— అదెవత్తో దొంగముండ యీంటుంది. ఇంట్లోంచేదైనా పట్టుకుపోయిందేమో చూసుకోండి - ఇది ఒక్క మనింట్లో మాత్రమే కాదు-చుట్టుపక్కల అది పనిచేసే రెండు మూడిళ్ళలోకూడా ఇలాగే జరిగిందట—" అంది వనజ.

సుబ్బారావుకు తెలిసిపోయింది. ఆ వచ్చిన ఆడమనిషి భయంకర్ విరోధుల ముఠాకు చెందినదై ఉంటుంది. అయితే వాళ్ళకింకా భయంకర్ రాత్రి ఏ ఇంటికి వెళ్ళాడన్నది తెలియదు. చెప్పుకోదగ్గ అదృష్టమేమిటంటే వనజకు బాగా నిద్రపట్టే అలవాటుండడం. అందువల్లే భయంకర్ వచ్చివెళ్ళిన సంగతే ఆమెకు తెలియదు.

"ఇంతకూ ఉంగరం వెతకడానికొచ్చిన ఆ ఆడమని షెలాగుంది?" అనడిగాడు సుబ్బారావు.

వనజ గుర్రుగా చూసింది భర్తవంక. "మీ బుద్ధి పోనిచ్చుకున్నారు కాదు. నేను చెప్పిన దాంట్లో మీకు కుతూహలం కలిగించిందా మనిషిరూపం ఒక్కటేనన్న నన్నమాట."

"ఛా. నీలాంటి అందమైన భార్యగా ఉండగా పని మనుషులకేసి చూస్తానని ఎలాగనుకున్నావ్?" అన్నాడు సుబ్బారావు లాలనగా.

"ఆ మనిషి మరీ అంత పనిమనిషిలా లేదు. కాస్త మాసిన బట్టలైతే కట్టుకుంది. కానీ మనిషి చాలా అందంగా ఉంది. చెప్పాలంటే సినిమాల్లో చూపిస్తారూ, హీరోయిన్‌ని పనిమనిషిగా. అలాగుంది."

సరే. ఎప్పుడో ఒకప్పుడామెను మళ్ళీ చూసే అవకాశం రాకపోదులే అనుకున్నాడు సుబ్బారావు.

## 4

"నా పేరు సుధ" అన్నదామె తీయగా.

సుబ్బారావు మరొక్క పర్యాయం ఆమెను పరీక్షించి చూశాడు.

నీలంరంగు చీర. అదే రంగు బ్లౌజు. నాజూకైన శరీరం.

అందమైన ముఖం. ఇరవైకి మించని వయసు. ఇవన్నీ కూడా ఆమెను ఆకరణీయంగా తయారుచేశాయి.

"వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ" అనడిగాడు సుబ్బారావు.

"ఈరోజు సాయంత్రం మా ఇంటికి టీకి రావాలి."

"మీ రెవరో నాకు తెలియదు. అటువంటప్పుడు..." నసిగాడు.

సుబ్బారావుకి ఆడపిల్ల ఆహ్వానాన్ని కాదనడం కష్టమే కానీ ఇది మరీ బొత్తిగా అర్థంలేకుండా ఉంది.

"నాకుమాత్రం మీరు తెలుసా? అయినా నేను ఆహ్వానించాను. నేను వయసులో ఉన్న ఆడపిల్లని. ఒంటరిగా ఇంట్లో ఉంటున్నదాన్ని. మీబోటి యువకుడి నాహ్వానించడంలో రిస్కు నాకే ఉందికానీ మీకేముంది?"

ఆ యువతి సుబ్బారావుకి ఒక చిన్న కాగితం అందించింది. "ఇది నా అడ్రస్. సాయంత్రం ఆరున్నర గంటలకు నా ఇంట్లో ఎదురుచూస్తుంటాను. తప్పక రాగలరని ఆశిస్తున్నాను" అని ఆమె వెనక్కు తిరిగింది.

ఆమె నడకలో ఒక సొగసు, కదలికలో ఒక సొగసు. ఎవరీ వయ్యారిభామ? అనుకున్నాడు సుబ్బారావు.

అతను అయిదుగంటలకు ఇంటికి వెళ్ళేసరికి అక్కడ ఒక కవరు అతనికోసం ఎదురుచూస్తోంది. అతనికది అందించి టిఫిన్ తేవడాని కింట్లోకి వెళ్ళింది వనజ.

సుబ్బారావు కవరు చింపి లోపలి కాగితం బయటకు తీశాడు. ఉత్తరం ఇంగ్లీషులో రాసి ఉంది. అది భయంకర్ రాశాడు. పెట్టె ఇచ్చి అప్పుడే మూడువారాలు దాటి పోయింది గదా అని అజాగ్రత్తగా ఉండవద్దనీ, తను పెట్టెను తీసుకువెళ్ళడాని ఎప్పుడో ఒకప్పుడు తిరిగి

రాగలననీ రాశాడతను. సుబ్బారావా ఉత్తరాన్ని జేబు లోకి తోసేశాడు.

"ఎక్కణించండీ ఉత్తరం!" టిఫిన్ తీసుకొచ్చి అడిగింది వనజ.

"ఆఫీసులోని నా కొలీగ్ రాశాడులే. ప్రస్తుతం అత నూళ్ళో లేడు. మామూలు ఉత్తరమే" అన్నాడు సుబ్బా రావు.

వనజకు ఇంగ్లీషు రాదు. చాలాసార్లు దానివల్ల నష్టాలు కనపడ్డా ప్రస్తుతం ప్రయోజనం కనపడిందతనికి.

టిఫిన్ తీసుకోవడమయేక అతను మళ్ళీ ట్రిమ్‌గా తయారవడం చూసి, "ఎక్కడికండోయ్ మళ్ళీ బయల్దేరు తున్నట్లున్నారు? నేనూ తయారుకావాలా?" అనడిగింది వనజ.

"లేదు. చిన్న పనిమీద వెడుతున్నాను. మళ్ళీ తొందర గానే వచ్చేస్తాను" అంటూ సుబ్బారావింట్లోంచి బయట పడ్డాడు.

# 5

అనొక చిన్న డాబా ఇల్లు. సుబ్బారావు వెళ్ళి తలుపు తట్టగానే తలుపు తీసింది సుధ. అతన్ని చూస్తూనే ఆమె కళ్ళలో వెలుగు కనపడింది. "రండి రండి. అనుకున్నదాని కంటె పదినిముషాలు ముందుగానే వచ్చేశారు" అందామె.

సుబ్బారావు లోపలకు నడిచాడు. ఆమె తలుపులు వేసింది.

అతను గదిని పరీక్షగా చూశాడు. సింపుల్‌గా ఉంది గది. గోడలో రెండు వర్ణచిత్రాలు, ఒక క్యాలెండరూ ఉన్నాయి. గదిలో నాలుగు కుర్చీలు. టీపాయ్ లేదు.

నేలంతా శుభ్రంగా తుడిచి ఉంది. ఒకపక్క కిటికీ మూడుపక్కల గుమ్మాలున్నాయి, అందులో ఒక గుమ్మం వీధిలోకి ఉంది. దాంట్లోంచే తనిప్పుడింట్లోకి వచ్చాడు.

"మీరు నాకో చిన్న సహాయం చేయాలి!" అంది సుధ.

"చెప్పండి. చేయగలిగినదైతే చేస్తాను" అన్నాడతను.

"నా భర్త తప్పిపోయారు!" అన్నదామె.

సుబ్బారావుకు నవ్వొచ్చింది. "ఎంత వయస్సుంటుంది మీ భర్తకు?" అన్నాడు.

"ఇరవై ఏడేళ్ళు" అంది సుధ.

"ఎలా తప్పిపోయారు?" అనడిగాడు సుబ్బారావు.

"ఆయనకు మతిభ్రమించింది..." అని కళ్ళనీళ్ళొత్తుకుంది సుధ.

సుబ్బారావు షాక్ తిని, "ఐసీ" అన్నాడు.

సుధ కాసేపు మౌనంగా ఉండిపోయింది.

"కాస్త వివరంగా చెప్పండి!" అన్నాడు సుబ్బారావు మౌనాన్ని భరించలేక.

సుధ గొంతు సవరించుకొని చెప్పడం మొదలుపెట్టింది. "మతిభ్రమణం అంటే పూర్తిగా పిచ్చి కాదు. సాధారణంగా మామూలుగానే మాట్లాడుతూంటారు. హఠాత్తుగా ఆయన మాట మారిపోతుంది' గంభీరంగా అయిపోయి సినిమాల్లో విలన్‌లా ప్రవర్తించడం మొదలుపెడతారు" ఒక్కనిమిషం ఆగిందామె.

సుబ్బారావు కుతూహలంగా వింటున్నాడు. సుధ మళ్ళీ చెప్పడం మొదలుపెట్టింది. "ఒకరోజు రాత్రి ఆయన నాతో సరదాగా కబుర్లు చెబుతున్నారు. ఉన్నట్లుండి నావంక చూసి మిస్ సుధా. నీ నంబరు గుర్తుందా

అనడిగారు. నాకర్థం కాలేదన్నాను. నా నంబరు నూట పదమూడని చెప్పి, పనిలో ఉన్నప్పుడెప్పుడూ ఈ నంబరునే గుర్తుంచుకోవాలి అన్నారు. నాకేం అర్థం కావటంలేదండీ అన్నాను. అండీ గిండీ అనకూడదు. బాస్ అనాలి అన్నారు. వేళాకోళమనుకున్నాను గానీ ఆయన సీరియస్‌గానే ఉన్నారు. మతిభ్రమణానికి సంబంధించి అదే మొదటిసంఘటన'' అంది సుధ.

''చాలా ఇంట్రస్టింగ్‌గా ఉంది కథ'' అన్నాడు సుబ్బారావు.

''వినేవాళ్ళకి కథలాగుంటుంది. వాస్తవంలో అనుభవిస్తున్న నాకిది కథకాదు వ్యథ'' అంది సుధ.

''సుధ-కథ-వ్యథ బాగుంది'' అన్నాడు సుబ్బారావు.

''నా విషయాన్ని మీరు సీరియస్‌గా తీసుకున్నట్లు లేదు'' అంది సుధ విచారంగా.

''ఇందులో నేను చేయగలిగినదేముంది చెప్పండి? నేను డాక్టర్నీ కాదు, డిటెక్టివునీ కాదు'' అన్నాడు సుబ్బారావు.

''నాకు సహాయం చేయడానికి, మీరీ ఇద్దరిలో ఏ ఒక్కరూ కానవసరం లేదు.''

''మరి...?'' అన్నాడు సుబ్బారావు.

''నేనుచెప్పేదిదయతో పూర్తిగా వినండి. అప్పట్నించీ ఆయన అప్పుడప్పు అదోలా ప్రవర్తిస్తూండేవారు. డాక్టర్ని కన్‌సల్ట్ చేశాను. అంతావిని డాక్టర్ ఇది మతిభ్రమణమని తాననుకోవడం లేదన్నారు. బుర్రబాగా వేడెక్కిపోతే కొంతమంది అలా ప్రవర్తించవచ్చునట. ఆ సంగతి చెప్పి ఆయన ఏవో మాత్రలిచ్చాడు. మా ఆయన స్పృహలో

ఉన్నప్పుడాయన విపరీత ప్రవర్తన గురించి చెప్పవద్దన్నాడు డాక్టర్."

"అంటే ఆయన రెండు దశల్లో జీవిస్తున్నాడన్న మాట" అన్నాను.

"అవును. ఆయన్ను వెయ్యికళ్ళతో కనిపెట్టుకొంటున్నాను. ఒకరోజు రాత్రి ఆయన లేచి చిన్న బ్రీఫ్ కేసు సర్దుతూ కనిపించారు. ఏమిటండీ అనడిగాను. అండీకాదు బాస్ అనాలన్నారు. తనప్పుడు అర్జంటు వ్యవహారంమీద బయటకు వెళ్ళాలట. బ్రీఫ్ కేసు తాళంవేసి తాళంచెవి నాచేతి కిచ్చారు. ఇది చాలా స్పెషల్ తాళం. జాగ్రత్తగా దాచి ఉంచు. ఈ పెట్టెను నేను మరో ఇంట్లో దాస్తాను, అన్నారు. ఆయన్నాపడానికి ప్రయత్నించాను, ఆగలేదు. చివరకు నన్ను తోసేసి వీధితలుపులు వేసేసి వెళ్ళిపోయారు. మళ్ళీ తెల్లవారుఝామున నాలుగ్గంటలకు తిరిగొచ్చారు. మాట్లాడకుండా పడుకున్నారు" సుధ ఆగింది.

సుబ్బారావు కేదో అనుమానం కలిగింది. "ఆ తర్వాతేమైంది?" అనడిగాడు.

"ఉదయం లేచారు. టిఫిన్ చేశాక ఇద్దరం బజారు కెళ్ళాం. బజార్లో విపరీతమైన రష్ గా ఉంది. ఆ రష్‌లో ఇద్దరం సెపరేట్ అయ్యాం. ఇప్పటికి మూడువారాలు గడిచింది. ఆయన ఐపులేరు" సుధ మళ్ళీ కన్నీళ్ళొత్తుకుంది.

"చాలా విచిత్రంగా ఉంది మీ కథ" అన్నాడు సుబ్బారావు.

"ఇది విచిత్రమైన కథ కాదు. విషాదభరితమైనది" అంటూ నిట్టూర్చింది సుధ. "మావారు మాయం కావడానికి

సంబంధించినంతవరకూ ఒక్కటే ఆధారం నాకు. ఆ రాత్రి ఇంటికి తిరిగొచ్చేక ఆయన జేబులో ఒక ఎడ్రస్ ఉంది. అది మీది!'' అంది.

''ఆశ్చర్యంగా ఉందే!'' అన్నాడు సుబ్బారావు.

''మీకూ మావారికీ ఏదో పరిచయముండి ఉండాలి'' అంది సుధ.

''ఇంతకీ మీ ఆయన పేరేమిటి?'' అన్నాడు సుబ్బారావు.

''సూర్యనారాయణ'' అంది సుధ. ''ఆయన ఫోటో కూడా తీసుకొస్తానుండండి'' అంటూ ఆమె లోపలకు వెళ్ళింది.

సుబ్బారావు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అతని బుర్రలో ఏదో అనుమానం మెదిలింది.

సుధ ఒక ఫోటో తీసుకొచ్చింది. సుబ్బారావు అనుకున్నట్లుగానే అది భయంకర్ ఫోటో. ఆమె ఫోటో అతనికి చూపించి, అతని ముఖంలో మార్పులు చూస్తూ కూర్చుంది.

''ఇతనెవరో నాకు తెలియదు'' అన్నాడు సుబ్బారావు.

సుధ నిట్టూర్చింది. ''మీకు తెలుసని నా నమ్మకం. ఆయన తీసుకెళ్ళిన బ్రీఫ్ కేస్ తాళం నా దగ్గరుంది. అందులో ఏం పట్టుకుపోయారో తెలియడంలేదు. ఆ పెట్టె, ఆయన ఎక్కడుందో చెప్పడం మీ వల్లనే అవుతుందని నా నమ్మకం.''

''ఈ విషయంలో మీకు సహాయపడగలిగింది పోలీసు లొక్కరే'' అంటూ లేచాడు సుబ్బారావు. సుధ అవాక్కయిపోయింది,

# 6

"చూశారు కదమ్మా. ఇది చాలా పెద్ద గిన్నె. కనీసం మరో చీరయినా ఇస్తేకానీ..." అన్నాడు స్టీలుసామాన్ల వాడు.

కాసేపు వాదించిచూసి వాడివ్వడని రూఢిచేసుకుంది వనజ. అప్పుడామె మూడో చీర తీయడంకోసం మళ్ళీ ట్రంకు తెరిచింది. ట్రంక్‌లో పైన దుప్పట్లున్నాయి. అవి వాడు తీసుకోడు. కాస్త అటూ ఇటూ కెలికి చూసింది. బట్టలన్నీ బైటకు లాగింది. మూడో చీర ఆమెకు దొరికింది కానీ అంతకంటె ఆశ్చర్యాన్ని కలిగించే వస్తువు కనపడిం దామెకు. తళతళ మెరిసే చిన్న బ్రీఫ్ కేస్!

వనజ తాత్కాలికంగా తన కుతూహలాన్నణచుకుని, స్టీలుసామానువాడి దగ్గర బేరం ముగించి గిన్నె తీసుకుంది. వాణ్ణి ,పంపించేశాక ఆమె ఆ బ్రీఫ్ కేసును ట్రంకులోంచి బయటకు తీసింది.

దాన్ని చూస్తూంటే ఆమెకు చాలా ఆశ్చర్యంగా వుంది.

ఎక్కడిదీ బ్రీఫ్ కేస్? ఎలావచ్చిందది తమ ఇంట్లోకి? అయినా ఇంతమంచి బ్రీఫ్ కేస్‌ని పాతగుడ్డల పెట్టెలో ఎవరుంచారు? పెట్టె కాళీదనుకుందామా అంటే చాలా బరువుగా ఉంది. ఏముందో అందులో?

వనజ ఎక్కువసేపు ఆలోచించకుండా పెట్టెను తెరవ డానికి ప్రయత్నించింది. కానీ ఆ పెట్టె తెరుచుకో లేదు.

ఏముందో ఆ బ్రీఫ్ కేసులో ఎవరుంచారో దాన్నక్కడ?

'వనజ అనుమానం భర్తమీదకే పోయింది. తనకు తెలియకుండా అతనే అక్కడుంచి ఉండాలి. మరెవ్వరికీ

అటువంటి అవకాశంలేదు.

ఆమెకు భర్తమీద కోపం కూడా వచ్చింది.

ఎక్కడిదా పెట్టె? అందులో ఏముంది? ఇవే ప్రశ్న లామెను వేధిస్తున్నారు. వంటింట్లోకి వెళ్ళి ఒక పర్యాయం అట్లకాడ తీసుకువచ్చి పెట్టె తెరవగలనేమోనని చూపింది. కానీ పని జరగలేదు.

ఏమీ పాలుపోక ఆలోచిస్తున్న సమయంలో ఎవరో తలుపుతట్టిన చప్పుడయ్యింది. వనజ చటుక్కున బ్రీఫ్ కేసును మళ్ళీ ట్రంకులో ఉంచి పైన బట్టలు సర్దేసి, మూత వేసి, వచ్చి వీధితలుపు తీసింది.

ఎదురుగా ఒక ఆధునిక యువతి. వనజను చూసి దెబ్బ తిన్నట్లు కనబడింది. ఆమె "అయామ్‌సారీ. ఇది సుబ్బా రావుగా రిల్లనుకున్నాను" అంది.

"అవును. ఇది సుబ్బారావుగారిల్లే!" అంది వనజ.

"లోపలకు రావచ్చా" అనడిగిందామె. ఆ ప్రశ్నలో ఆమె సంస్కారం ఉట్టిపడుతోంది.

"రండి" అంటూ ఆహ్వానించింది వనజ.

ఆమె కాషాయరంగు బెల్‌బాటం వేసుకుంది. చెవులకు పెద్దసైజు రింగులు. కళ్ళు ముక్కు అన్నీ తీర్చిదిద్దినట్లు న్నాయి. చాలా అందమైనదని ఆడదైన వనజకే అనిపించింది.

ఆమె కూర్చుంది. "మీ పేరు?" అడిగింది వనజ.

ఆమె చాలా అందంగా నవ్వి, "సుధ!" అంది.

రూపానికి తగ్గ పేరు, అనుకుంది వనజ.

సుధ చుట్టూ పరిశీలించి చూస్తూ, "తనకో చెల్లెలున్నట్లు సుబ్బు నాకెన్నడూ చెప్పలేదే!" అంది.

సుబ్బు అన్న పదం వింతగా తోచి, “సుబ్బెవరు?” అనడిగింది వనజ.

సుధ ముఖం ఎర్రనయింది. “అది సుబ్బారావుగారికి నేను పెట్టుకున్న ముద్దుపేరులెండి” అంది సిగ్గుపడుతూ.

ఉలిక్కిపడింది వనజ. “సుబ్బారావుగారిని మీరు ముద్దుపేరుతో పిలుస్తూంటారా? మీకూ వారికీ ఏమిటి సంబంధం?’”

సుధ చలించలేదు. “అది మీ కెందుకులెండికానీ- అతనికి చెల్లెలున్నట్లు నా కింతవరకూ తెలియదు.”

“సుబ్బారావుగారికి ఒక్కరేం కర్మ ముగ్గురు చెల్లెళ్ళున్నారు ముగ్గురికీ పెళ్ళిళ్ళు కూడా అయిపోయాయి” అంది వనజ.

“ఐసీ. అయితే మీరు మీ వారితో కలిసే ఇక్కడి కొచ్చారా?” అడిగింది సుధ.

“మా వారిక్కడికి రావడమేం కర్మ. ఆయన ఇక్కడే ఉంటున్నారు” అంది వనజ, సుధ మాటలు సరిగ్గా అర్థం కాకపోగా.

“ఐసీ. అయితే మీరు మీ అన్నగారింట్లో ఉంటున్నారన్నమాట” అంది సుధ తాపీగా.

“ఇది మా అన్నగారిల్లుకాదు. మా ఇల్లే” అంది వనజ చిరాగ్గా.

“ఓహ్. అయితే సుబ్బే ఇక్కడుంటున్నాడన్నమాట. మాటవరసకైనా తన చెల్లెలింట్లో ఉంటున్నట్లు నాకు చెప్పలేదే. ఈరోజు సాయంత్రం కలుసుకున్నప్పుడు అడగాలి” అంది సుధ స్వగతంలా.

ఈసారి వనజకు కథ కొంతవరకూ అర్థమైంది. ఆమె మ్రాన్పడిపోయింది. ఎవరీ సుధ? తన భర్తను సుబ్బు అనే

చనువెలా వచ్చిందిమెకు? తరచుగా ఇద్దరూ కలుసు కుంటూ ఉంటారా?

సుధ చాలా అందంగా ఉంది. తనకంటె కూడా! ఈ సుధ ఆకర్షణకు లోనయ్యాడా? లేక సుధ తన భర్తవల్ల మోసగించబడుతోందా?

"ఈరోజు సాయంత్రం మీరు సుబ్బారావుగారిని కలుసుకుంటారా?" అనడిగింది వనజ.

"అవును" అంది సుధ కాస్త సిగ్గుపడుతూ.

"అయితే ఇప్పుడు సుబ్బారావుగారింటి కెందుకు వచ్చినట్లు? ఇది ఆయన ఆఫీసులో ఉండే టైమని తెలుసు గదా."

సుధ తడబడింది. "ఆఫీసుకు వెడితే చెప్పారు. అడ్రస్ తీసుకుని ఇంటికి వచ్చాను. సెలవు పెట్టడానికి కారణ మేమిటో తెలుసుకుని సాయంత్రం కార్యక్రమం సంగతి రూఢిచేసుకుందామని వచ్చాను."

"ఏమిటి మీ కార్యక్రమం?" అంది వనజ కాస్త దురుసుగా.

"అది మా వ్యక్తిగత విషయం" అంది సుధ దాట వేస్తున్నట్లు.

"సుబ్బారావుగారికి సంబంధించిన ఏ విషయమైనా నాకూ వ్యక్తిగతమైనదే అవుతుంది. చెప్పండి" అంది వనజ.

సుధ చిరుకోపంతో వనజను చూసి, "మీకు తెలియ దనుకుంటాను. చెల్లెలి అధికారాలు అన్నపై కలకాలం నిలబడవు. నేను అతనికి కాబోయే భార్యను" అంది.

ఉలిక్కిపడింది వనజ. అంతలోనే తేరుకుని, "అయితే

నేను వారి భార్యనన్న సంగతి మీకు తెలియదన్నమాట"
అంది.

ఈసారి ఉలిక్కిపడడం సుధ వంతయింది. ఆమె నమ్మలేనట్లు వనజవంక చూసి, "సుబ్బుకు పెళ్ళయిందా?" అంది ఆశ్చర్యంగా.

"పెళ్ళవడమేకాదు. కాపురం పెట్టి ఏడాది పూర్తయింది కూడా" అంది వనజ.

సుధ రెండు చేతుల్లోటి ముఖం కప్పుకుంది. "నేను నమ్మలేను" అంటూ గొణుక్కుంది.

వనజ విసురుగా లోపలకు వెళ్ళింది. ఒక ఫోటో ఆల్బంతో తిరిగివచ్చిందామె. సుధకు అందిస్తూ, "ఇవి చూడండి. మీరు నమ్మగలుగుతారు" అంది.

ఆ ఆల్బంనిండా సుబ్బారావు, వనజల పెళ్ళి ఫోటోలున్నాయి.

"ఇప్పటికీ నమ్మడం కష్టంగానే ఉంది. అమాయకంగా కనిపించే సుబ్బారావు ముఖంచూస్తే అతను నాకింత ద్రోహం తలపెడతాడనుకోలేకపోతున్నాను."

ఈ పర్యాయం వనజ కాస్త జాలిగా సుధవంక చూసి, "మగవాళ్ళెప్పుడూ అంతే. మీకుమాత్రమే కాదు, నాకూ ద్రోహం చేశారు. ఇప్పట్నుంచైనా జాగ్రత్తగా వుండండి" అంది.

"ఇంక జాగ్రత్తేమిటి? నా కడుపులో పెరుగుతున్న బిడ్డగతి ఏంకావాలి?" సుధ వెక్కి వెక్కి ఏడ్వడం మొదలు పెట్టింది.

అంత అందమైన, ఆధునిక యువతి అలా ఏడుస్తూంటే ఏదోలా అనిపించింది వనజకు. దుఃఖానికి వేషభాషలతోటి, నిమిత్తంలేదు కదా అనుకుంది.

"పెళ్ళికి వాయిదామీద వాయిదా వేస్తూంటే ఏమిటో అనుకున్నాను. ఇదన్నమాట కారణం" అంది సుధ మళ్ళీ ఏడుస్తూ.

వనజ మాట్లాడలేదు. తనుండగా సుబ్బారావు పర స్త్రీతో సంపర్కం పెట్టుకున్నాడన్న భావన ఆమెకు కంపరాన్ని కలిగిస్తోంది. ఆమె దృష్టిలో కూడా సుబ్బా రావు అమాయకుడు మరి!

సుధ కళ్ళు తుడుచుకుంది. "ఈ వేళ్టికి సరిగ్గా 24 రోజులక్రితం నా పుట్టినరోజుకు సుబ్బారావు బహూక రించిన డ్రస్ ఇది. అతను చెప్పిన ప్రకారం ఈ నెలలో మా పెళ్ళికావాలి. ఆరోజు నేను అతనికి ఒక బ్రీఫ్‌కేస్ బహూకరించాను. అందులో ఏముందో అతనికి చెప్పలేదు. తాళంవేసి, తాళం నా దగ్గరుంచుకున్నాను. నా ప్రేమ కానుకను భద్రంగా దాచుకోమని చెప్పాను. పెళ్ళిరోజున ఆ పెట్టి తాళం తీస్తానని చెప్పాను. వివాహమయ్యేవరకూ పెట్టి అతనివద్దా, తాళం నావద్దా వివాహమయ్యేక రెండూ ఇద్దరివద్దా!" సుధ నిట్టూర్చి, "ఇంక ఆ పెట్టి తెరవబడదు మూసుకుపోయిన నా హృదయకవాటానికి మల్లే" అంది.

వనజ ఆశ్చర్యంగా, "అయితే ఆ బ్రీఫ్‌కేస్ మీ రిచ్చిం దన్నమాట!" అంది.

సుధ కళ్ళు మెరిశాయి. "సుబ్బారావు మీకు చూపిం చాడా. దాన్ని మీరు చూసేరా?" అనడిగింది గబగబా.

వనజకు ఆవేశం వచ్చింది. "నా కెందుకు చూపిస్తారు? చూపిస్తే తన తప్పు బయటపడదూ. నాకు తెలియకుండా పాతబట్టల పెట్టిలో దాచేశారు. ఈవేళే అది బయట పడింది, స్టీలుసామాను వాడికి పాతబట్ట లిద్దామను కుంటూండగా."

"ఊఁ" అంది సుధ ఆత్రుతగా.

"అందులో ఏముందోనన్న కుతూహలంకొద్దీ తెరవ డానికి ప్రయత్నించాను. ఏ తాళానికీ తెరుచుకోలేదు. ఆఖరికి అట్లకాడతో కూడా ప్రయత్నించాను" అంది వనజ.

"దాని తాళం నా దగ్గరుంది. మీకెలా వస్తుంది?" అంది సుధ.

"ఏముందండీ ఆ పెట్లో?" కుతూహలంగా అడిగింది వనజ.

"ఏముంటే ఎందుకులెండి. నా తొలిప్రేమ కానుక అనర్హుడి చేతికి వెళ్ళింది. కనీసం మీ ధర్మమా అని అది నాకు తిరిగి చేరితే చాలు" అంది సుధ తిరిగి మామూలుగా.

వనజ ఇంట్లోకివెళ్ళి ఓ బ్రీఫ్ కేఫ్ తీసుకొచ్చింది. "దీని కథ తెలిసిన క్షణంనించీ నాకు గుండెలమీద కుంపట్లా ఉంది. మీ కిచ్చేయడానికి నాకేం అభ్యంతరంలేదు. కానీ ఇందులో ఏమున్నదీ చూడగోరుతున్నాను. ఒక్కసారి మీ దగ్గరున్న తాళంతో తెరిచి లోపలున్నది చూపిస్తారా?"

సుధ వ్యథతో కూడిన చిరునవ్వొకటి నవ్వి, "అందులో చూపించడానికేముందిలెండి. సుబ్బుకోసం ఒక సూట్ కుట్టించాను. మా పెళ్ళిరోజున వేసుకుంటాడని మనసు పడ్డాను. అదే ఆ బ్రీఫ్ కేసులో ఉన్నది" అంది.

"కానీ బ్రీఫ్ కేస్ చాలా బరువుగా ఉంది. సూట్ అంత బరువుగా ఉంటుందా?" అంది వనజ ఆశ్చర్యంగా.

సుధ చిరాగ్గా ముఖంపెట్టి, "ఏం బరువండీ. ఇక ముందున్న నా జీవితంకంటె బరువుగా ఉండదు" అంది.

వనజ కాస్సేపు ఆలోచించింది.

"నా భర్త వేసిన తప్పటడుగుకు ఏకైక సాక్ష్యం ఈ బ్రీఫ్ కేస్. దీన్ని ఎదుటబెట్టి ఆయన్ను రాత్రి నాలుగూ

దులిపేయాలి. మీరూ నా దగ్గరకు వచ్చినట్లు సాక్ష్యంగా మీ దగ్గరున్న తాళంకూడా ఇవ్వండి'' అంది వనజ.

సుధ ముఖం పాలిపోయింది. "నా మూలంగా మీ ఇంట్లో రభస జరగడం నా కిష్టంలేదు. నేను చెప్పినవన్నీ మీరు మరిచిపొండి.ఆ పెట్టె తీసుకుని నేనూ వెళ్ళిపోతాను. మన ముగ్గురం ఒకచోట కలవడం కానీ, నేను సుబ్బును కలుసుకోవడం కానీ మరి జరుగదని హామీ ఇస్తున్నాను."

"పెట్టె మీకు తప్పకుండా నేను ఇస్తాను. ఈ ఒక్క రోజుకూ నా దగ్గరుంటుంది. మీరు తాళంచెవి మాత్రం నాకిచ్చి వెళ్ళండి!'' అంది వనజ.

సుధ అదోరకంగా నవ్వి, "సుబ్బును కలుసుకుందామని వచ్చానుగానీ, ఈ కథంతా వింటాననీ, నా బ్రీఫ్ కేసును తీసుకుపోవలసి ఉంటుందనీ నేనూహించలేదు కదా, కూడా నేను తాళంచెవి తీసుకురాలేదు'' అంది.

"అయితే ఒక పనిచేయండి. రాత్రి ఎనిమిదిగంటలకు మీరు తాళం తీసుకుని మా ఇంటికి రండి. మిమ్మల్నెదురుగా పెట్టుకుని కడిగిపారేస్తాను. ముందు ముందు మరెన్నడూ ఆయన తప్పటడుగు వేయకుండా ఉండాలంటే- మీరు నాకీ మాత్రపు సహాయం చేయాల్సుంటుంది."

సుధ అసహనంగా, ఇబ్బందిగా కదిలింది. వనజ గమనించలేదు కానీ ఆమె కన్నుల్లో కొద్దిగా కోపచిహ్నాలు కూడా ఏర్పడ్డాయి. "ప్రస్తుతం నా మనసు వికలమైపోయింది. ఇంక నేనీ ఊళ్ళో క్షణంకూడా ఉండలేను. ఇంటికివెళ్ళి, సామాను సర్దుకుని వెళ్ళిపోదల్చుకున్నాను. మళ్ళీ మీ ఇంటికి రాలేను."

వనజ అదోలా నవ్వింది. "మీ ప్రేమ కానుకను

వెనక్కి తీసుకువెళ్ళాలంటే ఈ వేళ రాత్రి ఎనిమిది గంటలకు రండి. అవసరం లేదనుకుంటే రాకండి. రేపు మధ్యాహ్నం పన్నెండుగంటలకి, ఈ పెట్టెను నేనే స్వయంగా కిరసనాయిలు పోసి తగలెట్టేస్తాను'' అంది.

సుధ ఏమిటో ఆలోచిస్తూంది. ఇంతలో వీధితలుపులు తోసుకుని ఎవరో వచ్చారు. "ఎవరో చుట్టాలొచ్చినట్లున్నారు వనజమ్మా'' అంటూ.

వచ్చినావిడ పొరుగింటి పద్మావతి. సుధ మరక్కడ ఉండలేదు. మళ్ళీ వస్తానని సెలవు తీసుకుంది.

## 7

"మధ్యాహ్నం సుధ అనే అమ్మాయి వచ్చింది. మీకు పెళ్ళికాలేదనుకుని మిమ్మల్ని ప్రేమించి మోసపోయినట్లు నన్ను చూశాకనే ఆమెకు తెలిసింది. తను మీకు ప్రేమ కానుకగా ఇచ్చిన బ్రీఫ్ కేస్‌ను వెనక్కి తీసుకుపోవాలని ఆమె కోరిక. పాతబట్టలు ఇచ్చి స్టీలుసామాను కొనడానికి ట్రంకుపెట్టి తెరిస్తే అందులో నాకు తెలీకుండా మీరు దాచిపెట్టిన బ్రీఫ్ కేసు కళ్ళబడింది. అందువల్లఆ బ్రీఫ్ కేసు వివరాలు నాకు తెలుసును. వెంటనే ఆమెకు దాన్ని చూపించాను'' వనజ కోపంగా భర్తతో చెబుతూవుండగా సుబ్బారావు కంగారుపడి—

"అయితే కొంపదీసి ఆ బ్రీఫ్ కేస్ ఆమెకు ఇచ్చేశావేమిటి?'' అన్నాడు.

"ఇవ్వలేదు. అదింకా మనింట్లోనే ఉంది'' అని వనజ ఇంకా ఏదో అనబోతూండగా సుబ్బారావు చటుక్కున ఆమెను దగ్గరగా లాక్కుని ముఖంనిండా ముద్దులతో నింపేసి, "నువ్వెంత తెలివైనదానివి. ఆ బ్రీఫ్ కేసును ఇచ్చేయకుండా ఉంచావు'' అన్నాడు సంతోషంగా.

వనజ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "అవునండి. అది ప్రేమకానుకగా ఇచ్చిన వస్తువు. ఇంట్లోంచి ఇంకా పోలేదని మీకు సంతోషంగా ఉంది."

సుబ్బారావు ఉలిక్కిపడ్డాడు. అతను సావధానంగా ఆమె చెప్పినది విని, తనకు తెలిసినవన్నీ వివరంగా ఆమెకు చెప్పాడు. వనజ ముందో పట్టాన నమ్మలేదు. చివరకు కూడా సగం సగమే నమ్మింది.

"నువ్వు నమ్ము, నమ్మకపో, జరిగిందిది. ఆ బ్రీఫ్‌కేస్ కోసం సుధ ప్రయత్నిస్తోంది. ఇంతకాలం దాని ఆచోకీ తెలియదు. ఇప్పుడు నీ మూలంగా తెలిసిపోయింది. నా అభిప్రాయంలో ఆమె భయంకర్ శత్రువర్గానికి చెందినది. బహుశా ఈ రాత్రి దాడి జరిగినా జరగవచ్చు. జాగ్రత్తగా ఉండాలి మనం," అన్నాడు సుబ్బారావు—

వనజ ముఖంలో భయం స్పష్టంగా కనబడింది. ఒక్కక్షణం ఆలోచించి, "నిజాన్ని చాలాకాలం మీరు దాచిపెట్టటంవల్లనే ఇలా జరిగింది. ముందే నాకు అన్ని విషయాలూ చెప్పివుంటే ఏ ఇబ్బందీ ఉండివుండేది కాదు. ఇప్పుడేంచేయాలో మీరే చెప్పండి" అంది.

సుబ్బారావు ఆలోచించాడు. "ఆఁ మంచి ఐడియా" అన్నాడు. వనజ అతనివంక కుతూహలంగా చూసింది.

"మనకు కాస్త ఖర్చవుతుంది. కానీ గత్యంతరం లేదు. ఇప్పుడింకా టైము ఆరుగంటలు దాటలేదుకదా. బజారుకు వెళ్ళి ఇలాంటిదే బ్రీఫ్‌కేసు ఒకటి కొందాం. దాన్నిండా రాళ్ళునింపి షెల్ఫ్లో ఉంచుదాం. రెండో బ్రీఫ్‌కేస్ మాత్రం జాగ్రత్తగా రహస్యంగా దాచి ఉంచుదాం."

"బాగానే ఉంది కానీ, ఖరీదెంతుంటుందో ఏమో" అంది వనజ.

"ఎవరైకి లోపుండదు" అన్నాడు సుబ్బారావు పెదిమ విరిచి.

"నైలెక్స్ చీర వస్తుంది" అంది వనజ బాధగా.

"ఏంచేస్తాం. నువ్వు చీరలిచ్చి స్టీలుసామాను కొనడం వల్ల ఈ ఇబ్బందొచ్చింది. అదికూడా స్టీలుసామాను కిచ్చానని సరిపెట్టుకో" అన్నాడు సుబ్బారావు.

ఇద్దరూ కాసేపు బాధపడ్డారు.

"మరి బజారుకు నేనూ రానా?" అంది వనజ.

"వస్తే బ్రీఫ్ కేస్‌ను కాపలా ఎవరు కాస్తారు?" అన్నాడు సుబ్బారావు.

"అమ్మబాబోయ్. ఎవరైనా మీరులేని సమయంలో వచ్చివెడితే నేనేం చేయాలి?"

"అలా భయపడకు. దొంగల్లాంటి వారెవరైనా రావాలంటే కాస్త చీకటి పడాలి. ఆ టైముకి నే నెలాగూ వస్తాను."

వనజకు అంత తృప్తికరంగాలేదు. "పోనీ, బ్రీఫ్ కేస్‌ను మనం కూడా తీసుకుపోతే" అంది.

"అది చాలా ప్రమాదం. ఎవరు వచ్చినా నువ్వు తలుపు తీయకు."

సుబ్బారావు ఇంట్లోంచి బయటపడ్డాడు. వనజ తలుపుకు గడియపెట్టి వరండాలోనే కూర్చుంది.

వనజకు ఏమీ తోచటంలేదు. ఆ పెట్టెలో ఏముందో చూడాలనిపించింది. బ్రీఫ్ కేసుని తీసి, పెట్టె తెరువడానికి చాలా ప్రయత్నించింది. కాని అది తెరుచుకోలేదు.

సాధారణంగా ఇలాంటి పెట్టెలకు ఎక్కడో చిన్న మీటలుంటాయని ఎవరో అనటం గుర్తొచ్చింది వనజకు.

హాండిల్ ప్రాంతంలో అటూ ఇటూ చేత్తో తడవడం మొదలుపెట్టింది.

హఠాత్తుగా బ్రీఫ్ కేస్ మూత తెరుచుకుంది. ఉలిక్కిపడి పెట్టెను జారవిడిచింది.

వనజ కళ్ళు చెదిరిపోయాయి.

బ్రీఫ్ కేస్ నిండా వందరూపాయల నోట్లకట్టలు. బహుశా ఇరవై లక్షలదాకా ఉండి ఉండవచ్చు.

అంతలో– ఎవరో వీధితలుపు తట్టారు. వనజ ఉలిక్కిపడింది. గబగబా బ్రీఫ్ కేసును సర్ది దాచేసింది. ఊపిరి బిగపట్టుకు కూర్చుంది. ఎవరో తలుపు ఇంకా తడుతూనే ఉన్నారు.

అయిదు నిముషాలు గడిచాయి. వనజకు ఓపిక నశించింది కానీ అవతలి వ్యక్తి ఇంకా తలుపు తడుతూండడం జరుగుతూనే ఉంది.

"ఎవరూ?" అని అరిచింది వనజ చిరాగ్గా. ఆ చిరాకు వెనుక చిరు భయంకూడా ఉంది.

సమాధానం రాలేదు. తలుపుమాత్రం మరి కాస్త గట్టిగా తట్టడం జరిగింది.

భయంవేసింది వనజకు. ఏంచేయాలో పాలుపోలేదు. ఏమైతే అయిందని ధైర్యంచేసి వెళ్ళి తలుపు తీసింది.

ఒక వ్యక్తి లోపలకువస్తూ, "సుబ్బారావుగారున్నారాండీ!" అన్నాడు.

చూడ్డానికి మనిషి మర్యాదస్తుడల్లే ఉన్నాడు. వయసు కూడా ముప్పై దాటదు. అతనెవరా అని ఆలోచిస్తూనే వనజ, "లేరండీ!" అంది.

"ఇప్పుడు వచ్చేస్తారా?"

"ఇంక వచ్చే టయిమవుతోందండి" అంది వనజ.

"ఆయనతో చాలా ముఖ్యమైన పనుందండీ. వచ్చే దాకా కూర్చుంటాను" అన్నాడతను.

"ఇంట్లో ఇంకెవ్వరూ లేరండీ" అంది వనజ ఇబ్బందిగా.

"మీరున్నారుగదా చెల్లాయి" అన్నాడతను. అతను చెల్లాయి అని పదం ఉచ్ఛరించిన తీరు చాలాబాగుంది. అంగులో ఆప్యాయత ఉట్టిపడుతోంది.

వనజకు అభ్యంతరం పెట్టాలనిపించలేదు. "రండి. లోపలకు!" అందామె.

అతను లోపలకువచ్చి సోఫాలో కూర్చున్నాడు.

"మీ పేరు?" అడిగింది వనజ.

"భయంకర్!" అన్నాడతను సోఫాలో వెనక్కు జారగిలబడుతూ.

# 8

సుబ్బారావు తిన్నగా సూట్ కేసులమ్మే షాపుకు వెళ్ళాడు. అదృష్టవశాత్తూ అతనికి తను కోరుకున్నలాంటి బ్రీఫ్ కేస్ కళ్ళబడింది. సుబ్బారావు దాన్ని పరిశీలించి చూశాడు. చూడ్డానికి అచ్చం అలాగే ఉంది.

"ఎంత?" అడిగాడు సుబ్బారావు.

"తొంభై రెండ్రూపాయలు" అన్నాడు షాపువాడు.

"టూమచ్" అన్నాడు సుబ్బారావు.

షాపువాడు నవ్వాడు. "ఇది మామూలు బ్రీఫ్ కేస్ కాదు సారు. ఒకసారి మూసేసేరంటే తెరవడానికి దీని తాళంతో తప్ప సాధ్యంకాదు. మరే తాళంతోనూ తెరవలేరు. తర్వాత దీనికొక స్పెషల్ బటన్ ఉంటుంది. అది నొక్కితే ఎప్పుడైనా తెరవగలుగుతారు."

"ఎక్కడుంది ఆ స్పెషల్ బటన్" అన్నాడు సుబ్బారావు ఆసక్తిని చూపిస్తూ.

"అది మాకూ తెలియదు. ఈ బ్రీఫ్ కేసుతోపాటు ఒక సీల్డు కవర్ మాకు వస్తుంది. అందులో దాని వివరాలుంటాయి. కొనుక్కున్నవాడికి తప్ప మరెవ్వరికీ ఆ వివరాలు తెలియకూడదని మ్యానుఫాక్చరర్స్ ఉద్దేశ్యం."

"చాలా బాగుంది కానీ, ఇలాంటి బ్రీఫ్ కేసులు చాలా తయారవుతున్నాయి గదా. అప్పుడు చాలామందికి రహశ్యం తెలిసిపోదూ."

"అన్నింటికీ ఒకటే సీక్రెట్ అయితే మరి సీల్డుకవరు కూడా ఎందుకుసార్. ప్రతి బ్రీఫ్ కేసుకూ ఒక కొత్తరకం ఏర్పాటుంటుంది" అన్నాడు షాపువాడు గర్వంగా.

బేరమాడగా రెండ్రూపాయలు తగ్గించాడు షాపువాడు. సుబ్బారావు సీల్డుకవర్ తీసుకున్నాక, "పరీక్షించాలనుకుంటే, మీరు ట్రయల్ రూంలోకి వెళ్ళవచ్చు" అంటూ దారిచూపించాడు షాపువాడు.

సుబ్బారావు ట్రయల్ రూంలో సీల్డుకవర్ తెరిచాడు. దాంట్లో వివరాల ప్రకారం, పెట్టె అడుగున నేలమీద ఆనుకోవడంకోసం ఉన్న నాలుగు సపోర్ట్సులోనూ ఒక దాంట్లో ఉంది స్పెషల్ బటన్. అది నొక్కగానే బ్రీఫ్ కేస్ తెరుచుకుంది.

"చాలా బాగుంది" అనుకున్నాడు సుబ్బారావు. లోపల ఉన్న ప్యాకింగ్ మెటీరియల్ని అలాగే ఉంచి, మరో అయిదురూపాయలు వెచ్చించి కాగితాలు వగైరాలు కొని దాన్ని నింపాడు. ప్యాకింగ్ మెటీరియలూ, తెల్ల కాగితాలూ కలిపి పెట్టె కాస్త బరువుగానే ఉంది.

సుబ్బారావు షాపులోంచి బయటకు రాగానే, ఒక రిక్షావాడు పలకరించాడు, "రిక్షాకావాలా బాబూ" అని.

తను వెళ్ళవలసిన చోటు చెప్పాడు సుబ్బారావు.

"అర్థరూపాయిప్పించండి బాబూ" అన్నాడు రిక్షావాడు.

సుబ్బారావు ఆశ్చర్యపడ్డాడు. దూరం మరీ ఎక్కువ కాకపోయినా ఎవడూ రూపాయకి తక్కువ కట్టడు తన ఇంటికి. తను చెప్పినది వాడు సరిగ్గానే విన్నాడని మరో సారి అడిగి రూఢి చేసుకున్నాక సుబ్బారావు రిక్షా ఎక్కాడు.

ఈరోజు రాత్రి చాలా పెద్ద విశేషమే జరగవచ్చునని సుబ్బారావుకు తోస్తోంది. ఇంటిదగ్గర పాపం వనజ ఒక్కత్తీ ఉంది. ఏంచేస్తోందో ఏమో, అసలే ఒంటరిగా ఉండడానికి భయపడింది.

సుబ్బారావు తనకొన్న బ్రీఫ్ కేస్ గురించే ఆలోచిస్తున్నాడు. అది ప్రత్యేకమైన సదుపాయంతో చేయబడింది. భయంకర్ తనకిచ్చినది కూడా అచ్చం ఇలాగే ఉంది. దానికి కూడా ఏదో స్పెషల్ బటన్ ఉండివుంటుంది. ప్రయత్నించి అందులో ఏముందో తెలుసుకోవాలి!

ఉత్సాహంగా ఆలోచిస్తూ సుబ్బారావోసారి టైము చూసుకున్నాడు. ఏడూ ముప్పై అయిదయింది. ఎంత వరకూ వచ్చామోనని చుట్టూ చూశాడు. రిక్షా మామూలు దారిలో వెళ్ళడంలేదు.

"ఏ దార్లో తొక్కుతున్నావ్. నేను చెప్పిన చోటుకి వెళ్ళడానికిది దారికాదు" అన్నాడుసుబ్బారావు.

"ఇది అడ్డదారి బాబూ!" అన్నాడు రిక్షావాడు.

"ఇదేం అడ్డదారి. నాకూరు తెలీదనుకున్నావా?" అన్నాడు సుబ్బారావు చిరాగ్గా.

రిక్షావాడు మాట్లాడలేదు. సుబ్బారావు మరోసారి చుట్టూ చూసి, "పెందరాళే వెడదామనుకుని రిక్షా

ఎక్కితే నువ్వు తప్పుదారి పట్టించావు. ముందోసారి రిక్షా ఆపు. ఎలావెళ్ళాలో చూద్దాం'' అన్నాడు.

"మీ కంతగా తెలిసినప్పుడు, నేను తప్పుదారిపట్టి నప్పుడే చెప్పాల్సింది. నా బండికి బ్రేకుల్లేవు. మంచి డౌన్లో పోతోంది. ఆ సందు మొగదగ్గర ఆపుతాన్లెండి'' అన్నాడు రిక్షావాడు.

"చాలా బాగుంది'' విసుక్కున్నాడు సుబ్బారావు. రిక్షా సందు మొగదగ్గర ఆగింది. సుబ్బారావు రిక్షా దిగాడు. ఒక పర్యాయం చుట్టూ చూశాడు. దగ్గర్లో బస్ స్టాపెక్కడుందో చూడాలని అతని ప్రయత్నం. అయితే బస్ స్టాపుకంటే ముందు అతనికళ్ళ కక్కడొక అందమైన యువతి కనబడింది. ఆమె సుధ!

సుధ పక్కన ఒక దృఢకాయుడున్నాడు. చేయెత్తు మనిషి, కండలు తిరిగిన శరీరం, కోరమీసాలు, ఉన్న ఆ మనిషి చింతనిప్పుల్లాంటి కన్నులతో సుబ్బారావుని ఉరిమి చూస్తున్నాడు. సుధమాత్రం అందంగా నవ్వుతోంది. ఇద్దరూ సుబ్బారావువైపు నడిచి వస్తున్నారు.

# 9

"ఎనిమిది గంటల అయిదునిముషాలయింది'' అన్నాడు అసహనంగా భయంకర్. "ఇంత ఆలశ్యం జరుగుతుందనుకో లేదు. వ్యవహారం నా పీకలమీదకు వచ్చేలాగుంది!''

"నాకూ ఏమిటో బెంగగా ఉంది అన్నయ్యగారూ. ఇంత ఆలస్యం ఎందుకు జరిగిందో తెలియడంలేదు'' అంది వనజ. అతన్ని బంధుత్వపువరసలో పిలవడం చాలా అవసరమని వనజ భావిస్తోంది.

"అసలెక్కడికి వెళ్ళారాయన?'' అన్నాడు భయంకర్ ఆదోలా.

"ఎవరో ఆయనకు దాచమని చిన్న బ్రీఫ్ కేస్ ఒకటిచ్చే రట. అది ఆయన ఒక స్నేహితుడింట్లో భద్రంగా దాచా రట. ఆ స్నేహితుడీ రోజు ఊరికిపోతున్నాడు. అందుకని బ్రీఫ్ కేసు తీసుకువస్తానని ఆరుగంటలకు బయల్దేరారు. న్యాయంగా ఏడుగంటలకే రావాల్సింది మరి" అంది వనజ. బ్రీఫ్ కేస్ ఇంట్లోనే ఉందన్న నిజం భయంకర్ కు తెలియకూడదు. ఉంటే తన్ను బెదిరించి ఇప్పుడే తీసుకు వెడతానంటాడు. అసలితను నిజంగా భయంకర్ అవునో, కాదో తనకు తెలియదు.

వనజ మాటలు విన్నాక భయంకర్ ముఖంలో ఆందోళన కనబడింది. "మైగాడ్!" అనుకున్నాడతను.

కాసేపు మళ్ళీ ఇద్దరిమధ్యా నిశ్శబ్దం రాజ్యమేలింది. భయంకర్ మళ్ళీ టైమ్ చూసుకున్నాడు. "సుబ్బారావు గారికేదో ప్రమాదం సంభవించి ఉండవచ్చునని నాకు తోస్తోంది. ఆ బ్రీఫ్ కేస్ ఆయన స్నేహితుడి ఇంట్లో కాక, తనవద్దనే దాచి ఉంచవలసింది" అన్నాడతను.

వనజ కటువంటి భయమేమీ లేదు. ఆ బ్రీఫ్ కేస్ ఇంట్లోనే ఉన్నదని ఆమెకు తెలుసును. ఎటొచ్చీ భర్త ఆలశ్యానికి కారణం మాత్రం తెలియడం లేదామెకు. "ఇంతకీ ఆ బ్రీఫ్ కేస్ గురించి మీకు తెలుసా?" అనడిగిం దామె సంభాషణ నడపడం కోసం.

"నేనే ఆయనకు బ్రీఫ్ కేస్ దాచమని ఇచ్చాను" అన్నాడు భయంకర్.

వనజ ఆశ్చర్యాన్ని నటిస్తూ, "ఆశ్చర్యంగా ఉందే. నాకెన్నడూ ఆయన ఈ విషయం చెప్పలేదే" అంది.

"నేను వీలైనంత రహశ్యంగా ఉంచమని చెప్పాను.

ఎందుకంటే ఇది చాలా ప్రమాదకరమైన విషయం''
అన్నాడు భయంకర్.

వనజ కుతూహలంగా, "ఇంతకీ ఆ బ్రీఫ్ కేసులో ఏముందండీ'' అంది.

"ఏమో. నాకూ తెలియదు'' అని మళ్ళీ టైము చూసుకున్నాడు భయంకర్. "అబ్బా. ఎనిమిదీ ఇరవై అయింది. నేను పావుతక్కువ తొమ్మిదివరకూ ఉంటాను. అప్పటి వరకూ కూడా సుబ్బారావుగారు రాకపోతే, ఆయనకూ, నాకూ కూడా ప్రమాదం సంభవించవచ్చు.''

"ప్రమాదమంటే?''

"నాకు తెలిసిన ప్రమాదం ఒక్కటే. అదే ప్రాణాలు పోవడం'' అన్నాడు భయంకర్.

వనజ గుండెల్లో రాయిపడింది. ఆమె దృష్టి టేబిల్ మీద ఉన్న అలారం గడియారంమీద పడింది. హఠాత్తుగా అది వేగం పుంజుకుని పరిగెడుతున్నట్లనిపించిందామెకు.

# 10

సుబ్బారావుకు భయం వేసింది. సుధ పక్కనున్నలాంటి మనుషుల నింతవరకూ సినిమాలలో మాత్రమే చూశాడు. అతను జేబులోంచి ఓ అరరూపాయతీసి రిక్షావాడి చేతిలో పెట్టి, "బాబూ, నీకూ, నీ రిక్షాకూ ఓ నమస్కారం'' అని కాస్త జనం బాగా ఉన్న హోటల్ వైపు నడిచాడు.

"హలో సుబ్బారావుగారూ'' అన్న సుధ పిలుపు వినపడింది. అయినా వినిపించుకోనట్లు సుబ్బారావు ముందడుగు వేశాడు.

"హలో సుబ్బారావుగారూ మిమ్మల్నే'' మళ్ళీ పిలిచింది సుధ. అయినా వినకుండా సుబ్బారావు ముందుకు నడుస్తూంటే ఒక వ్యక్తి ఆపి, "మీ పేరు సుబ్బారావాండీ.

వెనకాలెవరో అమ్మాయి మిమ్మల్ని పిలుస్తోంది" అన్నాడు.

"నాపేరు సుబ్బారావుకాదు" అంటూ ఆ వ్యక్తిని విడిపించుకుని ముందుకు వెళ్ళాడు సుబ్బారావు.

ఈ పర్యాయం నాలుగంగల్లో సుబ్బారావుని చేరి, అతని ముందు అడ్డంగా నిలబడి, "పిలిస్తే పలకరేమండీ సుబ్బారావుగారూ" అంది సుధ.

"నాపేరు సుబ్బారావుకాదు" అన్నాడతను.

"అయితే ఇదివరకు మీ పేరు అబద్ధం చెప్పేరన్నమాట. కానీ మీ పేరు సుబ్బారావని నేను ఋజువు చేయగలను" అంది సుధ.

"ఎలా?"

"మిమ్మల్ని బాగా ఎరిగున్న మీ చేత నిజం చెప్పించ గల వ్యక్తి మీ వెనకాల ఉన్నాడు, చూడండి" అంది సుధ. కాస్త కఠినంగా సుబ్బారావు వెనక్కి తిరిగాడు. ఆ వృద్ధకాయుడు చింతనిప్పుల్లాంటి కళ్ళతో తనవంక చూస్తున్నాడు. సుధ ఉద్దేశ్యం అతనికి అర్థమయింది. గుండెల్లో కాస్త బెదురుకూడా కలిగింది.

సుబ్బారావు ముక్తసరిగా, "అతను కూడా నాకు తెలియదు" అంటూ ముందుకు వెళ్ళబోయాడు. సుధ అతని చేయి పట్టుకుంది. అది చాలా చక్కని హాయైన స్పర్శ.

"నాకు మీతో పనిలేదు. మర్యాదగా మీ చేతిలో ఉన్న సూట్ కేస్ నాకిచ్చేయండి. లేకపోతే చిక్కుల్లో పడతారు. బహుశా ప్రాణాలుకూడా పోవచ్చు" అంది సుధ వీలైనంత నెమ్మదిగా.

"ఇది మీ కిచ్చినా నా ప్రాణాలుపోతాయి. ఏదైనా దౌర్జన్యానికి దిగేరా, మీ రంగు బయటపెట్టి పదిమందినీ

పిలిచి ఇప్పుడే అన్నీ చెప్పేస్తాను. మర్యాదగా వెనక్కు వెళ్ళిపోండి" అన్నాను సుబ్బారావు ధైర్యం కూడగట్టుకొని. సుధకు అతని కళ్ళలో దృఢనిశ్చయం కనబడింది.

"ఎవర్నిలా లొంగదీయాలో నాకు బాగా తెలుసులెండి. మీ వెనకనున్న అతనెవరో తెలియదన్నారుగదా అతి త్వరలో అతన్నిగురించి చాలా తెలుసుకుంటారు. అతని పరిచయం కూడా లభిస్తుంది" అని సుధ అతని చేయి వదిలిపెట్టింది.

సుబ్బారావింక రిక్షా ఎక్కే తలపు మానుకున్నాడు. అతను బస్‌స్టాపుకు వెళ్ళి బస్సు వచ్చేవరకూ ఆగి బస్సు ఎక్కాడు. దృఢకాయుడు, సుధకూడా అదే బస్సు ఎక్కారు.

# 11

భయంకర్ అసహాసంగా అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. మాటిమాటికీ టైము చూసుకుంటున్నాడు. ముఖంలో ఆత్రుత, ఆందోళన సమపాళ్ళలో కనబడుతున్నాయి.

"ఇంక లాభంలేదు. టైమైపోయింది. మరి నేను వస్తాను. ఇంక సుబ్బారావుగారిని దేవుడే కాపాడాలి" అంటూ అతను వీధిలోకి నడిచాడు. సరిగ్గా అదే టైముకి అతనికి సుబ్బారా వెదురయ్యాడు, చేతిలో బ్రీఫ్ కేసుతో. అతను పరుగులాంటి నడకతో వస్తున్న మూలాన ఇంచుమించు భయంకర్‌ని గుద్దినంత పనిచేశాడు.

సుబ్బారావుని చూస్తూనే భయంకర్ ముఖం వెలిగింది. "అమ్మయ్య. నన్ను రక్షించేరు, మీరు రక్షించబడ్డారు" అన్నాడు.

సుబ్బారావు భయంకర్‌ని గుర్తుపట్టాడు. "వచ్చేరా.

బ్రీఫ్ కేస్ కోసం సుధ అనే ఒక అమ్మాయీ, ఒక వృద్ధ కాయుడూ నా వెంటబడ్డారు. ప్రాణాలతో ఇల్లు చేరు కుంటాననుకోలేదు" అన్నాడు.

భయంకర్ నవ్వి, "ప్రస్తుతానికి వ్యవధిలేదు" అంటూం డగా ఇంటిముందు ఓ టాక్సీ ఆగింది. "వస్తాను మరి" అంటూ భయంకర్ సుబ్బారావు చేతిలోని బ్రీఫ్ కేస్ తీసుకుని, "మెనీ మెనీ థాంక్స్" అంటూ వెళ్ళి టాక్సీ ఎక్కాడు.

సుబ్బారావు ఏదో చెప్పబోయేంతలో టాక్సీ వెళ్ళి పోయింది.

సుబ్బారావు వీధిలోకి చూశాడు. సుధ, వృద్ధకాయుడు కూడా జరిగింది చూసినట్టున్నారు. వెనక్కు తిరిగి వెళ్ళి పోయారు.

సుబ్బారావు ఇంట్లో అడుగుపెట్టాడు. వనజ ముఖంలో రకారకాల భావాలతో అతనివంకే చూస్తోంది.

"పొరబాటు జరిగిపోయింది వనజా. నా చేతిలోని తన సూట్ కేస్ నసుకుని భయంకర్ తీసుకువెళ్ళిపోయాడు. నిజంచెప్పే వ్యవధికూడా ఇవ్వలేదు" అన్నాడతను పాలి పోయిన ముఖంతో.

"బహుశా అన్నీ మనమంచికే జరుగుతాయండీ. ఇలా ఎందుకు జరిగిందో" అంది వనజ.

"ఎలాగో అలా జరిగిన పొరపాటు భయంకర్ కి తెలియ జేయాలి" అన్నాడు సుబ్బారావు.

"భలేవారే. పొరపాటు జరిగితే అతనికి మాత్రం తెలియదా" అంది వనజ.

"అదీ నిజమే. కానీ పొరపాటు నేను కావాలని చేశానని భయంకర్ కి అనుమానం తగిలితే."

"ఇంతవరకూ అన్నీ మనం అనుకున్నట్లు జరిగాయి కనుక నా, జరుగబోయేది ఊహించడానికి" అని విసుగ్గా అంది వనజ. "ఏమండీ. భయంకర్ మరి మనింటికి రాకుండా ఉంటే బాగుండునండీ. ఆ బ్రీఫ్ కేస్ మన సొంత మైపోతే బాగుండునండీ."

"అవేం మాటలు. అందులో ఏముందో కూడా మనకు తెలియదు."

"నాకు తెలుసు. అందులో ఏముందో?"

సుబ్బారావు ఉలిక్కిపడ్డాడు. "ఎలా తెలుసు?"

వనజ జరిగిందంతా చెప్పింది. "అందులోని డబ్బు ఇరవై లక్షలకు తక్కువుండదనుకోండి."

"ఇరవై లక్షలే!" సుబ్బారావుకు గుండె ఆగినంత పనయింది. అతను ఊరకలు పరుగులమీద ధనలక్ష్మి దర్శనం చేసుకోవడానికి వెళ్ళాడు.

## 12

"చిల్లర నోట్లు కావాలి!" అన్నాడు సుబ్బారావు.

క్యాషియర్ వందరూపాయల నోటందుకుని ఒక పర్యాయం పరిశీలనగా చూశాడు. తర్వాత దాన్ని క్యాషు బాక్సులో పడేసి ఇరవై అయిదురూపాయ నోట్లు లెక్క పెట్టి సుబ్బారావు కందించాడు.

సుబ్బారావు మనసు సంతోషంతో నిండిపోయింది. భయంకర్ ఇచ్చిన బ్రీఫ్ కేసులోని ఒకేఒక నోట్లకట్ట తీసుకున్నాడతను. అవి దొంగనోట్లయి ఉండవచ్చునని బాగా అనుమానంగా ఉందతనికి. కానీ అది నిజంకాదని ఇప్పుడే తేలిపోయింది.

తను నిజంగా అదృష్టవంతుడేమో! కొన్ని లక్షలు స్వాధీనంలో ఉన్న పెట్టె తనవద్ద వదిలేసి, చెత్త

కాగితాలున్న పెట్టె తీసుకుపోయాడు భయంకర్. జరిగిన పొరపాటు గ్రహించి అతను తిరిగివస్తాడనుకుందామంటే, అప్పుడే వారంరోజులు గడిచిపోయాయి. ఈరోజే అతను ధైర్యంచేసి ఒకేఒక కట్టతీసి అవి దొంగనోట్లవునో, కాదో తెలుసుకుందామనుకున్నాడు. అవి అసలు నోట్లే అని తేలిపోయింది.

అయితే ఇప్పుడేంచేయాలి?

మంచినోట్లయితే భయంకర్ వదులుకుంటాడా? మళ్ళీ తప్పక వస్తాడు. డబ్బు ఏమాత్రం తగ్గినా ప్రాణాలు తీస్తాడు. కానీ డబ్బు సొంతం చేసుకోవాలని వనజ ప్రాణాలు తీస్తోందిప్పుడు.

భయమూ సంతోషమూ సమపాళ్లలో కలుగుతున్నాయి సుబ్బారావుకి. అతను ఇల్లు చేరేసరికి గుమ్మంలో ఆత్రుతగా ఎదురుచూస్తున్న వనజ పలకరించింది. "ఏంజరిగింది?" అంటూ.

"మంచివే!" అన్నాడు సుబ్బారావు. అతను లోపలకు రాగానే, "ఎంత అదృష్టం?" అంది వనజ. సుబ్బారావు తలుపులు వేశాడు.

"ఇంక భయపడకండి. హాయిగా ఉండి అనుభవించలేకపోవడమేం కర్మ" అంది వనజ.

"భయంకర్ చాలా భయంకరమైన వ్యక్తి!" అన్నాడు సుబ్బారావు.

"కానీ మనం అదృష్టవంతులం. అదృష్టవంతులెవ్వరూ ఏమీ చేయలేరు."

"ఏం అదృష్టమో. చేతినిండా డబ్బుండీ ఖర్చుపెట్టుకోలేని దురదృష్టవంతులమైపోయాం" అన్నాడు సుబ్బారావు నిట్టూరుస్తూ.

"అనవసరంగా మీరే వెనకదీస్తున్నారు. లేకపోతే లక్షరూపాయలకు సరిపడ ఖర్చుగురించి అప్పుడే ప్లాను వేసి ఉంచాను" అంది వనజ.

"తల్లీ, నువ్వంతదానివే. కానీ మన ప్రాణాలమీదకు రాకుండా ఎలా చూడ్డమా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు సుబ్బారావు.

ఎవరో తలుపుతట్టిన చప్పుడయింది. సుబ్బారావే వెళ్ళి తలుపు తీశాడు.

లోపలకు వచ్చిన వ్యక్తి భార్యాభర్తల కిద్దరకూ కూడా అపరిచితుడే! సుమారు నలభై సంవత్సరాలుంటాయతనికి. మనిషి నల్లగా ఉన్నాడు. అతని బట్టలు, ముఖకవళికలను బట్టి చూస్తే చాలా గొప్పవాడని ఊహించవచ్చు.

"నాపేరు శ్యామసుందర్!" అన్నాడతను.

"నాపేరు సుబ్బారావు. రండి, కూర్చోండి!"అన్నాడు సుబ్బారావు.

శ్యామసుందర్ వచ్చి కూర్చున్నాడు. సుబ్బారావు భార్యను కూడా పరిచయంచేసి,"మిమ్మల్నెన్నడూ కలుసుకున్న గుర్తులేదండీ నాకు" అన్నాడు.

శ్యామసుందర్ నవ్వి, "మనం కలుసుకోవడం ఇదే మొదటిసారి. కానీ మీగురించి మా విశ్వనాథంద్వారా విన్నానులెండి" అన్నాడు.

"విశ్వనాథం ఎవరండీ. నాకు తెలిసినవాళ్ళలో ఆ పేరు గలవాడెవ్వరూ లేరే" అన్నాడు సుబ్బారావు. కాఫీ కలపవలసి ఉంటుందనే ఉద్దేశ్యంతో వనజ లోపలకు వెళ్ళింది.

"మా విశ్వనాథానికి అసలుపేరు చెప్పే అలవాటు లేదులెండి. మీతో ఏ భయంకరో అని చెప్పుంటాడు."

"మీ మాటలేవీ నా కర్థం కావడంలేదు. కాస్త

నూటిగా విషయం చెప్పగలిగితే బాగుంటుంది" అన్నాడు సుబ్బారావు నిరుత్సాహంగా.

"నూటిగా చెప్పవచ్చుననుకోండి కానీ ఇది నూటి అయిన వ్యవహారమేం కాదు" అన్నాడు శ్యామసుందర్. "లక్ష్మీనారాయణ పేరు మీరు వినే ఉంటారు."

"ఇంతవరకూ మీరు చెప్పిన పేర్లన్నీ కొత్తవే నాకు" అన్నాడు సుబ్బారావు రవంత చిరాకును ప్రదర్శిస్తూ.

"ఆయనకు పేరులోనే కాకుండా ఇంటినిండా లక్ష్మి ఉంది. ఆయన కెన్నో లావాదేవీలున్నాయి. ఎన్నో వ్యాపారాలున్నాయి" అని శ్యామసుందర్ ఆగాడు. సుబ్బారావు మాట్లాడకుండా కుతూహలంగా వింటున్నాడు.

"ఆయన చాలా గొప్పవాడు. ఆయనచుట్టూ గొప్పవాళ్ళే తిరుగుతూంటారు. ఆయనకు పోలీసులంటే భయం లేదు. దొంగలంటే భయం లేదు. మంత్రులంటే భయంలేదు. మంత్రాంగాలంటే భయంలేదు. చిన్న వాళ్ళవైపు కన్నెత్తయినా చూడడు. పెద్దవాళ్ళనయినా చిన్నచూపు చూస్తాడు. లక్ష్మీప్రసన్నుడు కాబట్టి ఆయన కన్నివిధాలా సాగుతోంది."

వనజ కాఫీలు తీసుకొచ్చింది. శ్యామసుందర్ వాక్ప్రవాహానికి ఆనకట్టపడింది.

# 13

కాఫీ సిప్ చేస్తూ శ్యామసుందర్ చెప్పసాగాడు. వనజ మాత్రం లోపలకు వెళ్ళిపోయింది. "సుందర్రావు అనే ఓ సైంటిస్టు ఏణ్ణర్థం క్రితమే అమెరికానుంచి తిరిగివచ్చాడు. అతను స్వంతంగా ప్రయోగశాల పెట్టుకుని ఏవేవో పరిశోధనలు చేసుకుంటూండేవాడు. ఆరునెలల క్రితం అత

నొక కొత్త సంచలనాత్మకమైన విశేషం కనిపెట్టాడు. అతను రూపొందించిన యంత్రం సహాయంతో మసిబొగ్గును వజ్రంగా మార్చవచ్చు."

"మసిబొగ్గులో కానీ, వజ్రంలో కానీ ఉన్న మూల పదార్థం కార్బన్ అని నాకూ తెలుసు. ఆర్టిఫిషియల్ డైమండ్స్ చేయడానికి చాలామంది శ్రమించారు, శ్రమిస్తున్నారు. చాలా ఖర్చవుతుందందుకు. ఆర్థికంగా అట్టే ప్రయోజనకారిగా ఉండకపోవచ్చుకూడా" అన్నాడు సుబ్బారావు.

శ్యామసుందర్ నవ్వాడు. "సుందర్రావు ప్రయోగం అందరిలాంటిదీ కాదు. పదార్థాలు క్రిస్టల్ స్ట్రక్చర్ మార్చుకునేందుకు అతనొక యంత్రం కనిపెట్టాడు. అది తయారు చేయడానికి యాభైవేలు లోపే అవుతుంది. అంతేకాదు, పదివేలరూపాయలు విలువచేసే వజ్రాన్ని సుమారు అయిదు వందల రూపాయల ఖర్చులో తయారు చేయవచ్చు.

ఈ ప్రయోగాన్ని సొమ్ముచేసుకుని, ఆ సొమ్ముతో మరిన్ని ప్రయోగాలు చేసుకోవచ్చునని అతని ఆశ. వ్యాపారం పేరుతో సమయం వృధా చేసుకోవడం అతని కిష్టంలేదు.

తన ప్రయోగఫలితాన్ని ఎనిమిది లక్షలకు లక్ష్మీనారాయణగారికి అమ్మడానికి బేరం కుదిరింది చివరకు. అదెలా జరిగిందంటే, లక్ష్మీనారాయణగారు మూడు లక్షలరూపాయలు ముందుగా సుందర్రావుకి సమర్పించాలి. అవీ అన్నీ వందరూపాయల నోట్లు సీరియల్ నెంబరువు. సుందర్రావు ఇన్విజిబుల్ ఇంక్‌తో (కనిపించని సిరా) ఆ నోట్లమధ్యనున్న తెల్లని ఖాళీప్రాంతంలో యంత్రం తయారుకు అవసరమైన ఫార్ములాలు, వివరాలు వగైరాలన్నీ

## సప్లిమెంట్ పోటీ - 23.

103, 104, 105, 106, 107 — అంకెలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలుచేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్',ఉచితంగా పంపుతాం. ఫలితాలు అక్టోబరు '76 నెల మాసపత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని, వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి.' హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులుపంపాలి. మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ కత్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి ఇవ్వబడుతుంది. *

రాస్తాడు. సుందర్రావు అంచనా ప్రకారం మొత్తం సుమారుగా. ఇరవై రెండు వేల వందరూపాయల నోట్లు కావాలి, ఆ వివరాలన్నీ రాయడానికి. వివరాలు రాసి డబ్బుని లక్ష్మీనారాయణ గారికి సమర్పించుకోవలసి ఉంది. ఇక్కడే ఒక చిన్న తమాషా జరిగింది'' శ్యామసుందర్ ఆగి, ''కాస్త వక్కపొడుందా'' అనడిగేడు.

''వనజా'' సుబ్బారావు పిలిచేడు. సమాధానంగా వక్కపొడి డబ్బాతో వనజ వచ్చింది. 'తను కూడా వింటోందన్నమాట' అనుకున్నాడు సుబ్బారావు.

వక్కపొడి నములుతూ శ్యామసుందర్ మళ్ళీ చెప్పడం ఆరంభించేడు.

''సైంటిస్ట్ సుందర్రావు, లక్ష్మీనారాయణ గారిని స్వయంగా కలుసుకుని సుమారు ఇరవై రెండు లక్షలున్న బ్రీఫ్ కేసుని అందించాడు. 'అందులోని వివరాలు మరెవ్వరూ చదవలేరు. నేను స్పెషల్ గా తయారుచేసిన ఇన్విజిబుల్ ఇంక్ తో రాశాను వివరాలు' అంటూ ఆయనకో పెన్ను కూడా అందించాడు. దానికి రెండువైపులా కూడా కాప్స్ ఉన్నాయి. 'ఒకపక్క కాప్ తీసి రుద్దారంటే, నేను రాసిన వివరాలు కనబడతాయి. మళ్ళీ రెండోపక్క కాప్ తీసి రుద్దారంటే ఆ అక్షరాలు మళ్ళీ మాయమవుతాయి' అని అతను లక్ష్మీనారాయణరావుగారికి చెప్పాడు. ఆయన సైంటిస్ట్ చెప్పినవన్నీ పరీక్షించి నిజమేనని రూఢి చేసుకున్నాడు.

ఆ పెన్ను నాయన చాలా భద్రంగా ఎక్కడో దాచారు. కాని ఫార్ములాలున్న నోట్లున్న బ్రీఫ్ కేసు గురించి ఆయన అంత పట్టించుకోలేదు. జాగ్రత్తగా దాచమని తన భార్య శ్యామలకిచ్చారు. ఆమె దాన్ని భద్రంగా

గాడ్రెజ్ అల్మరాలో దాచింది.

మర్నాడు లక్ష్మీనారాయణగారు తనకు తెలిసిన ఇంజనీర్లతో సంప్రదించడానికని ఒక సమావేశం ఏర్పాటుచేసి, అక్కడికి ఈ బ్రీఫ్ కేసును తీసుకురమ్మన్నారు. శ్యామల స్వయంగా తనే తీసుకువెళ్ళింది ఆ బ్రీఫ్ కేసు. అక్కడున్న టేబిల్ మీద పెట్టింది. లక్ష్మీనారాయణగారు ఆమె వెళ్ళవచ్చునన్నట్లుగా సైగచేసి, తను టేబిల్ వద్దకు వెళ్ళారు. బ్రీఫ్ కేస్ తెరవబోయి ఆగిపోయారు. కారణం... కాసినిమంచినీళ్ళిప్పిస్తారా..." అన్నాడు శ్యామసుందర్.

సుబ్బారావు, వనజను పిలవలేదు. రెండు నిముషాల్లో వనజ మంచినీళ్ళు తీసుకుని వచ్చింది. ఈసారి ఆమె మరి లోపలకు వెళ్ళకుండానే అక్కడే ఓ కుర్చీలో కూర్చుంది.

శ్యామసుందర్ మంచినీళ్ళు తాగి, "ఆ బ్రీఫ్ కేస్ మీద ఒక చిన్న అస్థిపంజరం, రెండు బొమికలతో ప్రమాదం గుర్తువేసిన ఒక కాగితం అంటించబడి ఉంది. దానిమీద రెండేరెండు వాక్యాలు వ్రాయబడి ఉన్నాయి. "లోపల బాంబు ఉంది. పెట్టె తెరిస్తే బాంబుపేలి డబ్బూ, ఫార్ములాలూ కూడా నాశనమౌతాయి" అని రాసి ఉంది.

లక్ష్మీనారాయణగారి ముఖం ఎర్రబడింది. ఆయన ముందుగా భార్యదగ్గరకు వెళ్ళి, "శ్యామా, పెట్టె ఎక్కడ దాచావ్?" అనడిగేడు. శ్యామల చెప్పింది. ఆయన వెళ్ళి అల్మరాను పరీక్షించాడు. భార్యను రకరకాల ప్రశ్నలు వేసిన మీదట ఆయనకు తెలిసిన విషయమేమంటే, తాళాలు అప్పుడప్పుడు తను పనిమనుషుల కిస్తూంటుందనీ, నిన్నటిదినం మామూలు పనిమనిషి కాకుండా కొత్తమనిషి వచ్చిందనీ తెలిసింది.

లక్ష్మీనారాయణగారు పనిమనిషిని అరాతీశారు. ఆ ఒక్క రోజూకూ తన బదులు వెళ్ళడానికి మరో మనిషి కోరిందనీ, ప్రతిఫలంగా పాతికరూపాయ లిచ్చిందనీ, అది చెప్పింది. ఏదో పెద్ద గూడుపుఠాణీ జరిగిందని లక్ష్మీ నారాయణగారికి తోచింది. కానీ ఏమిటి చేసేది? ఎనిమిది లక్షలు విలువచేసే ఫార్ములా వివరాలూ, ఇరవై లక్షల రూపాయలూ ఒక్క దెబ్బతో పేలిపోతాయి. అలా జరగడం ఆయన కిష్టంలేదు."

"ఆయనకే ఏమిటిలెండి. ఎవరికిమాత్రం ఇష్టంగా ఉంటుంది?" అంది వనజ.

శ్యామసుందర్ కొనసాగించాడు. "తాత్కాలికంగా వాళ్ళ సమావేశం వాయిదాపడింది. మర్నాడు లక్ష్మీ నారాయణగారికో ఉత్తరం వచ్చింది. బాంబు పేలకుండా పెట్టె తెరిచే విధానం తమకు తెలుసుననీ అయితే అందుకు ప్రతిఫలంగా తమకు ఆ బ్రీఫ్ కేసునీ, ఫార్ములా వివరాలను కనబడేలాచేసే పెన్నునూ, తమ కందజేయాలనీ, అలా చేసిన పక్షంలో అతనికి నష్టంకలుగని విధంగా ముప్పై లక్షలరూపాయలున్న మరో బ్రీఫ్ కేసు లక్ష్మీనారాయణ గారి కందచేయబడుతుందనీ అందులో సారాంశం. ఎవరో చాలా తెలివిగా ఆడుతున్న పథకమిదని లక్ష్మీనారాయణ గారికి తెలిసిపోయింది. కానీ ఏంచేయగలరు?"

"రిస్కు తీసుకుని బ్రీఫ్ కేసు తెరవ్వలసింది" అన్నాడు సుబ్బారావు.

"చెప్పడమంత సులువుకాదు, చేయడం. బ్రీఫ్ కేస్ తెరిచారంటే ఇరవై లక్షలతోపాటూ ఫార్ములాలు కూడా ఎగిరిపోతాయి. మరి ఆ ఫార్ములాలు లక్ష్మీనారాయణ గారికే దొరకవు" అన్నాడు శ్యామసుందర్.

"మళ్ళీ సైంటిస్టు సుందర్రావు దగ్గర కొనుక్కో వచ్చుగా."

"లక్ష్మీనారాయణగారి సంగతులు మీకు పూర్తిగా తెలియవు. ఒక పర్యాయం ఆ ఫార్ములాలు తన చేతికి చిక్కాక, సుందర్రావు మరెవ్వరికీ వాటిని అమ్మకుండా ఉండేలా చేయడంకోసం, ఆయన తగు జాగ్రత్త తీసుకున్నారు. బొగ్గుతో వజ్రాలు చేయాలనుకుంటే ఇప్పుడు సైంటిస్ట్ సుందర్రావు, లక్ష్మీనారాయణగారి సాయమైనా కోరాలి. లేదా మళ్ళీ పరిశోధన ప్రారంభించాలి. తను మనుషుల్ని పెట్టించి, ఫార్ములాలు కొన్నరాత్రే, సుందర్రావు దగ్గర దానికి సంబంధించి ఉన్న సమాచారమంతా నాశనం కావించారు లక్ష్మీనారాయణగారు."

"లక్ష్మీనారాయణగారు చాలా తొందరపడ్డారు."

"ఆ విషయం ఆయన ఆలస్యంగా గ్రహించారు. అందుకే ఆయన నా తమ్ముడు విశ్వనాథాన్ని పిలిపించారు. బ్రీఫ్ కేసును అతనికిచ్చి కొంతకాలంపాటు దాన్ని భద్రంగా ఎవరికీ అనుమానం తగలని చోట దాచి ఉంచమన్నారు. ఈలోగా తను కుట్రదారుల ఆచోకీ తెలుసుకోవాలని ఆయన ఆలోచన. విశ్వనాథానికి ఆయన బ్రీఫ్ కేసు గురించిన వివరాలన్నీ చెప్పారు. అందులో ఇరవై రెండు లక్షల రూపాయలు, ఎనిమిదిలక్షల విలువచేసే ఫార్ములాలూ ఉన్నాయనీ, బ్రీఫ్ కేసు తెరిస్తే పేలిపోతుందనీ, అందువల్ల చాలా జాగ్రత్తగా కాపాడాలనీ ఆయన వాణ్ణి హెచ్చరించారు. నా తమ్ముడి సామర్థ్యంమీద ఆయనకు నమ్మకం ఉంది. ఆయన ఎంత ప్రమాదకరమైన వ్యక్తో తమ్ముడికీ తెలుసు. అందువల్ల తిరుగులేని ఏర్పాటది" శ్యామసుందర్ ఒక్క క్షణం ఆగాడు.

"చాలా విచిత్రంగా ఉంది మీరు చెబుతున్నది......" అన్నాడు సుబ్బారావు,

"ముందు జరిగినదింకా విచిత్రంగా ఉంటుంది—" అంటూ శ్యామసుందర్ మొదలు పెట్టాడు— "నా తమ్ముడికి బ్రీఫ్ కేసు ఇచ్చేక లక్ష్మీ నారాయణగారు నన్ను పిలిచి—కథంతా వివరించి కుట్రదారుల ఆచూకీ తీయమన్నారు. ఫలితంగా నేను తమ్ముడి ననుసరించాల్సి వచ్చింది. వాడు బ్రీఫ్ కేస్‌తో ఉండగా ఒక అమ్మాయి వాణ్ణి వెంటాడింది. నే నామెనో కంట కనిపెడుతూ వచ్చాను. విశ్వనాథం ఈ ఊరు వచ్చాడు. ఆమె వాణ్ణి వెంటాడుతూనే ఉంది. ఈ ఊరు చేరిన రోజు రాత్రి ఆమె వాణ్ణి కలుసుకుని తన ఇంటికి రమ్మని ఆహ్వానించింది. వాడామె దురాలోచనని గుర్తించాడు. అందుకే బలవంతంగా ఆమెను వదిలించుకుని కనపడ్డ టాక్సీ ఎక్కేశాడు. మరో టాక్సీలో ఆమె వాడిని వెంటాడింది. అప్పుడు నేను తగిన జాగ్రత్త తీసుకుని ఆమె టాక్సీని తప్పుదారి పట్టించ గలిగాను. అంతేకాదు. ఆమెతో పరిచయాన్ని కూడా సంపాదించ గలిగాను..."

"ఆమె పేరు—" అడిగాడు సుబ్బారావు.

"ఆమెకు చాలా పేర్లున్నాయ్ — నాకు తెలిసిన పేరు సుధ!" అన్నాడు శ్యామసుందర్.

సుధ పేరు వింటూనే సుబ్బారావు, వనజ కూడా ఉలిక్కి పడ్డారు— "సుధా?" అన్నాడు సుబ్బారావు అప్రయత్నంగా.

"అవును మీకు తెలుసా- ఆమె!" అడిగాడు శ్యామసుందర్.

"తెలుసున నే చెప్పవచ్చు. ముందు మీ కథ కాని

వ్వండి—" అన్నాడు సుబ్బారావు.

కొద్ది రోజులు గడిచాయి. లక్ష్మీనారాయణగారు టెలిగ్రామ్ ఇచ్చారు విశ్వనాధానికి. బ్రీఫ్ కేసుతో వెంటనే వచ్చి తనని కలుసుకోవాలని. ఆయన చెప్పారంటే, అదెంత ఖచ్చితమైన ఆజ్ఞయైనదీ విశ్వనాధానికి తెలుసు. అందుకే వాడు వెళ్ళాడు_ అన్న టైము ప్రకారం బ్రీఫ్ కేసుతో. లక్ష్మీనారాయణగారు బ్రీఫ్ కేసు తెరిచారు. చూశారు. అందులో ఏముందో తెలియదు. మరుక్షణం విశ్వనాథం ఈ లోకంలో లేడు_ లక్ష్మీనారాయణగారి మనిషే వాణ్ణి కాల్చి చంపేశాడు ఆయన కనుసైగనందుకుని. అయితే ఇంతకూ అసలు బ్రీఫ్ కేస్ ఏమైంది?" శ్యామసుందర్ ఆగి ప్రశ్నార్థకంగా సుబ్బారావు వంక చూశాడు.

సుబ్బారావు మాట్లాడలేదు. ఆలోచిస్తూన్నట్లు నటిస్తూ కూర్చున్నాడు.

"నా ప్రాణానికి ప్రాణమైన తమ్ముణ్ణి పొట్టబెట్టుకున్న వాళ్ళ అంతు చూస్తాను. నేను లక్ష్మీనారాయణగారి మనిషిని_ నాకూ దయాదాక్షిణ్యాలు లేవు..." అన్నాడు శ్యామ్‌సుందర్.

"ఇవన్నీ మీరెందుకు చెబుతున్నారో అర్థం కావడం లేదు నాకు......"అన్నాడు.

"అర్థం చేసుకుంటారనే ఆశిస్తున్నాను. ఆ బ్రీఫ్ కేస్ మీ ఇంటికి వచ్చింది. ఏ మార్పు జరిగినా మీ ఇంట్లోనే జరిగి ఉండాలి_" అన్నాడు శ్యామసుందర్ శాస్త్ర కతినంగా.

సుబ్బారావు ఉలిక్కిపడ్డట్లు నటించి_ "అయితే అందుకన్నమాట మీరు నాకింత వివరంగా కథ చెప్పింది—" అన్నాడు.

"ఉత్తినే కథలు చెప్పడానికి నేను హరిదాసును కాదు గదా—" అన్నాడు శ్యామసుందర్ నవ్వుతూ.

"ఏమో– ఆ సంగతి నా కెలా తెలుస్తుందండీ–" అన్నాడు సుబ్బారావు.

వనజ బుర్రలో రకరకాల ఆలోచనలు పరుగెడుతున్నాయి. ఆ బ్రీఫ్ కేసును తమ ఇంటిలో ఉంచిన వ్యక్తి చనిపోయాడని ఈ వ్యక్తి చెబుతున్నాడు. తమ ఇంట్లో బ్రీఫ్ కేస్ లేదని ఈ వ్యక్తి నమ్మితే తాము లక్షాధికారులై పోవచ్చు.

శ్యామసుందర్ లేచి నిలబడి– "ఒక పర్యాయం మీ ఇంట్లో వెతక దల్చుకున్నాను." అన్నాడు.

సుబ్బారావు తనూ లేచి నిలబడి– "మేము దొంగలము కాదు, మీరు పోలీసులూ కాదు– మా ఇంట్లో మీరు వెతకడాన్ని నేను సహించ లేను" అన్నాడు.

శ్యామసుందర్ ముఖం కర్కశంగా మారింది – "అనుకున్నది చేయకుండా నన్నెవ్వరూ ఆపలేరు. నా విషయంలో ఎవరైనా శృతిమించితే ఫలితం అనుభవిస్తారు. అదీగాక నేను ఒక కోటీశ్వరుడి ప్రతినిధిని..."

"కావచ్చు. కానీ ఈ ఇంటిమీద మీ కధికారం లేదు. ఇది నా ఇల్లు–" అన్నాడు సుబ్బారావు.

శ్యామసుందర్ ముందడుగు వేయగా సుబ్బారావు చేయి అడ్డంగా పెట్టాడు.

"వెళ్ళి వెతుక్కోనివ్వండి. ఇందులో మనం అవమాన పడవలసినదేమీ లేదు. కనపడకపోతే ఆయనే అవమానపడాలి. మనం వారించిన కొద్దీ అనుమానం పెరగడం తప్ప ప్రయోజనం లేదు." అంది వనజ.

వనజ అలాగనడం సుబ్బారావుకు నచ్చలేదు. కానీ

ఊరుకున్నాడు. శ్యామసుందర్ ఇంట్లోకి దారితీశాడు. సుబ్బారావూ, వనజా అతినన్నుసరించారు.

శ్యామసుందర్ మరీ క్షుణ్ణంగా శోధించలేదు. అతను గబగబా మంచాల క్రిందా, పెట్టెలలోనూ, అల్మరాలోనూ చూసేడు. ముఖంలో అనుమానం కనబడింది. వాళ్ళు ముగ్గురూ తిరిగి యథాస్థానంలోకి వచ్చేసరికి ఎవరో తలుపు తట్టిన చప్పుడయింది. సుబ్బారావు వెళ్ళి తలుపు తీశాడు. నవ్వుతూ లోపలకు వచ్చింది సుధ. శ్యామసుందర్‌ని చూసి– "హలో శ్యామ్! ఇల్లంతా వెదికినా బ్రీఫ్ కేస్ కనబడలేదు కదూ–అయినా అదెక్కడెల్లా దొరుకుతుంది?" అందామె.

శ్యామసుందర్ దెబ్బతిన్నట్లు ఆమె వంక చూసి– "యూ...యూ... నువ్వు నన్ను ఫాలో అవుతునే ఉన్నావా?" అన్నాడు.

"అవకుండా ఎలాగుండగలను? నువ్వు నన్ను మనసారా ప్రేమించిన మగవాడివి" అంది సుధ.

"ఏమిటది?"

"బ్రీఫ్ కేస్ నా దగ్గరుంది. దాంట్లో ఉన్న ఫార్ములా వివరాలన్నీ నేను సేకరించాను. డబ్బుతో నాకు పనిలేదు కాబట్టి దాన్ని మళ్ళీ నీ కిచ్చేస్తాను. ఈ విషయం లక్ష్మీ నారాయణగారికి చెప్పకు. బ్రీఫ్ కేస్ తీసుకెళ్ళి ఆయన కిస్తే నీ మాన ప్రాణాలు దక్కుతాయి – ఏమంటావ్?" అంది సుధ.

"అయితే నీ కన్నీ తెలుసు నన్నమాట!" అన్నాడు శ్యామసుందర్.

"నాకేమేమి తెలుసునో తెలుసుకుందువుగాని. నీ సమయాన్నిక్కడెందుకు వృథా చేసుకుంటావ్– నాతో

పద!" అంది సుధ.

శ్యామసుందర్, సుధ వెళ్ళిపోయిన కాసేపటి వరకూ సుబ్బారావు, వనజ ఇద్దరూ మామూలు మనుషులు కాలేదు. తర్వాత సుబ్బారావు వనజ వంక చూసి– "వనజా–బ్రీఫ్ కేస్ నిజంగానే సుధ తీసుకు పోయిందంటావా?" అన్నాడు.

వనజ నవ్వింది. "శ్యామసుందర్ కథ మొదలు పెట్టగానే నా కనుమానం వచ్చింది. ఎందుకైనా మంచిదని బ్రీఫ్ కేసుని వంటింట్లో స్టవ్ కోసం కట్టిన దిమ్మలో దాచాను. దానికొక పక్క కన్నముంది. పూడ్పించాలని చాలాకాలంగా అనుకుంటున్నాం గదా. అది పూడ్పించక పోవడం ప్రస్తుతం మన మంచికే వచ్చింది. ఎవ్వరూ ఊహించలేని చోటది."

"నువ్వెంత తెలివైనదానివి వనజా–" అంటూ సుబ్బారావామెను దగ్గరకు తీసుకున్నాడు.

# 14

లక్ష్మీనారాయణగారు ఆ ఉత్తరాన్ని మరోసారి చదువుకున్నారు.

"మేము చెప్పిన మాట వినలేదు. ఫలితంగా మీ ఇరవై లక్షలూ, ఫార్ములాలూ కూడా పేలిపోయాయి. విశ్వనాథం ఆ సూట్ కేసును ఒక స్నేహితుడి వద్ద దాచాడు. ఆ స్నేహితుడు కుతూహలం కొద్దీ ప్రయత్నించి దాన్ని తెరవగలిగాడు. ఫలితంగా డబ్బూ, ఫార్ములాలు కూడా పోయాయి. ఆ స్నేహితుడికి స్వల్ప గాయాలూ తగిలాయి.

ఆ స్నేహితుడు విశ్వనాథానికి జరిగింది చెప్పలేదు. మరో కొత్త బ్రీఫ్ కేస్ కొనిచ్చాడు. అది తీసుకునే అతను మీ వద్దకు వచ్చాడు. అది మీ బ్రీఫ్ కేస్ కాని కారణం

గానే మీరు దాన్ని తెరవలేకపోయారు. చివరకు పెట్టె కవరు కోయించేశారు. అందులో కనబడ్డ చిత్తు కాగితా లను చూసి విశ్వనాథం మీద అలిగారు. విశ్వనాథాన్ని చంపించారు.

తర్వాత శ్యామసుందర్ని పంపించారు బ్రీఫ్ కేస్ తీసుకు రమ్మని. అతను మాత్రం ఏం చేయగలడు? ఏదోవిధంగా మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నించడం తప్ప.

అతను తెచ్చే బ్రీఫ్ కేస్ మీరు తెరవాలనుకుంటే కవరు కోయించనవసరం లేదు. బ్రీఫ్ కేసు మీద చిన్న డిజైను గీసి ఉంటుంది. అందులో మధ్య ఒక బొడిపె లాంటి దుంటుంది. దాన్ని నొక్కి పట్టుకుని, అప్పుడు మిగతా బ్రీఫ్ కేసులకు మల్లే నే తెరివాలి. తెరిచాక అందులో ఏముంటుంది?

వందరూపాయల నోట్లకట్టలుంటాయి. వాటిమీద ఫార్ములాలూ ఉంటాయి. నోట్లకట్టలను పరిశీలించి చూడండి. వాటిలో బహుకొద్దిమాత్రమే నోట్లు. మిగతాది తెల్లకాగితాలు. సుందర్రావిచ్చిన పెన్నుతో ఫార్ములాలను చదవడానికి ప్రయత్నించండి. ఆ ఫార్ములాల సహాయంతో ఈ ప్రపంచలోని ఏ సైంటిస్టూ ఏ యంత్రాన్నీ తయారు చేయలేడు.

మా తప్పు లేకపోయినా మామూలుగా మీరు చాలా నష్టపోయారు. ఇంకా మీరు నష్టపోవడం ఇష్టంలేక, ఈ ఉత్తరం రాస్తున్నాం.''

ఉత్తరానికి అడుగున సంతకంలేదు.

లక్ష్మీనారాయణకు చాలా కోపంగా ఉంది. జీవితంలో ఇటువంటి పరాభవాలు ఎదురుకాలే దాయనకు. ఎందులో వేలుపెట్టినా లాభాలు రావడమూ, ఏ పని తలపెట్టినా

ఎదురులేకపోవడమూ మాత్రమే ఇంతవరకూ ఆయన అను భవంలోకి వచ్చిన విశేషాలు. ఇలాజరగడం ఇదే ప్రథమం.

ఉత్తరం మడిచి జేబులో పెట్టుకుని అసహనంగా పచార్లు జేస్తున్నాడాయన.

అప్పుడే కాలింగ్ బెల్ మోగింది. "యేస్" అన్నాడాయన. పనివాడొకడు లోపలకు వచ్చి, "శ్యామసుందర్ గారు మిమ్మల్ని చూడాలనుకుంటున్నారండి" అన్నాడు.

"రమ్మను" అన్నాడు లక్ష్మీనారాయణ ముక్తసరిగా.

శ్యామసుందర్ లోపలకు వచ్చాడు. అతని ముఖంలో విజయగర్వం కనపడుతోంది. హుందాగా నడుచుకుంటూ వచ్చి చేతిలో ఉన్న బ్రీఫ్ కేస్ అక్కడున్న టేబిల్ మీద పెట్టాడు.

"కూర్చో!" అన్నాడు లక్ష్మీనారాయణ.

శ్యామసుందర్ కూర్చుని, "చాలా శ్రమపడి పట్టుకో గలిగాను, విశ్వనాథం బ్రీఫ్ కేస్ దాచిన ఇంటిని. ఎంత గానో బెదిరించవలసి వచ్చింది దీన్ని చేజిక్కించుకోవ డానికి" అన్నాడు.

ఏ భావమూ ముఖంలో కనిపించనీయకుండా, "మంచిది. నీ శ్రమకుతగ్గ ఫలితముంటుంది. ఇక నువ్వు వెళ్ళవచ్చు" అన్నాడాయన.

శ్యామసుందర్ లేచాడు. ఆయనదగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళంగానే లక్ష్మీనారాయణ, ఉత్తరంలో చెప్పిన విధంగానే ప్రయత్నించి బ్రీఫ్ కేస్ తెరిచాడు. అందులో నోట్లకట్టలున్నాయి. పరిశీలించగా ఉత్తరంలో రాసింది నిజమే. నోట్లు పైపైన మాత్రమే ఉన్నాయి. మిగతావన్నీ తెల్లకాగితాలే.

సుందర్రావు తనకిచ్చినపుడు అన్నీ వందరూపాయలు నోట్లుకట్టలే! అతను ఫార్ములాల పేరు చెప్పి బ్రీఫ్ కేస్ ఇవ్వగానే ఆయన ఏ మోసమూ ఉండకుండా చూసు కున్నాడు. ఫార్ములా గురించి కూడా పరిశీలించేముందు తనకు తోచిన నోటుమీద సుందర్రావిచ్చిన పెన్నుతో పరిశీలించి చూశాడు. ఏమీ మోసంలేదని రూఢిచేసు కున్నాకనే, దాచమని భార్యకిచ్చాడు.

లక్ష్మీనారాయణ కళ్ళు ఎర్రపడ్డాయి. శరీరం ఆవేశంతో వణికింది. ఆ ఎరుపూ, ఆ వణుకూ చాలు, ఒక నిండు ప్రాణం పోవడానికి.

## 15

"ఈపాటికి శ్యామసుందర్ చచ్చి ఉంటాడు" అంది సుధ.

"అతను చావడంవల్ల ఎవరికి ప్రయోజనం?" అన్నాడు సుబ్బారావు.

"భలేవారే. ఇరవై రెండు లక్షలరూపాయలు మీ దగ్గర చిక్కుడిపోయాయన్న రహస్యం తెలిసిన ప్రమాద కరమైన వ్యక్తి అతను. అతను పోవడంవల్ల ఎవరికి ప్రయో జనమో మీకే తెలియదా."

"ఇరవై రెండు లక్షలరూపాయలు మా దగ్గర చిక్కుడి పోయాయన్న విషయం మాకే తెలియదు. అతనికి తెలుసు నని మే మెలాగనుకోగలము?" అంది వనజ.

"వెరీగుడ్. భార్యాభర్తలంటే అలాగుండాలి. కానీ ఎవరైనా పాముతో చెలగాటాలాడడం మంచిదికాదని గుర్తుంచుకోండి. మీ దగ్గర ఇరవై రెండు లక్షలరూపాయ లున్న బ్రీఫ్ కేసుంది. అత్యాశకుపోయి దాన్ని స్వంతం చేసుకోవాలనుకున్నారు. కానీ ఇప్పుడు ప్రాణాలమీదకు

వచ్చింది. ప్రాణంకంటె డబ్బెక్కువకాదు గదా. అందుకని అది మాకు స్వాధీనంచేసి మేమిచ్చే అయిదు లక్షల రూపాయల బహుమతితోనూ తృప్తి చెందండి..." సుధ ఇంకా ఏమో చెప్పబోతూండగా—

"ఏమిటీ బ్రీఫ్ కేస్ ఇచ్చేస్తే అయిదులక్షలు ప్రతిఫలమా?" అంది వనజ నమ్మలేనట్లు. సుబ్బారావు ఆలోచనలో పడ్డాడు.

"మీ రిద్దరూ తెలివైనవారు. బాగా ఆలోచించుకోండి' మీ జీవితాలు కొన్ని తరాలపాటు సుఖంగా గడిచిపోవడానికి అయిదు లక్షలరూపాయలు చాలు. ఆ బ్రీఫ్ కేసును మీరు స్వంతంచేసుకుని హాయిగా బ్రతకలేరు' అడుగడుగునా గండాలే, క్షణక్షణమూ భయాలే, ఆ జీవితం మీకు సుఖంగా ఉండదు. బాగా ఆలోచించుకోమని మరోసారి హెచ్చరిస్తున్నాను" అంది సుధ.

"ఎందుకా బ్రీఫ్ కేస్ కోసం ఇంత కష్టపడుతున్నారు?" అన్నాడు సుబ్బారావు.

"అనుకోకుండా ఇంట్లోకి వచ్చినప్పుడే దాన్ని మీరు వదలలేకుండా ఉన్నారే. అటువంటిది స్వంతం చేసుకోవాలని చాలాకాలంగా ప్రయత్నిస్తున్న దానికోసం ఎంతయినా కష్టపడాల్సి ఉంటుంది మేం."

"ఇంతకీ ఎవరు మీరు?" అన్నాడు సుబ్బారావు.

"అది మీకు అప్రస్తుతం. ఆ రహస్యం తెలియకే లక్ష్మీనారాయణగారు కూడా కొట్టుమిట్టాడిపోతున్నారు. మాకు కావలసింది బ్రీఫ్ కేస్. అందులో డబ్బుకంటె ఆ డబ్బు మీదున్న ఫార్ములాలు మాకు చాలా విలువైనవి."

"పాపం చాలాకాలంగా శ్రమపడుతున్నారు. మీ తెలివితేటలు కూడా అద్భుతం. బలవంతుడైన శత్రువుతో తలపడి నెగ్గుకు రాగలుగుతున్నారు."

"బలవంతుడైన శత్రువు గురించి మాకు బెంగలేదు' ఎత్తుకు పైఎత్తులువేసి వాళ్ళని పడగొట్టడం మాకు తెలుసు. కానీ మీబోటివారితోటే ఇబ్బంది వస్తోంది. ఇంతవరకూ మా కారణంగా హత్యలు జరుగలేదు. ముందు కూడా ఆ అవసరంలేకుండా ఉంటే బాగుండును."

సుబ్బారావు తీవ్రంగా ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చాడు.

"ఒకవేళ మీ కిచ్చామనుకోండి. వెంటనే మాకు అయిదులక్షలూ ముడతాయా?" అడిగింది వనజ.

"ముట్టవు. మీరు కనీసం వారంరోజులు ఎదురు చూడాలి. మమ్మల్ని నమ్మాలి. నమ్మి ఎదురుచూడాల్సిందే" అంది సుధ.

"ఇలాంటి వ్యవహారాల్లో నమ్మకాలు పనిచేయవు. మీరు వారంరోజులు గడువడిగింది నోట్లమీదున్న ఫార్ములాలు నోట్ చేసుకుందుకే గదా. మేము మా దగ్గర ఒక అయిదు లక్షల రూపాయలుంచుకుంటాం. మిగతావి మీరు తీసుకు వెడుదురుగాని. నోట్ చేసుకోవడం అయిపోయాక మాకు వాటిలో అయిదులక్షలూ ఇచ్చేయండి. ఫార్ములాలున్న మిగతా అయిదులక్షలూ మీకు ఇచ్చేస్తాం" అన్నాడు సుబ్బారావు.

"ఏమో అనుకున్నాను. తెలివైనవారే" అది సుధ నవ్వుతూ.

"తెలివితేటల్లో మీ కెవ్వరూ సాటిరారు. మా దగ్గర బ్రీఫ్ కేసుందని కనిపెట్టారు. ఆ విషయం మాచేత ఒప్పిం

చారు. అయిదులక్షలతో ముప్పై లక్షలను కొనుక్కుంటు న్నారు'' అన్నాడు సుబ్బారావు.

సుబ్బారావు బ్రీఫ్ కేస్ తెరిచి, కొన్ని నోట్లకట్టలు పట్టుకొచ్చాడు.

''పదిహేడు లక్షల పదివేలు'' అంది సుధ లెక్క పెట్టడం పూర్తయ్యేక.

''అవును. మా దగ్గరింక సరిగ్గా అయిదులక్షల పది వేలున్నాయ్'' చెప్పాడు సుబ్బారావు.

సుధ తలాడించింది.

# 16

''మిస్టర్ సుబ్బారావ్. మీరు మమ్మల్ని మోసం చేశారు'' అంది సుధ.

సుబ్బారావు కంగారుగా ''ఏమిటి మీరంటున్నది?'' అన్నాడు.

వనజ భయంభయంగా సుధవంకనే చూస్తోంది. సుధ తన వానిటీ బ్యాగులోంచి ఒక కాగితం తీసిచ్చి, ''ఈ కాగితంమీద అన్ని వివరాలూ వేసి ఉంచాను. ఆ నంబరు గల నోటు వందరూపాయలది మీ దగ్గరుండిపోయింది. ఏ ఉద్దేశ్యంతో అది మీ దగ్గరుంచుకున్నారో తెలియడం లేదు'' అంది.

సుబ్బారావుకు గుర్తొచ్చింది, ఒక నోటును తను బ్యాంకులో మార్చానని.

''ఒకేఒక్క నోటుకోసం ఇంత రగడెందుకు? కావా లంటే వందరూపాయలూ మీకు చెల్లించుకుంటాను.''

''మాకు డబ్బుతో నిమిత్తంలేదు. ఆ ఒక్కనోటే కావాలి'' అంది సుధ ఖచ్చితంగా.

''ఇందులో ఏదో మోసముంది. ఒక్క నోటుకోసం

ఇంత నొక్కి_స్తారనుకోలేదు. మీరు నిజంగా నా ముఖం లోకి చూసి చెప్పండి. ఒకేఒక్క నోటు కారణంగా మీ ఫార్ములాలన్నీ పోతాయో చెప్పండి."

సుధ ముఖం సీరియస్ గా ఉంది. "మీరు చదువుకున్న సబ్జక్టులో సైన్సు ఉందో లేదో నాకు తెలియదు. ప్రత్యేక మైన యంత్రాలు తయారుచేయాలంటే అన్ని విషయాలూ ముఖ్యమే. మీ దగ్గరుండిపోయిన నోటుమీద, ఈ యంత్రం తయారుచేయడానికి అవసరమైన లోహాలు ఏయే పాళ్ళలో ఉండాలో రాసి ఉంది. సైంటిస్ట్ సుందర్రావు అహో రాత్రులు శ్రమించి కనిపెట్టిన వివరాలు ఆ నోటుమీద వ్రాయబడి ఉన్నాయి. ఆ నోటు లేకపోతే పరిశోధన మళ్ళీ మొదటికి వస్తుంది."

ఈసారి వనజ మాట్లాడింది. "పోనీ ఒక పనిచేస్తే, ఆ సైంటిస్టు సుందర్రావుగారీ ఒక్క సమాచారం చెప్పలేక పోడు. ఆయన్నే వెళ్ళి అడిగితే."

సుధ నవ్వి, "వెనుకటికేదో సామెత చెప్పినట్లుంది. నేను ప్రస్తుతం పడుతున్న కష్టమంతా ఎవరికోసం! సుంద ర్రావుగారికోసమే. ఆయన మనిషినే నేను!" అంది.

వనజ, సుబ్బారావు కూడా ఉలిక్కిపడ్డారు.

సుధ చెప్పడం ప్రారంభించింది. "సుందర్రావు ఫార్ము లాలను లక్ష్మీనారాయణగారి కందించిన రాత్రి విశ్వనాథం, శ్యామసుందర్ లిద్దరూ కలిసి సుందర్రావింట్లో ఆ యంత్రా నికి సంబంధించి ఉన్న సమాచారాన్నంతా నాశనం చేశారు. సుందర్రావు నిస్సహాయంగా ఈ దారుణ చర్య చూస్తూండిపోయాడు. నేను ఆయనవద్ద పర్సనల్ సెక్ర టరీగా ఉంటున్నాను. జరిగింది తెలిసేక నేనాయనకు ధైర్యంచెప్పి, ప్రతీకారంగా ఎలాగో అలా ఆ ఫార్ములా

లాయరున కందజేస్తానని వాగ్దానం చేశాను. లక్ష్మీనారాయణగారితో ఆట ఆడించాను. చివరకు విజయం సాధించాను. కానీ ఇప్పుడు ఒకే ఒక్క అడ్డంకి వచ్చింది. అదే ఒక్క వందరూపాయల నోటు.''

''ఆ నోటు నా చేయిజారిపోయింది. అదెలా జరిగిందంటే...'' సుబ్బారావు వివరించి చెప్పాడు.

అంతా విని నిట్టూర్చింది సుధ, ఐదునిముషాలు మౌనంగా ఉండిపోయింది.

''ఒక పని చేయండి. ఫలానా నంబరు వందరూపాయల నోటు ఎక్కడో పారేసుకున్నామనీ, అది తెచ్చిఇచ్చిన వాళ్ళకి పదివేలరూపాయలిస్తామనీ ఒక ప్రకటన పేపర్లో వేయించండి. రెండ్రోజుల్లో ఆ నోటు మీకు చేరుతో గలదు'' చెప్పింది సుధ.

''వందరూపాయలకు పదివేలరూపాయలా?'' అంది వనజ.

''అంతకుమించి గత్యంతరంలేదు.''

''కానీ ఆ ప్రకటన ఎవరో పిచ్చివాళ్ళు చేశారనుకో వచ్చు. ఎన్నో అనుమానాలకూ కూడా ఆ ప్రకటన దారి తీయవచ్చు'' అన్నాడు సుబ్బారావు.

''ఏమీ భయంలేదు. అది మీ అదృష్టాన్నే మార్చివేసిన నోటనీ, అది పోవడంతో సైకలాజికల్‌గా అప్సెట్టయిపోతున్నామనీ కూడా ప్రకటించండి. మీది నడమంత్రపు సిరిగదా. ఎవరైనా నమ్ముతారీ విషయం?''

''అంత అదృష్టం మార్చేసే నోటయితే మనమే ఉంచేసుకుందామనుకుని ఉంచేసుకుంటే'' అన్నాడు సుబ్బారావు సందేహంగా.

''అందుకేగా పదివేలరూపాయలు. అదేం తక్కువ

మొ త్తం కాదు."

ఆరోజే సుబ్బారావు వెళ్ళి రెండుమూడు పేపర్లలో ప్రకటన ఇచ్చాడు.

# 17

ప్రకటన దేశంలో గొప్ప సంచలనాన్నే కలిగించింది. దానిమీద పత్రికలలోనూ, పేపర్లలోనూ ఉత్తరాలూ, జోకులూ, వ్యాసాలూ వచ్చాయి. వందరూపాయలకు పదివేలిస్తామనడం ద్వారా మనదేశపు పౌరులుకూడా అధిక స్థాయిలో అమెరికన్లకు ప్రతివచ్చారని కొంతమందన్నారు. ఇందులో ఏదో తిరకాసుండకపోదు. ప్రకటించిన వాడో పెద్ద గ్యాంగు లీడరై ఉండాలని కొంతమంది వర్ధమాన గూఢచారులు చెప్పుకున్నారు.

ఎవరేమనుకున్నా ఏంచెప్పుకున్నా చాలామంది ఆ నోటు కోసం ప్రయత్నించసాగారు.

ప్రకటన వెలువడ్డ ఆరురోజులవరకూ ఎవరూ అతని వద్దకు రాలేదు. ఈలోగా ఒక పర్యాయం సుధవచ్చి వెళ్ళింది. సుబ్బారావు పరిస్థితులు వివరించాడు. నోటు రాగానే కబురుపెట్టమని చెప్పి ఆమె వెళ్ళిపోయింది.

ఆరురోజుల అనంతరం ఒకమనిషి సుబ్బారావు దగ్గరకు వచ్చాడు. "మీరు చెప్పిననోటు నా దగ్గరుంది. కానీ అందుకు ప్రతిఫలం పదివేలు చాలదు" అన్నాడు.

"పదివేలకు మించి పైసాకూడా ఇవ్వను" అన్నాడు సుబ్బారావు నిక్కచ్చిగా.

"అది మీకెంతో విలువైనదని మరిచిపోతున్నారు" అన్నాడా మనిషి.

"అది నా కదృష్టం తెచ్చిందని నా నమ్మకం. పదివేల కంటె ఎక్కువ ఖర్చుపెట్టవలసొస్తే ఇంక నాకది ఇచ్చే

అదృష్టమేముంటుంది?" అన్నాడు సుబ్బారావు.

"నేను నమ్మను. అదృష్టానికి మించి మరేదో కావాలి మీకు. అందుకే దానివిలువ లక్షరూపాయలు చేస్తున్నాను" అన్నాడా మనిషి.

"మీరు వెళ్ళవచ్చు" అన్నాడు సుబ్బారావు.

"వెడతాను. కానీ నా చిరునామా ఉంచండి. రెండ్రోజుల్లో మీరే నిర్ణయానికి రాలేకపోతే, ధర ఇంకా పెరుగుతుంది."

"నాకే చిరునామా అవసరంలేదు. ఇంకో గంటలో మీరు మనసు మార్చుకోకపోతే బహుశా నేను దాని ధర తగ్గించేస్తాను" అన్నాడు సుబ్బారావు.

ఆ మనిషి వెళ్ళిపోయేక వనజా, సుబ్బారావూ బాగా చర్చించుకున్నారు. సుబ్బారావు నిర్ణయం సమంజసమైనదే నని వనజ మెచ్చుకుంది. ఆ వందరూపాయల నోటువల్ల మరెవ్వరికీ ప్రయోజనముండదు. దానికోసం పదివేలు వెచ్చించేది తనొక్కడే. ఈ విషయం స్పష్టపడితే ఆ మనిషే నోటును తీసుకొస్తాడు. తీసుకురాకపోయినా తాము అంతకంటే ఎక్కువ ఖర్చుపెట్టదల్చుకోలేదు.

* * *

"ఏం జరిగింది? బేరం ఫైసలు చేసుకొచ్చావా?" అనడిగాడు లక్ష్మీనారాయణ.

"లేదు బాబూ, వాళ్ళు పదివేలకు మించి పైసా ఇవ్వ నన్నారు. రెండ్రోజుల్లో ఏ విషయం నిర్ణయించుకోకపోతే ధర ఇంకా పెరుగుతుందని బెదిరించాను. సమాధానంగా ఒక గంటలోనే మనసు మార్చుకోకపోతే ధరని తగ్గించేస్తా నని ఆయన బెదిరించాడు."

"ఓహో, అయితే మనిషేమీ చలించలేదా."

"లేదండి. కొంచెం కూడా విచారం కనబడలేదండి. అదీకాక వాళ్ళు గ్యాంగు మనుషుల్లా కనపడలేదండి. మొగుడూ, పెళ్ళాం చిలకాగోరింకల్లా ఉన్నారండి." అన్నాడా మనిషి.

"అయితే నాక్కావలసిన మనుషులు వీళ్ళు కాదన్న మాట.ఇంతకీ నువ్వు నిజంగా నోటు సంపాదించగలిగేవా?"

"లేదండి!" అన్నాడా మనిషి.

"ఎవరి దగ్గరుందో ఆ నోటు. అది సంపాదిస్తే రహస్యం బయట పడుతుంది..." అంటూ తల పంకించాడు లక్ష్మీ నారాయణ.

# 18

"బాగా పరీక్షించి చూడండి. ఇదే మీక్కావలసిన నోటనుకుంటాను..."

ఆ నోటును సుందర్రావందుకున్నాడు. అతను జేబు లోంచి పెన్నుతీసి పక్కగదిలోకి వెళ్ళాడు. అతను పెన్నుతో రుద్దగానే అక్షరాలూ అంకెలూ కనబడ్డాయి. అతని ముఖం వెలిగింది.

"సుబ్బారావుగారూ, మీరతనికి పదివేలూ ఇవ్వ వచ్చు." అన్నాడు సుందర్రావు, గదిలో నుండి బయటకు వస్తూ.

ఆ అదృష్టవంతుడికి పదివేలూ ముట్టాయి. అతను వెళ్ళి పోయాడు.

"మిస్ సుధా. ఇప్పుడు మనం రెండు ఉత్తరాలు రాయా ల్సుంది" అన్నాడు సుందర్రావు.

"ఎవరికి?" అంది సుధ.

"ఒకటి ప్రధాన మంత్రికి. నా ఫార్ములాను ప్రభు

త్యానికి ఇవ్వదలుచుకున్నాను'' అన్నాడు సుందర్రావు.

''మీరు చాలా సహృదయయులు'' అన్నాడు సుబ్బా రావు.

''మిస్ సుధ చాకచక్యంవల్ల నా పనులన్నీ సక్రమంగా జరిగిపోయాయి కాబట్టి, ఇప్పుడు నా సహృదయత బయట పడుతోంది'' అన్నాడు సుందర్రావు.

సుధ నవ్వింది. ''లక్ష్మీనారాయణగారిలాంటి వాళ్ళకు ధన మదాంధత లేకపోతే వాళ్ళను తెలివితేటలతో ఓడిం చడం కష్టం. ఆయన ఇంట్లో పని మనుషులను మనుషుల్లా కాక పురుగుల్లా చూస్తారు. అందుకే చాలామందిని నేనా కట్టుకోగలిగి రహస్యాలెప్పటికప్పుడు తెలుసుకుంటూ వచ్చాను. ఆఖరికి నోటు విషయంలోకూడా ఆయన కన్ను పడిందన్న విషయం కూడా అలాగే తెలిసింది.

సరిలెండిగానీ, మీరు రెండుత్తరాలు రాయమన్నారు. ఒక దాని సంగతే చెప్పారు.''

''రెండో ఉత్తరం రాసేక ప్రింటుచేసి అందరికీ పంపిం చాల్సుంటుంది.'' అన్నాడు సుందర్రావు నవ్వుతూ.

''అదేమిటండోయ్.'' అన్నాడు సుబ్బారావు.

''వందకు పదివేలివ్వగల అదృష్టవంతులు. మీకు చెప్ప కుండా ఎలా కుదుర్తుంది? దంపతుల్ని ఆశీర్వదించాలి కూడా......''

''అంటే శుభలేక అన్నమాట.'' అంది వనజ.

''మరి దంపతు లెవరు?'' అన్నాడు సుబ్బారావు.

''ఇంకా మీ కర్థం కాలేదా......'' అంది వనజ.

సుందర్రావ్, సుధ ఒకరి వంక ఒకరు చూసుకుని ముసిముసిగా నవ్వుకుంటున్నారు.

అర్థమైంది సుబ్బారావుకి. అప్పుడే అతనికి గుర్తొచ్చింది. "జాగ్రత్తండోయ్ సుధగారూ. ఎప్పుడైనా రాత్రి సమయంలో మీ వారు మిమ్మల్ని హఠాత్తుగా మిస్ సుధా నీ నంబరు గుర్తుందా, అనడగవచ్చు. జాగ్రత్తగా ఉండండి." అన్నాడు.

సుధ సిగ్గు పడింది. అది నటన కాదు కాబట్టి నిజంగా అందంగా ఉందా సిగ్గు.

—: ఐ పో యిం ది :—



# క్రైమ్‌లో తమాషాలు

## యముడు పరుగెత్తుకు వస్తున్నాడు??

కంగా్రావ్ రోడ్డుమీద పరుగెడుతున్నాడు. అతడి స్నేహితుడు కంగా్రావ్‌ని ఆపి, "ఎందుకలా పరిగెత్తు తున్నావు" అని అడిగాడు.

కంగా్రావ్ ఆయాసంతో రొప్పుతూ "వెనకాల యముడు వస్తున్నాడు, ప్రాణాలు హరించేందుకు" అంటూ మళ్ళీ పరిగెత్తసాగాడు.

ఆ వ్యక్తి ఆశ్చర్యపోయి అటు చూచేసరికి, కంగా్రావ్ భార్యచేతిలో రోకలి పట్టుకొని పరుగెత్తివస్తూ కనబడింది.

యస్. షమీమా రఫీ, కడప.

## స్వర్గం - నరకం

చలపతికి చచ్చేంత ఆకలిగా వుంది.

జేబులోకి చెయ్యి నోమారు దూర్చి వేళ్ళను సుడి గుండంలా తిప్పాడు.

పావలా బిళ్ళ ఎలక్ట్రిక్ షాక్‌లా తగిలింది.

విసుగ్గా నాలుగడుగులు ముందుకేసి మరో ఐదడుగులు ప్రక్కకి నడిచి మెల్లిగా తలెత్తి చూసాడు. ఎదురుగా "హోటల్ సత్కార్" అన్న బోర్డు కనబడింది.

లాభంలేదు! ఓమారు, బిల్ కట్టకపోతే వాడుచేసే సత్కారం గుర్తొచ్చి నిరాశగా ఆరడుగులు వెనక్కేసాడు.

కడుపులో ఎలకలూ, పిల్లులూ ఇంకా మరెన్నో పరిగెడు తున్నట్టుగా వుంది. జేబు గాలితీసేసిన బెలూన్‌లా ఖాళీగా వుంది.

మరో పావుగంట లోపుగా ఏదొకటి తినకపోతే, తన పని చస్నాలా గనే అని నిర్ణయించుకున్నవాడై, చలపతి ఏంచెయ్యాలో, పాలుపోక, ఎలక్ట్రిక్ స్థంభంలా నిటారుగా నిలుచుని ఉన్నప్పుడు అతనికి కరెంట్‌లా ఓ ఆలోచన, తట్టింది. వెంటనే అర్జెంటుగా సంతోషపడి గబగబా హోటల్‌లోకి పరిగెత్తాడు.

హోటల్ దాదాపుగా ఖాళీగా వుంది. చలపతి కొద్దిగా చప్పబడ్డాడు. తన వలలోపడే చేప ఏదైనా వుందా అని నాలుగువైపులా ఓమారు చూసి, చివరికి ఫారెక్స్ ఎడ్వర్టైజ్ మెంటులా కనబడుతోన్న ఓ ముప్ఫయి సంవత్సరాల అబ్బాయ్‌వైపు నడిచాడు. ఆ వ్యక్తి చలపతిని చూసి, ఎందుకోగానీ కొద్దిగా మొహం చిట్లించాడు.

దూరంగా సర్వర్ వస్తున్న అలికిడై చలపతి ఖంగారుగా లేచాడు. "చూడండీ మాష్టారూ....మీరు మరోలా అనుకో పోతే.... సైకిల్ లాక్‌చెయ్యడం మరిచిపోయా....ఇప్పుడే వస్తాను. మళ్ళీ అర్జెంటుగా వెళ్ళాలి. ఈలోగా సర్వర్‌గానీ వస్తే పూరీకి ఆర్డర్ ఇవ్వండి," అంటూ సమాధానంకోసం చూడకుండా గబగబా బయటికి నడిచాడు.

రెండు నిమిషాల తరువాత కొద్దిగా ఎండిపోయిన పెదా లను తడి చేసుకుంటూ లోపలికి వచ్చాడు. మరో రెండు నిముషాల గడవకముందే పొగలు కక్కుతున్న పూరీతో ప్రత్యక్షమయ్యాడు సర్వర్.

అవతలి వ్యక్తి మధ్య మధ్య పేపరుచూస్తూ, దోశ తింటున్నాడు.

చలపతి పూరీ తినడం పూర్తిచేసి, చేతులు కడుక్కోడానికి వాష్‌బేసిన్‌వైపు నడిచాడు.

చలపతి తిరిగొచ్చేసరికి అతను ఖాళీ ప్లేట్లు ప్రక్కకి నెడుతూ కనిపించాడు. మెల్లిగా లేచి అతను కూడా వాష్ బేసిన్‌వైపు దారితీసాడు.

ఇదే సరైన అదును. త్వరగా బైటపడాలి.

అంతగా సర్వర్ అడ్డుపడినా బిల్ అతను ఇస్తాడని చెప్పొచ్చు. పైగా తన ఆర్డర్ కూడా అతని ద్వారానే ఇప్పించాడు. గబుక్కున లేచాడు.

ఎదురుగా సర్వర్ నవ్వుతూ కనిపించాడు. "ఇంకా ఏంకావాలి సార్!"

ఎలాగో గుండె దిటవు చేసుకున్నాడు చలపతి. "మరేం వద్దు. ఆఁ అన్నట్టు ఇక్కడ కూర్చునున్నాడు చూడు అతను నా స్నేహితుడేలే. ఇద్దరిదీ ఒకే బిల్‌పత్రా" అంటూ ఓ అడుగు ముందుకేసాడు.

సర్వర్ మొహంలో నవ్వు మాయమైంది. చలపతిని ఓమారు ఎగాదిగా చూసి, "భలేవారండీ మీరు. మొత్తం బిల్లు మీరే కడతారనే మీకే ఇమ్మని ఆయన చెప్పాడు గదండీ...."

మాడిపోయిన మొహంతో, "అతనేడీ?" అని చలపతి ఏడుస్తూ అడిగిన ప్రశ్నకు బదులుగా "లేడు. వెళ్ళిపోయాడు. ఆఁ ఇదిగోనండి మొత్తం బిల్లు" అంటూ ఓ కాగితాన్ని ప్రేమగా చలపతికి అందించాడు సర్వర్.

—యం. ప్రభాకరరెడ్డి, నల్లకుంట.

## తాళం చెవి?

పట్నంలో చదువుకుంటున్న కుమారరత్నం సెలవుల్లో వూరొచ్చాడు. సెలవు దినాలు గడిపి తిరిగి పట్నం వెళ్లాడు. మూడోరోజున అతని నుంచి ఓ ఉత్తరం వచ్చింది ఆ తండ్రికి.

"నాన్నా! నేను పట్నం చేరి రూము కెళ్ళి చూసుకోగా, తాళంచెవులు లేవు. అవి మన గడ్డివాములోగాని, కందిచేను దగ్గరున్న పాకలోగాని, మన పక్కింటి పంకజం వాళ్ళ ఔట్‌హౌస్‌లోగాని పడివుంటాయి. వెంటనే వెతికించి పంపగలరు—కుమారుడు."

—ఎస్ హమీద్, కడప.

## గుడి—నరకం

"ఏరా రవీ! రోజూ గుడికి వచ్చేవాడివి నీ పెళ్ళి జరిగాక రావటం మానివేశావే?" రవిని అడిగాడు శర్మ.

"రోజూ గుడికి వస్తుండటంవల్లే నా జీవితం నరకంలా తయారయింది. ఇప్పుడు పశ్చాత్తాపపడితే ఏం లాభం!?" బాధగా అన్నాడు రవి.

"గుడికి రావటంవల్ల నీ జీవితం నరకంలా తయారయిందా! అసలు కారణం ఏమిటి?!!" అన్నాడు శర్మ.

"నా భార్యతో మొట్టమొదట గుళ్ళోనేగదా పరిచయం అయింది." అన్నాడు.

— దేవరపల్లి హరిబాబు, రాజమండ్రి-3.

## మా తదుపరి చిత్రం?

ఒక నిర్మాత, ఆర్టిస్టును "మా తదుపరి చిత్రము కుశలవులు" అని వ్రాయమన్నాడు.

తీరా ఆర్టిస్ట్ వ్రాసినది చూసి తెల్లబోయాడు నిర్మాత. ఆ ఆర్టిస్టు వ్రాసినది ఇలా వుంది—

"మా తదుపరి చిత్రముకు శలవులు."

—ఎస్. వి. వరప్రసాద్, విజయవాడ.

## దివ్యమైన ఉద్యోగం?

ఆఫీసరు: అసలు ఇంక్రిమెంటెంత?

ఉద్యోగి: ఏడాదికి వందరూపాయలు.

ఆఫీసరు: వారానికి శెలవ లెన్ని ఇచ్చేవాళ్ళు?

ఉద్యోగి: నాలుగు రోజులు.

ఆఫీసరు: మరి నువ్వలాంటి దివ్యమైన ఆఫీసులో పనెందుకు మానేసుకున్నావు?

ఉద్యోగి: నేను మానేయలేదండి! కంపెనీయే దివాలా తీసింది. —గోగుల జగన్నాధరావు, యలమంచిలి.

## సులభమైన హత్య?

ఇష్టంలేని పెళ్ళి చేసుకున్న ఈశ్వర్రావుకి, పెళ్ళాం జబ్బుతో పడివుండడం మరింత ఏవగింపు కలిగించింది. ఆ విషయం తన స్నేహితుడు హత్యేశ్వర్రావుకి రాశాడు—

"ఈ పరిస్థితుల్లో కేసు మన మీదకు రాకుండా నా భార్యను ఎలాగయినా చంపాలని, దానికి నీ సహాయం అవసరం" అనీ.

దానికి తిరుగుటపాలో హత్యేశ్వర్రావు సలహా రాసి పంపాడు: "హత్య చేయడం చాలా కష్టం! చేస్తే దొరికి పోవడం ఖాయం. అంచేత గవర్నమెంటు హాస్పిటల్లో చేర్పిస్తే, మన చేతికి మట్టి అంటకుండా పనులు జరిగిపోతాయని, నా ప్రగాఢ విశ్వాసం."

—ఆడారి వెంకటరమణ, యలమంచిలి. ★

